# సబ్బులన్నియు శుభ్రపరచును కాని....

## ... నిష్కళంకమైన చర్మసౌందర్యం నిమిత్తం
## జి-11తో గూడియున్న సింథాల్
## మీకు కావలెను.

సింథాల్ యందు గల జి-11 (హెక్సాక్లోరోఫీన్) చర్మ బాధలను గలిగించే హానికరమైన క్రిములను చంపుతుంది. ఆహ్లాదకరంగా పరిమళమొనర్చబడినటువంటి జి-11 తోగూడియున్న సింథాల్ మీ చర్మమును మృదువుగాను, ప్రకాశమానంగాను వుంచుతుంది.




INTERPUB GCS 9A-TEL

### గ మ ని క

శ్రీమతి కె. మాధురీదేవి, ఏలూరు; వెంటనే తమ పూర్తి చిరునామా తెలియ పరచవలసినదిగా కోరుతున్నాము.

—పం॥

### ముఖచిత్రం

(ఉగాది ప్రత్యేకసంచిక) ముఖచిత్రం చాలా బాగుం దనుటకు అతిశయోక్తి కాదు. 'కార్టూను' చిత్రాలు కడుపుబ్బ నవ్విస్తున్నాయి. లేఖావాణిలో వాణిశ్రీ ఇచ్చిన జవాబులు గమ్మత్తుగా నున్నాయి. కథలన్నీ బాగున్నాయి. మంచి మంచి కథలనందిస్తున్న రచ యితలకు ప్రచురిస్తున్న మీకు నా ధన్యవాదాలు.

టి. రాజవల్లభాయి ( ముపుకాల )

* * *

# ఉత్తరాలు

### సీరియల్

'మూడుముళ్ళు' సీరియల్ ముగింపు చాలా బాగుంది. దుష్టబుద్ధి అయిన నళినిని సామాన్యంగా వదిలిపెట్టిన కామేశ్వరి పాత్రచిత్రణ చాలబాగుంది. రచయిత్రి అచ్యుతవల్లి మిక్కిలి అభినందనీయులు. కార్టూన్లు చాలా బాగుంటున్నాయి. మల్లన్నమంత్రి రాజనీతిజ్ఞ కథలు బాగున్నాయి.

పాటేళ్ళ మహాలక్ష్మీప్రసాద్ విజయనగరం )

### క థ లు

డాక్టర్లలో కవితావేశం కలగడం అరుదు అను కునేవారు. కాని మెడికో కె. వి. కృష్ణకుమారిగారు ఆ అపవాదును మొదలంటా నరికేశారు. ఇంతకు ముందు ఎంతో మంది పెద్దలు నిరూపించినా — మరోసారి ... మిథ్యాబింబాలు రచయిత్రి కృష్ణకుమారిగార్కి అభివందనములు.

కాదంబరి శ్యామలరావు ( కాకినాడ )

* * *

మీరు ప్రచురించిన, "మిథ్యాబింబాలు" కథ చదివిన తరువాత రచయిత్రి అనుభవముగా వ్రాసిన దని వూహించుటకు అట్టే సమయము తీసుకొనదు. అందులోని వేణు ( డాక్టరు ) పాత్ర చాలా చక్కగా ఉన్నది. కలంపట్టే చేతులతో, (వృత్తి ధర్మములో) కత్తులు పట్టుకొనునట్లుగా చాలా సహజముగా వేణుపాత్ర సృష్టించిన రీతి చాలా బాగున్నది. పత్రికద్వారా 'కుమారి కృష్ణకుమారికి' నా అభివంద నలు తెలియచేయవలసినది.

మధుసూధనరావు (విజయవాడ—2)

* * *

5—4—68 పత్రికలోని కుమారి కె. వి. కృష్ణ కుమారిగారు వ్రాసిన 'మిథ్యాబింబాలు' కథ చదివి ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోయాను. ఈకథ వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది. కృష్ణకుమారిగారు తన రచనలో డాక్టరు వేణుచే వ్రాయించిన కథ ఎన్నెంతో ఆకర్షించింది.

మమతను పెంచుకొని, తనమీద ఆశలుపెట్టు కున్న శాంతిని ఆటబొమ్మగా భావించి మనసుతో ఆటలాడుకొని, అన్యాయము చేసినప్పటికీ, అది రవి లోని మానసిక బలహీనత క్రింద చూపించి, చివరకు పశ్చాత్తాప హృదయుడుగా చిత్రించి శాంతిని గుర్తింపచేసి పోషించిన రవి పాత్రను నిందింపజేయ నట్లుకాక, సానుభూతికి కారణమైనది.

ఈ కథను ప్రచురించి అందచేసిన మీకు, వ్రాసిన కుమారి కె. వి. కృష్ణకుమారిగార్కి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

వి. ఇందిర ( హైదరాబాదు )

* * *

ఈ వారం (5—4—68) సంచికలో ప్రచురిత మయిన కథలలో "గుండెల మీద కుంపటి"కథ అత్యుత్తమంగా ఉన్నది. "మూడుముళ్ళు"సీరియల్ సమాప్తం అనిచూచి ఇంతమంచి సీరియల్ ఇంత వేగం పూర్తిఅయినందుకు విచారించేను.

కె. ఎస్. ఆచార్యులు ఇచ్ఛాపురం )

* * *

5—4—68 సంచికలో ప్రచురించ బడిన 'గుండెలమీది కుంపటి' కథ చాల బాగుంది. 'మూడు ముళ్ళు', మొదలగు సీరియల్సు కూడ బాగున్నవి. ముఖ్యంగా ఏప్రిల్‌ఫూల్స్ కార్టూన్ హాస్యాస్పదంగా ఉన్నది. బాబుకు అభినందనలు.

దావులూరి లక్ష్మణ కుమార్, యాతవాకిళ్ల, శ్రీనివాసరావు ( ఖమ్మం )

* * *

5—4—68 సంచికలోని 'మిథ్యాబింబాలు' మరియు 'గుండెలమీది కుంపటి' అనే కథలు చాల బాగున్నాయి. 'గుండెలమీది కుంపటి' కథ రచన ఎవరు గావించారో కాని కథకు పెట్టినపేరు నిజంగా చాల ఉన్నతంగా ఉంది. వి. వి.స్వామి, (కరీంనగరం)

తప్పక చూడండి!



శ్రీరాజ్ ప్రొడక్షన్స్

సమర్పించు

# ముద్దుపాప

మాటలు-పాటలు_అనిసెట్టి దర్శకత్వం: కె.ఎస్. గోపాలకృష్ణ

సంగీతం: కె.వి. మహాదేవన్. పామర్తి



ఆంధ్ర: జోతి. నైజాం: ఉషా. సీడెడ్: జయలక్ష్మి.

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల వయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా. వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమంయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్ర సచిత్ర వారపత్రిక*

# ఉత్తరాలు

## ఫిలిం బాలట్

పత్రికలో ప్రకటించిన '67' సంవత్సరపు 'ఫిలిం బ్యాలెట్' ఫలితాలు సంతృప్తిని ఇవ్వలేదు. ముఖ్యంగా ఉత్తమ చిత్ర విషయంలోను ఉత్తమ నటుడి విషయంలోను, అన్యాయం జరిగినది. కేవలం ఒక పక్షపాత బుద్ధితో పాఠకులు ఎన్నిక చేయడం జరుగుతున్నది కానీ, నిజమైన మంచి దృష్టితో చూసి ఉత్తములను ఎన్నుకోవటంలేదు. కనుక మీరు ఈ 'బ్యాలెట్' నడుపుట ఆపి వేయడం మంచిది.

వై. కె. మూర్తి (విజయవాడ)

*　　*　　*

మీరు ప్రతి ఏడాది జరుపు ఈ "ఫిలిమ్ బాలట్" ఈసారి కూడా ఘనవిజయం సాధించిందని చెప్పాలి. ఈ బాలట్ ప్రవేశపెట్టి, పాఠకుల్లో (సినిమా లంటే ఇష్టమున్నవాళ్ళు) ఉత్సాహాన్ని ఇనుమడింప జేస్తున్నారు. ఈ బాలట్ ఇలాగే శాశ్వతంగా వుండి పోవాలని నా మనవి. ఈ సంవత్సరపు "ఫిలిమ్ బాలెట్"లో విజయాన్ని సాధించిన నటీనట వర్గానికి, సాంకేతిక వర్గానికి, నా హృదయపూర్వక ధన్యవాదాలు మీ తరపున తెలుపగోరెదను.

వి. లక్ష్మీనరసయ్య (హైదరాబాద్)

## వ్యాసాలు

8—3—68 సంచికలో స్వర్గీయ దీనదయాళ్ జీని గురించిన వ్యాసం మాకెంతో నచ్చింది. స్వచ్ఛంద దేశభక్తుడు, నిస్వార్థ సేవకుడు నిర్మలమూర్తి, మహనీయ వ్యక్తిని మనం కోల్పోయాము. వ్యాసంలో చిన్నపొరపాటు దొర్లింది. రైల్వే పోర్టరుకి 1 దువందలు కాదు, 400 రూ. ఇచ్చినట్లు పేపర్లలో చూశాను.

అదే సంచికలో శ్రీమతి మహీధర సుభద్రగారు అమరాకొమారా (అమెరికా కాద, గదా?) దేశంలో. వ్యాసం మమ్మల్ని నవ్విస్తూనే ఎన్నో సంగతులు స్వీట్‌గా తెలియజెప్పినందుకు ఆమెకి మా ధన్యవాదాలు. వార్తలు, కథలు ఎక్కువ ప్రచురిస్తూ పత్రికని ఆకర్షణీయంగా అందిస్తున్నందుకు మీకు నా కృతజ్ఞత.

పి. వి అనూరాధ (విశాఖ)

*　　*　　*

8—3—68 ఆంధ్రపత్రికలో మీరు ప్రచురించిన శ్రీమతి మహీధర సుభద్రగారి 'అమరాకొమరాదేశంలో మాశ్రీవారితో నేనూ' వ్యాసం బాగుండలేదు. మనదూరలవాట్లను, మూఢాచారాలని నిందించవచ్చు, కాని మన సంస్కృతిని నిందించటం ఎంత బాగుండలేదు. అది ఉదాత్తమయినదని పాశ్చాత్యులందరికీ తెలిసిందే! భారతదేశం ఇతర దేశాలని మించి పురోగమించాలి. పాశ్చాత్య వ్యామోహం ప్రభవించ కూడదు.!

—శ్రీమతి టి. జనవేశ్వరి, (ఒంగోలు) ●


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 19—4—'68

కీలకనామ సం॥ చైత్రమాసం॥ బహుళ సప్తమి

సంపుటము : 60 సంచిక : 32

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ శేషగిరిరావు.

# ఆదర్శవంతమైన అభివృద్ధిని సాధిస్తున్న జపాన్

టోకియో విమానాశ్రయంలో రాత్రి 10 గంటలకు దిగాం అంతా అయోమయంగా ఉంది సెమినారుకు హాజరైన జపాను ప్రతినిధులు హాంకాంగు నుంచి నాకు తోడుఉన్నారు విమానాశ్రయంలో ఒక గంట ఆలస్యమైంది లోపలనుండి వచ్చేటప్పుడు మాత్రమే తెరువబడే గాజు వాకిళ్ళు విమానాశ్రయంలో ఒక ప్రత్యేకత యిచటినుండి టోకియో నగరంలోకి పదిమైళ్ళు మనోరైలులో ప్రయాణం దూరదేశాలనుండి వచ్చే ప్రయాణికులకు స్వాగతం చెబుతుంది యీ మనోరైలు జపాను వారి ప్రత్యేకత, పరిశుభ్రమైన అధునాతన రాకపోకల సౌకర్యంకు యీ రైలు ఒకమచ్చుతునక యిందులో అమర్చిన లోహపు ప్లేట్లు, చక్రాలు, తివాసీలు తళతళ మెరుస్తూ ఉంటై

టోకియోనగరం అంటే నా ఊహాప్రపంచంలో ఎంతో మిరుమిట్లు గొల్పుతూ యీ మహానగరంలో మనం ఎట్లా సంచరించేది, అనేటంత భయానకరమైన అంచనాలు కొన్ని ఉన్నాయ్ హాంకాంగు 40 లక్షల జనాభా అయితే టోకియో 120 లక్షలు కాని యిచట నా ఊహల తారుమారైనాయ్ ముఖ్యమైన వీధుల్లో గూడా ఏడు ఎనిమిది అంతస్థుల భవనాలు చాల తక్కువగా కనిపించుతాయ్ పది పదిహేను అంతస్థులవి ఎక్కడో ఒకటి ఉంటుంది మిట్సుబిషి కంపెని ఆఫీసు మాత్రం 36 అంతస్థుల భవనం యిప్పుడేపూర్తి అవుతుంది రాత్రి విమానంలోనుంచి టోకియో నగరాన్ని పరికించినప్పుడే ఆకర్షణీయమైన దృశ్యాలేవి కనిపించలేదు

ఈనాడు ప్రపంచంలో అభివృద్ధి చెందిన రాజ్యాలల్లో ప్రథమశ్రేణిలో ఎట్లా ఉంది? దీని వైశాల్యం చాలా కొద్ది పదులు లేవు ఖనిజాలు లేవు పత్తి, యినుము, బయటినుండి దిగుమతి చేసుకొంటుంది పదికోట్ల జనాభాగలదేశం ఈనాడు ఉత్పత్తిశ్రేణిలో ప్రపంచ పారిశ్రామిక దేశాలలో జపాను నాల్గవది యింగ్లండు, ఫ్రాన్సు దేశాలను అధికమించింది ఆసియా ఖండానికే యిదొక గర్వకారణం

కనుక జపానును మనం సాకల్యంగా అర్థం చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది ఒకనాడు జపాను ఆసియాఖండంలో జబ్బుపడిన రోగి, సిక్ మాన్ ఆఫ్ ఏసియా అని చరిత్రలో నిందార్హురాలైంది నేడు ఆసియాఖండంలో ప్రచండ భానుడుగా ప్రజ్వరిల్లుతుంది

జపాను సహజ సంస్కృతి, నాగరికతను ఎంతో విలువగా పోషించుకొంటున్నదని చెప్పాలి ఆధునిక నాగరికతా ప్రపంచ విలసితమైన నూతన హోటళ్ళు టోకియోలో అనేకం కనిపించుతాయ్ నాలుగు సంవత్సరాలనాడు, ప్రపంచ క్రీడా పోటీలు జరిగినప్పుడు, అతిథుల కోసమై టోకియోలో 20, 30 అధునాతనమైన హోటళ్ళను నిర్మించారు అదే చోట ముఖ్యమైన కేంద్రాలలో సాంప్రదాయ జపాను హోటళ్ళు ఉంటాయ్ పైగా, దుబారా కృత్రిమ జీవితస్థాయిలు ఒక ఆదర్శంగా పెట్టుకొన్న పెద్దలు వీటికి అంత ప్రాధాన్యత యివ్వకపోవచ్చు కాని జపానీయులు వీటికి ఎంతో ప్రాధాన్యత యిస్తారు ఈ హోటళ్ళను అంత పరిశుభ్రంగా ఉంచుతారు భోజన ఫలహారాలు యిచ్చుటనే సేవించుతారు ఎవరైనా మిత్రులు వారికి ఆప్తులుగా వచ్చినప్పుడు యీ హోటళ్ళలో ఫోంచేస్తారు నా పద్ధతులు ఫలహారాలూ నచ్చినవా అని అడుగుతారు చాలా బాగున్నవంటే మురిసిపోతారు

నేలమీద తివాసీ పరచి బాసి పట్టు వేసి కూర్చుంటారు ముందు చిన్న టేబిలుపైన ఫలహారాలు వడ్డించుతారు మనకు కావలసిన ఫలహారాలు చెబితే అప్పటికప్పుడు వండి వడ్డిస్తారు. గ్యాస్ పొయ్యి లేక కరెంటు పొయ్యి మన టేబిలు మీదనే ఉంటుంది హోటళ్ళల్లో సర్వీసు చేసే వారంతా బాలికలే ఆప్యాయత, మర్యాద, ఆదరణకు యీ బాలికలకు పెట్టింది పేరు మన హృదయాన్ని దొంగిలించేటంత ఆప్యాయతలు వీరివి.

యిచట అంతా మాంసాహారులే అనేక రకాల వంటలు తయారు చేస్తారు కోడి అతి చౌకైన ఆహారం జపానులో కోళ్ళ పెంపకం ఎక్కువ. సగటున 30 వేల జీవాలకు తక్కువ పౌల్ట్రీలు ఉండవు ఒకొక పౌల్ట్రీలో లక్షా రెండు లక్షల జీవాలు గూడా ఉంటై అన్నం ప్రతిచోట దొరుకుతుంది

టోకియో టవరు ప్రపంచంలో ఎత్తైనది. దీని ఎత్తు 333 మీటర్లు పైన టెలివిజన్ ప్రసార కేంద్రం అమర్చారు ఈ టవరులో పైకి ఎక్కడానికి రెండు లిఫ్టులు ఉన్నాయ్ 220 మీటర్లవరకు తీసుకెళ్ళుతారు రాత్రివేళ లైటు కాంతితో టోకియోనగరం రంగురంగుల విద్యుత్ కాంతులతో శోభిల్లుతూ ఉండేటప్పుడు యీ టవరుపైకి వెళ్లి తిలకించితే ఎంతో మనోహరంగా ఉంటుంది యీ ప్రదేశం ఆకాశం నుండి క్రింది నగరం చూడ్డానికి టోకియోలకి నేడు ఏర్పాటైన ఆధునిక శిఖరం అని చెప్పాలి

ఒకరోజు జంతు ప్రదర్శనశాలకు వెళ్ళాను మన నెహ్రూగారు బహూకరించిన 'ఇందిరా' అనే ఏనుగు ఉంది యీ జూలో మన ఇందిరా గాంధి గారి మాదిరి యీ గున్న యిప్పుడు చాలా పెద్దదైంది ఈ జూలో పిల్లల రైలు ఒక ప్రత్యేకత పైన కమ్మి ఆధారం చేసుకొని ప్రేలాడుతూ వెళ్ళుతుంది యిచట చేపల ప్రదర్శన అతివిశిష్టమైనది ఈజూలో సియోల్ అనే నీటిపక్షుల ప్రదర్శన అతివినోదమైనది సర్కసులో మాదిరి యీ పెద్ద జంతువుల తోటి అతినున్నితమైన పనులు చేయిస్తుంటారు యిందులో ఒక ఓపెన్ ఎయిర్ థియేటరులో యిటువంటి వినోద కార్యక్రమం జరుపుతూ ఉంటారు

టోకియో నుండి 50, 60 మైళ్ళ దూరం వెళ్లి పరిశ్రమల ప్రాంతం చూసి వచ్చాను నన్ను జపాను ఆహ్వానించిన అమోనియం క్లోరైడు సంస్థవారు క్లోరైడు ఫ్యాక్టరీకి తీసుకొని వెళ్ళి చూపించారు రోజుకు 10 వేల టన్నుల అమోనియం క్లోరైడ్ ఉత్పత్తి చేసే యీ ఫ్యాక్టరీలో మూడు షిఫ్టులలో కలసి 71 మంది పని చేసున్నారు నేను చూసినప్పుడు పగలు 21 మంది మాత్రమే పని చేస్తున్నారు మానవ శ్రమనేది బహుకొద్ది అంతా ఆటోమేషన్ వారి పరిశ్రమలను గురించి ఎంతైనా వ్రాయవచ్చు మనదేశంలో



జపాను గ్రామాలలోని రైతులు పొలంలోనే వేరుశనగకాయలు వొలిచే యంత్రం, జపాను రైతు కుటుంబంతో వ్యాస రచయిత.

ఉత్పత్తిదారుడు, ఉద్యోగి, కార్మికుడు రాజకీయవాది విభిన్నంగా ఆలోచన చేస్తారు జపాను వారి మనస్తత్వం మనకు అర్థం కావటం చాలా కష్టం వారికి మన విభిన్న ఆలోచనలు లేవు మనదేశంలో నాలుగు విభిన్న ఆలోచనలు గలిగి ఉండే యీ వర్గాలలో దేశభక్తి, కర్తవ్య ప్రబోధం యీనాడు సాధ్యమేనా, అనిపించుతుంది మనవారి మనస్తత్వంలో ఏదైనా విపరీత మార్పు వస్తే తప్ప జపానువారిలో మనకు గోచరమయ్యే ఆత్మాభిమానం అన్యోన్య సహకారం అనేవి ఊత పదాలుగా మాత్రమే ఉంటాయ్ తన కవసరమయినప్పుడు ఎంత ధర్మోపన్యాసాలైనా చేస్తారుగాని, తాను త్యాగం చేసి సమిష్టి అభివృద్ధిని సాధించుటకు పూనుకొనేవారు లేరు, మన సంఘంలో

వ్యవసాయరంగంలో జపానువారు ఎంతో ప్రగతి సాధించారు పొలాలలో అన్నిపనులూ యంత్ర సహాయంతో చేస్తారు ఒక పశువు కనిపించదు మనకంటే ఐదు రెట్లు సగటు ఉత్పత్తిని వీరు వ్యవసాయరంగంలో సాధించుతున్నారు టోకియోకి 60 మైళ్ళ దూరంలో ఉన్న చిబా వ్యవసాయ పరిశోధన కేంద్రానికి వెళ్ళాను రెండు సంవత్సరముల కోర్సుతో వ్యవసాయ కళాశాలలో 200 మంది విద్యార్థులు చదువుకొంటున్నారు నూరుమంది గ్రామాల నుంచి వచ్చిన యువకులు ఒక సంవత్సరం కోర్సులో తర్ఫీదు పొందుతున్నారు యిటువంటి వ్యవసాయ పరిశోధన కేంద్రాలు ప్రిఫెక్చరు కొకటి అంటే జిల్లా కొకటి ఆదేశంలో ఉంది

ముగ్గురు రైతులు మూడు గంటలలో 45 బస్తాల వేరుశనక్కాయల మిషనులో నూర్పిడి చేశారు అట్లాగే ధాన్యం గూడా నూర్పిడి చేసి పొలం నుండి తీసుకెళ్ళుతున్నారు యిచట రైతులతో, ఆ యంత్రాలను ఎంత సులువుగా ఉపయోగించుతున్నది ముచ్చటించి తెలుసుకొన్నాను మన దేశంలో గూడా ఎంత తొందరగా యీ పశుసంపదను వ్యవసాయ క్షేత్రాల నుండి తొలగించితే మన పల్లెసీమలో నూతన యాంత్రిక వికాసం అంత త్వరగా కలుగుతుంది విశ్రాంతి విజ్ఞానం విస్తరించుతుంది

జపానులో ఎక్స్ప్రెస్ సూపరు ఎక్స్ప్రెస్ గంటకు 130 మైళ్ళు వేగంగా పయనిస్తుంది ప్రపంచంలో మరెచ్చటా యింత వేగంగా పోయే రైలు బళ్ళు లేవు ఈ బండిలో హటామీ వెళ్ళాను టోకియో నుండి ఒసాకా 800 మైళ్ళు, కొన్ని వేళలందు టోకియో నుండి ఒసాకాకు ప్రతి అరగంటకు ఒక రైలు వెళ్ళుతుంది ఈ బండినే బులెట్ ఎక్స్ప్రెస్ అనిగూడా అంటారు

మధ్యమధ్య అంగళ్ళు, బజారులు, సినిమాలు, కబూకి నాటకాలు వినోదాలు నైటుక్లబ్‌లు వారి జీవితాలు అర్థం చేసుకొంటూ, రాజకీయ నాయకులతో సంభాషణలు జరుపుకొంటూ— నేతాజీ నాయకత్వాన యేర్పాటు చేసిన స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనిన పెద్దల్ని కలుస్తూ గడపాను

జపాను దేశం, ప్రజలను గురించిన అనేక విషయాలు తెలుసుకొని, నూతన అనుభూతులు ఎన్నో పొంది, మెరుగైన స్నేహబృందాన్ని సంపాదించుకొని, మరువురాని స్మృతులతో, చిరస్మరణీయమైన అనుభవాలతో జపాను వీడి స్వగ్రామం చేరాను. —వి. ఎల్. సుందరరావ్



# డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్

ప్రముఖ అమెరికన్ నీగ్రో నాయకుడు డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్ ఏప్రిల్ 5 వ తేదీనాటిరాత్రి మెంఫిస్‌లో తాము బస చేస్తున్న హోటల్‌లో ఒక శ్వేతజాతి యువకుని రివాల్వర్‌కి గురై మరణించారు

డాక్టర్ కింగ్ జార్జియాలోని అట్లాంటస్‌లో 1929 జనవరి 15 న జన్మించారు తమ 19 వ ఏట బి ఏ డిగ్రీ తీసుకున్నారు 1955 లో బోస్టన్ విశ్వవిద్యాలయంనుంచి డాక్టరేట్ తీసుకున్నారు

మహాత్మాగాంధీ మార్గాన్ని అనుసరించిన డాక్టర్ కింగ్ అమెరికాలో జాతివిచక్షణకు ప్రతికూలంగా సదరన్ క్రిస్టియన్ లీడర్‌షిప్ కాన్ఫరెన్స్ అనే తీవ్రవాద బృందాన్ని నెలకొల్పారు కాని ఈ తీవ్రవాదం అహింసాత్మక సూత్రాల పై ఆధారపడినది

1955 లో మాంట్‌గోమరీలో జరిగిన నీగ్రోలకి బస్సులలో ప్రత్యేకమైన సీట్లు కేటాయింపు ప్రతికూలోద్యమానికి నాయకత్వం వహించి విజయాన్ని సాధించారు. 1959 లో గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని స్వయంగా పరిశీలించేందుకు భారత దేశం వచ్చారు

ఆయన శాంతిప్రయత్నాలకి ప్రశంసగా 1964 లో నోబుల్ బహుమతి లభించింది తద్వారా వచ్చిన డబ్బుని పౌర హక్కుల ఉద్యమానికి విరాళం ఇచ్చారు డాక్టర్ కింగ్

డాక్టర్ కింగ్‌కు భార్య, నలుగురు పిల్లలు ఉన్నారు

మహాత్మాగాంధీ అహింసా సిద్ధాంతాన్ని అనుసరించిన డాక్టర్ కింగ్ గాంధీజీలాగే దారుణ హత్యకి గురి కావటం విచిత్రం. శాంతికోసం కృషిచేసే అగ్రశ్రేణి నాయకుని ప్రపంచం పోగొట్టుకున్నది

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమలరామచంద్ర




కథకుడైన శంగమకుడు ఈ విధంగా అన్నాడు: 'దేవా, నీకు త్వరలో దేవీ సమాగమం కలుగుతుంది. విస్తీర్ణమయిన ఈ దుఃఖజలధిని తరించిన మీదట తప్పక శుభం కలుగుతుంది. దీనికొక కథను విన్నవిస్తాను:

పూర్వం మాళవదేశంలో ఇద్దరు బ్రాహ్మణులు వుండేవారు. వారు అన్నదమ్ములు. ఒకని పేరు కాలనేమి, మరొకని పేరు అభయుడు. ఇద్దరూ మహావంశంలో పుట్టినవారు; గుణం, శీలం కలవారు. చాలా బుద్ధిమంతులు. కాని, నిర్ధనులు కావడంవల్ల ఏమీ చేయలేక నిర్విణ్ణులయి వుండేవారు. వారిద్దరిలో కాలనేమి విష్ణు వక్షస్థలమనే ఆకసంలో చంద్రరేఖ వలె వెలుగొందే శ్రీదేవిని వ్రత హోమాదులతో సంతోషపెట్టాడు. ఆమె అతనిని అనుగ్రహించి మహదైశ్వర్యాన్ని, ఒక సుపుత్రుని ప్రసాదించింది. కాలనేమి తన పుత్రునికి శ్రీదత్తుడు అని సార్థకమైన పేరు పెట్టాడు. అతని జన్మ సమయంలో 'శ్రీదత్తుడు రాజ్యం సంపాదించి రాజవుతాడు' అని శ్రీదేవి పలికింది.

శ్రీదత్తుడు పెద్దవాడయ్యాడు. రూపం; విద్యలు, గుణాలు ఆయనను పొందాయి. అతడు వాటితో చాలా ప్రకాశించాడు. అతనికి ఆ దేశం రాజకుమారుడైన విక్రమశక్తి అనే వీరునితో చెలిమి కలిగింది. ఆ విప్ర కుమారునికి బాహుశాలి మొదలయిన పలువురు చెలికాండ్రూ వున్నారు. శ్రీదత్తుడు ఎంత చెలికాడైనా అతడు బలశాలి కావడం వల్ల, పరాక్రమవంతులయిన స్నేహితులు వుండడంవల్ల విక్రమశక్తి సహించలేకపోయాడు. అతనిని చంపించాలని రహస్యంగా సన్నాహం చేస్తూ వున్నాడు. అది గ్రహించిన శ్రీదత్తుడు అక్కడ వుండడం అపాయకరమని నిశ్చయించి, మిత్రులతోపాటు దూర దేశాలకు బయలుదేరాడు.

దారిలో అతడు గంగ దాటవలసి వచ్చింది. అతడు గట్టు చేరగానే, ఒక అంగన గంగాతరంగాలలో కొట్టుకొనిపోతూ 'రక్షించండి, రక్షించండి' అని కేకలు వేయడం వినిపించింది. శ్రీదత్తుడు ఆమెకు కాపాడాలని నదిలో దూకి త్వరగా ఈదుకుంటూ ఆమె సమీపానికి వెళ్ళాడు.

అతడు సమీపించే వేళకు ఆమె నీటిలో మునిగిపోసాగింది. అతడు ఆమెను పైకిలాగి రక్షిద్దామనుకుని, ఆమె వెన్వెంటనే మునిగాడు. ఆశ్చర్యం! శ్రీదత్తునికి నీటి లోపల ఒక మణిమందిరం కనిపించింది. దానిలో శంకర భగవానుని విగ్రహం, రక్తపుష్పాలతో అర్చించబడినట్టిది కనిపించింది. అక్కడ, శంకరభగవద్విగ్రహం సమ్ముఖంలో పూజావ్యగ్రురాలయిన యువతి కూర్చునివుంది. ఆమె మరెవ్వరో కాదు — నీటిలో మునిగిపోతూ, 'రక్షించండి, రక్షించండి' అని ఆక్రందనం చేసిన యువతే. ఆమె పూజ సమాప్తి చేసి, తన మణిమయమైన గృహం చేరింది. ఆమెచుట్టూ సఖీజనం మూగినది. ఆమె దుఃఖంతో ఒకవైపు కూర్చుంది. సఖులు ఉపచారం చేయసాగినారు.

శ్రీదత్తునికి మరింత సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. ఆమెను సమీపించాడు. అంతటి వైభవంతోవున్న యువతికి శోకమేమిటో అతనికి తెలియలేదు. ఆమెను శోక కారణమేమని ప్రశ్నించాడు. ఆమె ఇలా అన్నది: 'భద్ర, మా తండ్రి విరోచనుడు. అతనిని విష్ణువు కాల్చి చంపివేసినాడు. విష్ణుడు ప్రయోగించిన సింహమొక్కటి మా పట్టణాన్ని ముట్టడించివుంది. ఇదే మాశోకానికి కారణం' అని.

శ్రీదత్తుడు ఆ లలన మాటలు విని, ఆ సింహాన్ని ఎదిర్చి దానితో పోరాడి, కింద పడవేశాడు. ఆ సింహం సామాన్యమయిన సింహం కాదు; శాపగ్రస్తుడైన యక్షుడు. కిందపడి ఓడిపోగానే శాప మోక్షం కలిగి, నిజస్వరూపం పొందాడు. అతడు శ్రీదత్తునికి వందనం చేసి తనకు శాప విముక్తి కలిగించినందుకు కృతజ్ఞతతో, ఒక శ్రేష్ఠమైన ఖడ్గాన్ని బహూకరించాడు. అసురేంద్రుడయిన విరోచనుని పుత్రి అతనికి ఒక దివ్యాంగుళీయకం ఇచ్చింది. ఆ అంగుళీయకం విషాపహారి. ఈ విధంగా వారందరి సత్కారాలు పొంది శ్రీదత్తుడు, వారి నుండి సెలవు తీసుకొని, తాను పూర్వం గంగలో ఎక్కడ మునిగాడో, అక్కడే మళ్లీ తేలాడు.

తీరానికి వెళ్లిచూడగా తన మిత్రులందరూ వెళ్లిపోయారు, ఒక్క విష్ణురుడనేవాడు తప్ప. విష్ణురుడు శ్రీదత్తునికి సంగతులన్నీ తెలిపాడు: 'మిత్రమా, మేము నీవు గంగలో మునిగిపోతి వనుకొని నదినంతా చాలవాళ్లు గాలించాము. నీవు దొరకలేదు. నిరాశతో స్వస్థలానికి వెనుదిరిగిపోయాము. అక్కడ విక్రమశక్తి తండ్రి మరణించాడు. విక్రమశక్తి రాజయ్యాడు. నీవు ఎప్పటికైనా రాజవుతావని, తనకు ప్రత్యర్థివని నమ్మడంవల్ల మీ యింటికి వెళ్లి నీ తండ్రిగారిని ప్రశ్నించాడు, నీవు ఎక్కడ వున్నావని. నీవు కనిపించని కోపం కొద్దీ నీ తండ్రిని చంపించాడు. నీపై పగ పట్టినాడు. మన నెచ్చెలు లందరూ ఉజ్జయినికి బయలుదేరారు. నీవు ఎన్నటి కయినా కనపడుతావనే నమ్మకంతో నేను ఇక్కడికి వచ్చి నీకోసం నిరీక్షిస్తున్నాను.'

శ్రీదత్తుడు విష్ణురుని మాటలు విని, చాల దుఃఖపడ్డాడు. తన ఊరికి వెళ్లడం భావ్యం కాదని, మిత్రుడు చెప్పినట్లు ఉజ్జయినికి వెళ్లడమే శ్రేయస్కరమని నిశ్చయించుకొన్నాడు. అతనితోపాటు ఉజ్జయినికి బయలువెడలినాడు మిత్రునికి తన వృత్తాంతం వివరించాడు. దారిలో ఒక అడవి వచ్చింది. అడవిలో పడి ఇద్దరూ వెళ్లుతున్నారు. అకస్మాత్తుగా ఒక స్త్రీ రోదన ధ్వని వినబడింది. ఇద్దరూ దాని వైపు వెళ్లారు. ఏడుస్తున్న ఒక స్త్రీ కనిపించింది. 'అమ్మా, ఎందుకు ఏడుస్తున్నావు? ఏమిటి నీకు వచ్చిన కష్టం?' అని శ్రీ దత్తుడు ఆమెను ప్రశ్నించాడు. 'నేను దారి తప్పినదానిని. దిక్కులేనిదానిని' అని ఆమె సమాధానం చెప్పింది. శ్రీదత్తుడు ఆమెను ఊరటపరచి, తన వెంట ఉజ్జయినికి పిలుచుకొని వెళ్లాడు. చీకటి పడింది. ఒక పాడుపడిన పట్టణంలో ఆ రాత్రికి ఆగారు. రాత్రి హఠాత్తుగా శ్రీదత్తునికి మెలకువ వచ్చింది. పక్కన తన మిత్రుడు కనిపించలేదు. ఆ స్త్రీ నిశాచరివలె తన మిత్రుని చంపి, అతని మాంసం తింటూవుండడం కనిపించింది. అతడు కోపంతో, ఆశ్చర్యంతో వణికిపోయాడు. ధీరుడు గనుక ఒక్క ఉదుటున లేచి, ఆమె జుట్టు గట్టిగా పట్టుకున్నాడు. ఆమె విష్ణురుని కంకాళాన్ని ఆయుధంవలె ఎత్తి అతనితో కలియబడడానికి వెనక్కు తిరిగింది. కాని, అతడు జుట్టు పట్టుకొనడంవల్ల ఆమెకు అంతటితో శాపం వీడిపోయింది. దివ్యరూపం వచ్చింది. 'ఆర్యా, నన్ను చంపకు. నేను రాక్షసిని కాను, యక్షిని. పూర్వం కౌశికుడనే మహర్షి తపస్సు చేస్తుండగా, నేను అతని తపస్సుకు విఘ్నం చేశాను. అతడు నన్ను రాక్షసిని కమ్మని శపించాడు. నేను అతనిని శాపమోక్షం అనుగ్రహించండని బతిమాలినాను. నీ జుట్టు పట్టుకొని ఎవడు ధైర్యంతో చంపడానికి వస్తాడో అప్పుడు నీకు శాపవిముక్తి అని ఆయన శాపాంతం అనుగ్రహించాడు. నీకోసం వేచివున్నాను. నా శాపం తీరింది.' అని ఆ దివ్య స్త్రీ అంటూ, తాను చంపిన అతని మిత్రుడు విష్ణురుడ్ని బతికించి, వెళ్లిపోయింది. శ్రీదత్తుడు చాల సంతోషించి తన మిత్రునితోపాటు తిరిగి పయనం సాగించి ఉజ్జయినీ నగరం చేరాడు. అక్కడ తక్కిన మిత్రులను కలుసుకొన్నాడు. అందరూ పరస్పరం వృత్తాంతాలు చెప్పుకొని ఆనందించారు. తర్వాత శ్రీదత్తుడు బాహుశాలి అనే మిత్రుని ఇంట్లో బసచేసి, అక్కడ స్వేచ్ఛగా మసలుకోసాగినాడు.

ఇలావుండగా, వసంతఋతువు వచ్చింది. ప్రకృతి అంతా విరియబూసింది. అశోకాలు చంపకాలు పూయగా, మదించిన తుమ్మెదలు బారులుకట్టి రొద చేస్తున్నాయి. ఆ సమయంలో శ్రీ దత్తుడు తన వయస్యులతోపాటు ఉజ్జయినీ నగరోద్యానానికి విహారార్థం వెళ్లాడు. ఆ ఉద్యానానికి బింబకి మహారాజు కుమార్తె మృగాంకవతి కూడా తన చెలికత్తెలతోపాటు వచ్చింది. చెలికత్తెలు చామరాలు వీస్తుండగా, మృగాంకవతి అలకలు కదలాడుతూ, ముచ్చట గొలుపుతున్నాయి. సుందరరూప విభూతివలె, విభ్రమసంపదవలె, శశాంకునిసిరివలె, కుసుమసాయకుని కాంతవలె, దర్పసమృద్ధివలె, శృంగార దేవతవలెవున్న ఆ మృగాంకవతిని చూచి శ్రీదత్తుడు, రాగంతో మూఢుడయ్యాడు. ధీరులయినవారు సెగలు కక్కే విషోగ్ర కరాళ దంష్ట్రలున్న కాలసర్పాలవద్దకు కూడా వెళ్లి వాటిని వశపరచుకుంటారు. జూలు విప్పుకొని వికటాట్టహాసం చేసే సింహాలను కూడా అదుపులో పెట్టుకుంటారు. కాని, కందర్పుని దర్పం అణచడం ఎవరికీ చేత

కావడంలేదు. మృగాంకవతి కూడా మన్మథ సుందరుడైన శ్రీదత్తుని చూచి మన్మథుని పంచబాణాలకూ గురి అయింది.

ఇంతలో ఒక ఘోరం జరిగింది. తన మనసులో కొత్తగా పుట్టిన మనోభవుని విభ్రమానికి మనస్సు వ్యగ్రమయిన మృగాంకవతి ఉద్యానవనంలోని అరటిచెట్ల వరుసలలో విహరిస్తుండగా, ఆమెచేతిని ఒక పాము కాటు వేసింది. హాహాకారాలు చెలరేగాయి. చెలులు 'అయ్యో! ఇంకేమిగతి? రాజపుత్రికి పాము కరిచింది!' అని విలపిస్తూ, ఇటూ అటూ తిరగడం మొదలుపెట్టారు. శ్రీదత్తుని మన్మథుడు మొదట్లోనే ప్రేరేపించాడు. ఇక చెలికాడయిన బాహుశాలికూడా రాజకుమారిని పాము కాటు విషం నుండి రక్షించవలసిందని కోరాడు. శ్రీదత్తునివద్ద అసురరాజయిన విరోచనుని కుమార్తె బహూకరించిన విషహరమైన ఉంగరం ఉన్నదని బాహుశాలికి తెలుసు అతని ప్రోత్సాహంతో శ్రీదత్తుడు చెలికత్తెలవెంట రాకుమార్తె వద్దకువెళ్లి తన విషహరాంగుళీయకం ఆమె చేతివేలికి తొడిగాడు. రాజకుమారి పామువిషం దిగిపోయి బ్రతికి లేచికూర్చుంది. ఎదుట శ్రీదత్తుడు. ఆమెను మనోభవుడనే భుజంగం కరిచింది. ఆమె మళ్లీ మూర్ఛపోయింది.

శ్రీదత్తుడు తన మిత్రులతో సహా యిల్లు చేరుకున్నాడు. మృగాంకవతిపై చింతతో ఒక్క పూటలోనే అతని దేహం కృశించిపోయింది. అక్కడ అంతఃపురంలో రాజకుమార్తె స్థితి ఇదే. ఆమె స్మరార్తితో వేగిపోతూంది. ఆమె దేహ మనస్థితులను చూడలేక, భావనిక అనే చెలికత్తె, శ్రీదత్తుడున్న బాహుశాలి ఇంటికి వచ్చింది. అతనితో రాజకుమారి సంతాపం తెలియజేసింది. శ్రీదత్తుడు, మిత్రులతోను, భావనికతోను మంతనాలు జరిపాడు. రాజు బింబకి ఈ బాపనికి తన కుమార్తెను ఇచ్చి పెండ్లి చేస్తాడన్నది అబద్ధం. ఆమెను రాచనగరునుంచి అపహరించుకొనిపోయి, మరెక్కడయినా వుంచి శ్రీదత్తునితో పాణిగ్రహణం చేయించాలి. శ్రీదత్తుడు రాజకుమార్తె నివాసానికి నిప్పంటించాలి. ఆ కోలాహలంలో రాజకుమార్తెను భావనికతోపాటు పంపి

## ...బృహత్కథామంజరి

వేయాలి. మిత్రులు కొందరు ఆమెను గుర్రంమీద ఎచ్చటికైనా తీసుకొనివెళ్లాలి. రాచనగరులో అలజడి తగ్గిన తర్వాత శ్రీదత్తుడు బయలుదేరి వారిని దారిలో కలుసుకోవాలి— ఈ ఏర్పాటు ప్రకారమే అంతా జరిగింది. భావనిక ఒక రాత్రి రాజకుమార్తె నివాసానికి నిప్పంటించింది. అక్కడే పొంచివున్న శ్రీదత్తుడు ఆ సంభ్రమంలో రాజకుమార్తెను, భావనికను తన మిత్రులున్న ప్రదేశానికి చేర్చి తిరిగి వచ్చాడు.

ఇంతవరకు చక్కగానే అంతా బాగా జరిగింది. కాని, దారిలో తన మిత్రులకు సంభవించిన అపదలు శ్రీదత్తునికి ఎలా తెలుస్తాయి? శ్రీదత్తుడు ఒకటి రెండు నాళ్ల తర్వాత తన మిత్రులకోసం గుర్రం ఎక్కి బయలుదేరాడు. దారిలో బాణాలు తగిలి, మూలుగుతూ పడివున్న మిత్రులు, భావనిక కనిపించారు 'ఏమిటిదంతా?' అని ప్రశ్నించాడు శ్రీదత్తుడు భావనికను. 'ఆర్య, ఏమని చెప్పను? ఎవరో గుర్రాలెక్కి వచ్చిన క్షత్రియులు కొందరు మాపై పడ్డారు. నీ మిత్రులు వారిని ఎదిరించి పోరాడారు. కాని, ఆ అశ్వారూఢులు నీ మిత్రులను బాణాలతో పడదోసి, నాపైన బాణాలు వదలి, నా చెలి రాజకుమార్తెను అపహరించుకొనిపోయారు.' అని భావనిక దీనురాలై చెప్పింది. శ్రీదత్తునికి భావనిక మాట పిడుగుపాటయింది. పక్కనే బాణాహతులైన మిత్రులూ కనిపించారు.

శ్రీదత్తునికి కోపం పెల్లుబికింది అతడు వెంటనే భావనిక చూపినదారిని గుర్రాన్ని మళ్లించి దౌడు తీయించాడు కొంతదూరంలో క్షత్రియుల దండును కలుసుకున్నాడు. కీర్తి అనే కుబుసంనుంచి విడివడిన భుజంగంవంటి తన ఖడ్గానికి ఆ క్షత్రియులందరినీ ఎరచేసి, తన ప్రియురాలయిన రాజకన్యను రక్షించాడు. రాజకుమార్తెను గుర్రంమీద ఎక్కించుకొని సంతోషంతో తన మిత్రులను కలుసుకొనడానికి బయలుదేరాడు.

వారెక్కిన గుర్రం పోరితంలో బాగా దెబ్బతిన్నది. అందువల్ల అలసిపోయింది. కొంతదూరం పోగానే ఒక వికటమైన అడవి కనిపించింది. దానిని దాటకముందే గుర్రం చచ్చిపడిపోయింది. రాజకుమారి దప్పిగొని నీరు కోరింది శ్రీదత్తుడు ఆమెను ఒక చెట్టుకింద కూర్చోమని చెప్పి, ఖడ్గమే సహాయంగా నీటికోసం అడవిలో తిరుగసాగాడు.

తిరుగగా తిరుగగా నీరు కనిపించింది. అతడు తామరాకు దొన్నెలలో నీరు పట్టుకొని మృగాంకవతివద్దకు త్వరత్వరగా బయలుదేరాడు. ఈలోగా సహస్రాంశువు పద్మినీ విరహంతోనా అన్నట్టు పశ్చిమ సముద్రంలో దూకాడు. దట్టమైన చీకట్లు అలముకొన్నాయి. చీకటిమానులు, తాటిమానులు ఎదుట పేర్చినట్టు, తుమ్మెదల దండలు ఆకాశంనుంచి వేలాడగట్టినట్టు దట్టమైన, దుర్నీతివలె భయంకరమైన ఆ కారు చీకటిలో విప్రకుమారుడు దారి తప్పిపోయాడు. 'హా ప్రియా, ఎక్కడ వున్నావు? నిన్ను ఎలా 'కనుక్కోగలను ?' అని విలపిస్తూ, పలవిస్తూ రాత్రంతా అడవిలో తిరుగాడుతూనే వుండిపోయాడేకాని, దుష్టమతి అయినవాడు వ్యసనాన్ని దాటిపోనట్టు అతడు చీకట్లు దాటి ప్రియురాలిని చేరుకోలేకపోయాడు.

తెల్లవారింది. దయితా వియోగ విధురాశయుడైన అతడు వెలుతురులో ప్రియురాలిని వెదుకసాగాడు. దూరంగా ఎటయినా కనిపిస్తుందేమో అని ఒక మర్రిచెట్టెక్కి చూచాడు. ఆ దుఃఖంలో అతడు తన దివ్యఖడ్గాన్ని చెట్టు మొదట్లో పెట్టి చెట్టెక్కాడు. అతడు దిక్కులు చూస్తూ చెట్టుమీద ఉండగా, ఆ ప్రాంతపు శబరనాయకుడు ఆ దారినిపోతూ, మర్రిచెట్టు కిందవున్న ఖడ్గాన్ని తీసుకొన్నాడు. శ్రీదత్తుడు ప్రియురాలి జాడలు కానక చెట్టు దిగివచ్చాడు. కాని తన ఖడ్గాన్ని పట్టుకుని శబరనాయకుడు నిలుచుని వున్నాడు. కష్టంమీదే మరో కష్టం విరుచుకొనిపడడం సహజం. శ్రీదత్తుడు చేసేదేమీలేక అతనినే అడిగాడు తన ప్రియురాలి జాడను గురించి.

శబరనాయకుని పేరు శ్రీదండుడు. అతని స్థితికి చాల కనికరించాడు. మిత్రుడా నీ ప్రియురాలిని చీకట్లో అడవిలో ఒంటరిగా వుండగా నా భృత్యులు నాపల్లెకు

[illegible] వెళ్ళారు. నీవు [illegible] నీ ప్రియురాలిని చూడవచ్చు. నేను పల్లెకు తిరిగివచ్చి, నీకత్తి నీకు ఇచ్చివేస్తాను. నీవు నా పరిజనంతోపాటు నాపల్లెకువెళ్ళు' అని బొంకాడు. శబరనాయకుని మాటలు విని శ్రీదత్తుడు అడుగులు తొట్రుపడుతూండగా, వారివెంట వెళ్ళాడు. అతనికి వారొక విడిది ఏర్పాటు చేశారు.

శ్రీదత్తుడు మొదటే చాల అలసివున్నాడు. అందులో అడవిలో రాత్రంతా తిరుగుడు అందువల్ల పల్లెచేరి విడిదిలో ప్రవేశించగానే నిద్ర ముంచుకొని వచ్చింది. ఎంతసేపు నిద్రపోయాడో అతనికి తెలియదు. మెలకువ వచ్చి చూడగా తనను పెడరెక్కలు విరిచి కట్టినట్టు, దుర్గాదేవికి తనను బలిగా నిర్ణయించినట్టు తెలుసుకొన్నాడు. దురదృష్టవం!

శబర భృత్యులు శ్రీదత్తుని పిలుచుకుని రావడం శబరనాయకుని కుమార్తె సుందరి అనేది చూచింది. అతనిని చూడగానే ఆమె మరులుగొన్నది. ఆతడు బంధింపబడిన విడిదికి ఆమె వచ్చింది. ఆమె కలువకన్నుల కాంతి ఆమెచెవిలో చెక్కుకున్న నెమలి కన్ను సోయగాన్ని కాదంటూంది. ఆమె దొండపండు వంటి పెదవుల శోణకాంతి ఆమెమెడలో వేసుకున్న ఎర్రటి గురివిందగింజల దండను వెక్కిరిస్తున్నది. ఆమె అతనిని సమీపించి 'నాకోరిక తీర్చావా నీకు మేలు కలుగుతుంది. నిన్ను ఈబంధనం నుంచి విడిపిస్తాను.' అని కోరింది. శ్రీదత్తుడు ఆబంధనం నుంచి తప్పించుకొంటే, ఎన్నటికైనా మృగాంకవతిని కలుసుకోవచ్చునే ఆశతో ఆమెతో గాంధర్వ వివాహానికి ఒప్పుకొన్నాడు.

కొన్నినెలలు ఈవిధంగా గడచిపోయాయి శబరనాయక పుత్రి సుందరికి దౌహృద చిహ్నాలు కనిపించాయి. నడుము బలిసి, గర్భంపెరిగి నడక మందగించింది. ఇక నన్ను వెళ్ళనిమ్మని శ్రీదత్తుడు ఆమెను కోరాడు. ఆమె మళ్ళీవచ్చి చూస్తానని బాస చేయించుకొని అతనిని చెరనుంచి విడిపించింది. శ్రీదత్తుడు పల్లెనుంచి వెళ్ళిపోతూ 'నీతండ్రి శ్రీదండుని చేతిలోని ఖడ్గం నాది. దానిని భద్రపరచు' అని చెప్పి, మృగాంకవతిని వెదకడానికి బయలుదేరాడు.

అతడు మృగాంకవతినే ధ్యానిస్తూ [illegible] అడవిలో విచ్చలవిడిగా తిరుగసాగాడు. కనిపించిన వారినంతా 'నా ప్రియురాలు కనిపించిందా? దారిలో కనిపించిందా? ఏమి కష్టాలు పడుతున్నదో!' అని అడుగుతూ, వెర్రివాడివలె తిరిగాడు. అప్పుడు అతనికి ఒక ముసలి శబరుడు కనిపించాడు. అతడు శ్రీదత్తునికి ప్రాణాలు పోస్తున్నాడా అన్నట్టు ఇలా అన్నాడు—'నాయనా శ్రీదత్తుడా, ఎన్నడూ దుఃఖపడడానికి అర్హురాలుకాని నీ ప్రియురాలు ఆ మృగాంకవతి నీకోసం దుఃఖిస్తూ, అడవిలో దారి తప్పి తిరుగుతూవుండగా నేను దయతో కాపాడి, నాయిల్లుచేర్చి, కూతురివలె చూచుకొన్నాను. ఆమె వయస్సులో వుంది. ముద్దరాలు. శశాంకముఖి అయిన సుందరి. పల్లెవారు ఆమె నాయింట్లో వున్నట్టు తెలుసుకుంటే, ఏమి హానికలుగుతుందో అనే శంకతో, ఆమెను మధురానగరపు పరిసరాలలోని నాగస్థలమనే గ్రామం చేర్చాను. అక్కడ విశ్వదత్తుడనే పరమ సాధువైన బ్రాహ్మణుని ఇంట్లో ఆమావతి వుంది. నీవు అక్కడికివెళ్ళి ఆమెను కలుసుకో. వెళ్ళు.'

వృద్ధ శబరుని మాటలకు శ్రీదత్తుడు పొంగిపోయాడు. వాయువేగంతో నాగస్థలం చేరాడు. విశ్వదత్తుని ఇంటికివెళ్ళి 'విప్రోత్తమా, నాప్రియురాలిని వృద్ధ శబరుడు మీఇంట్లో ఉంచుమని పెట్టాడట. ఆమెను నాకు అప్పగించండి' అని ప్రార్థించాడు. శ్రీ దత్తుని మాటలు విని విశ్వదత్తుడు 'నాయనా, శూరసేన మహారాజు మంత్రి అభయుడనేవాడు నామిత్రుడు. ఆమెను అతనికి అప్పగించాను. ఆ తపస్విని అతని ఇంట్లో వున్నది. నీవు అక్కడికి వెళ్ళు' అన్నాడు.

శ్రీ దత్తుడు అక్కడికి వెళ్ళడానికి [illegible] డంవల్ల సమీపానంలోని దిగుడు బావికి వెళ్ళి స్నానంచేసి అలసట తీర్చుకుని వెళ్ళదా మనుకున్నాడు. అతడు స్నానం చేస్తుండగా, చోరులు ఒక మహాముక్తాహారాన్ని దొంగిలించి ఒక మురికిగుడ్డలో మూటకట్టి, అతడు గట్టుమీదపెట్టిన గుడ్డల స్థలంలోపెట్టి అతని గుడ్డలను మరొకచోట పెట్టి తారుమారు చేశారు. శ్రీదత్తుడు స్నానం ముగించి, గట్టుమీద గుడ్డలు తనవేనని అనుకుని కట్టుకున్నాడు. తన గుడ్డలు మారిపోయినట్టు గుర్తించలేదు. తర్వాత అతడు శూరసేన మహారాజు నగరం చేరి రాజవీధిలో అమాత్యుడు అభయుని భవనం కోసం వెదకసాగినాడు.

మహాముక్తాహారం దొంగతనం సంగతి నగరంలో అదివరకే వ్యాపించింది. రాజపురుషులు దొంగల కోసం గాలిస్తున్నారు. వారు శ్రీదత్తుని చూచి అనుమానంతో పరిశీలించారు. అతనివద్ద ముక్తాహారం, రాజార్హమైనది పట్టుబడింది. రాజపురుషులు అతనిని తిడుతూ, లాక్కొని వెళ్ళి న్యాయాధీశుల ఎదుట నిలిపారు. న్యాయాధీశులు అతనికి వధ శిక్ష విధించారు. రాజపురుషులు అతనిని వధ్య స్థానానికి దండోరా చాటింపుతో లాగుకొని వెళ్తుండగా, అబాల వృద్ధం అతనినే చూచింది. స్త్రీలు మేడల జాలకాల నుంచి, గవాక్షాల నుంచి చూచారు. కుతూహలాయత్తలయిన అందరిలాగే, మృగాంకవతి కూడా అభయామాత్యుని మేడమీదినుంచి బ్రాహ్మణ స్త్రీలతోపాటు తొంగి చూచింది. నిజవల్లభుడైన శ్రీదత్తుడు! అతనిని ఆ స్థితిలో చూచి, ఆమె మనస్సు దుఃఖ భయాలతో ముక్కలయింది తనకు ఆశ్రయమిచ్చిన అభయామాత్యుని వద్దకు పరుగున వెళ్ళి సంగతి తెలిపింది. మంత్రి రాజపురుషులను పిలిపించి, అతనిని నిర్దోషి అని నిరూపించి, వధబంధనం నుంచి తప్పించాడు.

శ్రీదత్తుడు బంధ విముక్తుడై అభయదత్తుని భవనం చేరి, తన ప్రియురాలిని కలుసుకున్నాడు. మంత్రి తన పినతండ్రి అని తెలుసుకొని, చాల సంతృప్తి పొందాడు. శ్రీదత్తుడు తన అన్న కుమారుడని తెలుసుకొని అభయదత్తుడు కూడా ఆనం

(౨౬ వ పేజీ చూడండి)



# 55 ఏళ్ల జీవితంలో 36 పెళ్లిళ్లు

కొలంబోకి చెందిన నిక్‌అబ్దుల్ రహమాన్ అనే ఆయన తన 55 ఏళ్ళ జీవితంలో ముప్పయ్యారు సార్లు పెళ్లి చేసుకున్నారట. 15 వ ఏటనుంచీ, పెళ్లి చేసుకోడం, విడాకులివ్వడం లెక్కన యిన్ని పెళ్ళిళ్ళు చేసుకుని, యింకా కూడా మరో కొన్ని పెళ్ళిళ్ళు చేసుకోడానికి కుతూహలం ప్రకటిస్తున్నాడట— జరిగితే ఖ్యాతమంత సుఖం లేదుకదా!

## చూపులో ఏముందో!

మాస్కోలో ఒకావిడ తన కంటి చూపుతో గడియారం పని చేయకుండా ఆపేస్తుందట. మళ్లీ తిరిగి పనిచేసేలా కూడా చేయగలదట. ఇంతేగాక, బల్లమీదకి వస్తువులా, గిన్నె గిడుగులూ వచ్చేలా చేయగలదట. ఈమెలో ఏవో రేడియో ధార్మిక శక్తిలాంటిది వుండి వుండాలని అభిప్రాయపడుతున్నారు.

* * *

మేకాయ వంటి దుర్వ్యసనాలన్నీ మానసిక దుర్బలత వల్లే జరుగుతున్నాయనీ, యీ దుర్బలత

యిహానికొక్కణ్ణే కాదు
పదండి విళ్ళేదన్నకి
మారోగ్యం
కుదురుస్తాడు!



వల్ల దానికి కావలసిన డబ్బు ముష్టెత్తిగానీ, అప్పు చేసిగానీ, చివరికి దొంగతనం చేసిగాని సంపాదిస్తారని చెపుతూ యీ 'జాతి' చెందిన ఎడ్వర్డ్ విల్స్ అనే అతని మెదడు ఆపరేషనుచేసి యీ జబ్బు నయం చేస్తున్నట్టు వాషింగ్టన్‌లో డాక్టర్ ఫ్లెమింగ్ అన్నారు.

* * *

లూపులవల్ల, ఇదితర నియంత్రణలవల్ల 1967 సంవత్సరం లెక్కల ప్రకారం 10 లక్షల ఇరవై వేల శిశూదయాలు (పుట్టుకలు) ఆపబడినట్టు లెక్కలు తేల్చారు. అసలు 12 లక్షల పుట్టుకలు ఆపాలని చేసిన ప్రయత్నాల ఫలితం యిదనీ, అనగా కృషిలో 75 శాతమే జయప్రదమయిందని చెప్పారు.

## కుక్క బుద్ధి

నేరస్థుణ్ణి పట్టుకోడానికి పోలీసు కుక్కను వదిలితే అది వెళ్లి వివాహానికి ఒకచోటికి వచ్చిన బంధువుల్ని పట్టుకుందట. ఈ విషయం తెలిసి స్టేటు (మద్రాసు) ఎసెంబ్లీలో ఒక కాంగ్రెసు సభ్యుడు ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురైతో చెప్పగా— "మనుష్యుల్లోవున్న చెడు బుద్ధులనే యింతవరకూ సరిచేయలేక పోతున్నపుడు కుక్కబుద్ధి సరిగా లేదన్న ఫిర్యాదు హాస్యం" అని చమత్కరించారట. మద్రాసు ప్రభుత్వం పోలీసు ఆధీనంలో 14 కుక్కలున్నాయని, వీటి ఖర్చు 19,278 రూపాయల 71 పైసలని లెక్క చెప్పారట వారు.

## విశ్వవిద్యాలయాలలో తపస్సు

తపశ్శక్తి ద్వారా గుండె జబ్బు వంటివి నయం అవుతాయని మహర్షి మహేష్‌యోగి వాక్కు నమ్ముతున్నారు. పాశ్చాత్య విశ్వవిద్యాలయాల్లో "తపస్సు"ను ఒక బోధనాంశంగా ప్రవేశపెడుతున్నారట— భలే…… తపస్సు విశ్వవిద్యాలయాల్లో నేర్చుకుంటే ఇక విద్య అరణ్యాల్లో నేర్చుకోవాల్సిందే నేమో— చూద్దాం!

సీటొస్తే
తపస్సు
చదువుతా





…పెంచుకుంటారేమో
…కనుక్కోవాలి!

## జనాభా తక్కువైతే బాధా!

ప్రస్తుతం వున్న జనాభాకి కనీసం మూడు రెట్లయినా అధికంగాకపోతే దేశం బాగుపడదని, పారిశ్రామికంగా అభివృద్ధి చెందదని ఆస్ట్రేలియా విచారపడుతోంది. చాలా దేశాలు అధిక జనాభాతో బాధపడుతుంటే ఆస్ట్రేలియా జనాభా తక్కువతో బాధపడుతోంది— [illegible]

* * *

పోలీసులను ఎక్కించుకుని పోతున్న లారీ ఒకటి ఏప్రియల్ 1 వ తేదీన మనప్పరై (తిరుచ్చి) ప్రాంతంలో రూపాయమీద కూర్చున్న ముగ్గురు కుర్రాళ్ళను ఢీ కొట్టిందట. అందులో ఒకనే అతను వెంటనే మరణించాడనీ, మిగతా యిద్దరూ బాగా గాయపడ్డారనీ వార్త!

* * *

మద్రాసులో ప్రభుత్వ రవాణా బస్సుల పనివారలకు, విద్యార్థులకు జరిగిన రగడలో తమకు పోలీసుల సహాయంగానీ, కాపుగానీ లభించలేదన్న ఆగ్రహంతో రవాణాశాఖ మంత్రి శ్రీ కరుణానిధి గడ్డి బొమ్మను చేసి కసితీరా తగలెట్టారు— కసి తీరిందో, లేదో మాత్రం తెలీదు.

—[illegible]



# గోవిందమ్మాళ్ – ఇద్దరు ప్రియుల కథ

వి.యస్.సుక్తాంకర్

'అమ్మా..., దయవుంచి నన్ను మీ పొలం మీద వుంచుకోండి. పంట పండేవరకు రోజూ వచ్చి పని చేస్తాను. పంటలు బాగా పండే సూచన కనిపిస్తున్నా–ఈ సంవత్సరం నన్ను పనివాడిగా వుంచుకునే అవసరం ఎవరికీ కలగలేదు. ఇంతవరకు ఎక్కడా పని దొరకలేదు. మీరు నా మీద దయ తలచాలి...'

పద్దెనిమిదేళ్ల కుర్రాడొకడు వినయ విధేయతలతో గోవిందమ్మాళ్ ని అర్థించాడు. దాదాపు ముప్ఫయ్ ఏళ్లున్న విధవరాలు గోవిందమ్మాళ్.

ఆమె ఆ కుర్రవాడ్ని పరిశీలనగా చూసింది. బలంగాను ఉత్సాహంగాను కని పించాడు. అతను సుబ్రహ్మణ్యం అని ఆమె కొంతసేపటికి గుర్తించగలిగింది.

'నాయనా .., ఇంతలోనే ఎంతగా ఎదిగి పోయావు. ముందు–నిన్ను గుర్తుపట్టలేక పోయాను. క్రిందటి పంటకాలంలో మా పక్కింటి రైతుకు పనిచేశావు కదూ...?'

ఎంతో వాత్సల్యంతో ఆమె అలా అనే సరికి సుబ్రహ్మణ్యం పొంగిపోయాడు. పని తప్పక దొరుకుతుందని అతని ఆశ.

'నీలాంటి మంచి కుర్రాడు నా దగ్గర కొచ్చి పని అడిగితే లేదని అనలేను కాని, నా పొలం పనులన్నీ చక్కబెట్టే పెరుమాళ్లు వున్నాడు. అతని సలహా లేకుండా నేనే పనీ చేయను. అతను కూడా నా పనంటే ఎంతో భక్తి శ్రద్ధలతో చేస్తుంటాడు అతని తెలివి తేటలవల్లనే నేనీ పొలం పనులు నిర్వహించగలుగు తున్నాను. ఎంతయినా ఆడదాన్ని కదా నాయనా...'

అని అతని వైపు ఒకసారి చూసి, పొద్దు గూకిపోవడంతో యింటిముఖం పట్టింది.

కోయంబత్తూర్ కి పక్కనున్న ఒక పల్లె టూరు ఆమెది పొలానికి చాలా దగ్గర వూరు. ఆమె నడుస్తూవుంటే ఆ వెనక సుబ్రహ్మణ్యం కూడా అనుసరించాడు.

నడుస్తూ నడుస్తూ, చూడ ముచ్చటగా వున్న ఆ కుర్రవాణ్ని రెండు మూడుసార్లు వెనక్కి తిరిగి చూసింది.

'ఎంత అందంగా వున్నాడు? అతని తల మన్నగాను నల్లగాను ఎంత బాగా మెరుస్తున్నది? కనుముక్కు తీరు ఎంత ముచ్చటగా వుంది.'

అనుకున్నది సుబ్రహ్మణ్యం మీద అభి మానాన్ని పెంచుకుంటూ గోవిందమ్మాళ్. ఇంటికి వచ్చేసరికి ఆమెకి అతనిమీద ఒక స్థిరమైన అభిప్రాయం ఏర్పడిపోయింది. తప్పకుండా పనిలోకి తీసుకోవాలి అనుకున్నది.

'సరే సుబ్రహ్మణ్యం ... నువ్వు రేపటి

మనిషి వచ్చి పొలం పని చేస్తూ వుంటాడు. ఈ సంవత్సరం పొలం పుష్కలంగా పండుతుందనుకుంటున్నాను. అంచేత మరో పని వాడు అవసరమే. నేను పెరుమాళ్ళతో చెప్తాను.' అన్నది గోవిందమ్మాళ్.

ఆమె అంగీకరించినందుకు సుబ్రహ్మణ్యం ఎంతో సంతోషించాడు మర్నాటినుంచి పొలం పని చూడసాగాడు. ఒక పంటకాలానికి మాత్రమే పని చెయ్యాలని మొదట అనుకున్నా— పంట పండిన తర్వాత కూడా పొలంమీదే వుండసాగాడు సుబ్రహ్మణ్యం. గోవిందమ్మాళ్‌కి అతను ఎంతో సన్నిహితుడు కావడమే అందుకు కారణం.

సుబ్రహ్మణ్యాన్ని చూసి పెరుమాళ్ళలో క్రమ క్రమంగా అసూయ పెరిగిపోయింది. సమయంకోసం ఎదురు చూడసాగాడు రెండు మాసాల తర్వాత గోవిందమ్మాళ్ సుబ్రహ్మణ్యాన్ని తమతోపాటే కలో గంజో తాగి వుండమని ఆహ్వానించి తమ యింటిలో అతనికో స్థానం కల్పించింది పెరుమాళ్ళు అగ్గిమీద గుగ్గిలమైపోయాడు. ఈర్ష్యని లోలోపలే అణచి పెట్టుకున్నాడు

సుబ్రహ్మణ్యంతో గోవిందమ్మాళ్ రహస్య జీవితం బయటివాళ్ళకి తెలిసిపోయింది. యవ్వనంలో వున్న గోవిందమ్మాళ్ కొంత కాలం పెరుమాళ్ళని వుంచుకున్నదని, ఇప్పుడు సుబ్రహ్మణ్యంతో గ్రంథం నడిపిస్తున్నదని చుట్టుపక్కల వాళ్ళు చెప్పుకో

# ఆవేశాలూ...

సాగారు. పెరుమాళ్ళకి సుమారుగా ఆమె వయస్సే వుంటుంది. అతని మీదకంటె సుబ్రహ్మణ్యం మీద ఆమె ఎక్కువ ఇష్టం చూపించ సాగింది.

ఈ ముక్కోణపు ప్రేమ వ్యవహారం తెర తొలగిపోయినప్పుడు గోవిందమ్మాళ్ సాహసమైన జీవితం మొదలైంది

సుబ్రహ్మణ్యం గోవిందమ్మాళ్ మీద అంతులేని ప్రేమ కనపరచుతున్నా, ఏ క్షణంలోనైనా అతను తనను మోసంచేసి వెళ్ళిపోగలడని ఆమె వూహ. ఈ అపాయాన్నించి బయటపడాలని ఆమె నిత్యమూ ఆలోచిస్తూనే వుంది. చివరికి ఒక చక్కని ఉపాయం తట్టింది.

గోవిందమ్మాళ్‌కి ఒక పదహారేళ్ళ అమ్మాయి వుంది. ఆ అమ్మాయిని సుబ్రహ్మణ్యానికిచ్చి పెళ్ళిచేసేస్తే అతను ఎక్కడికీ వెళ్ళడు. ఇక్కడే వుంటాడు అనుకున్నది. అప్పుడు సుబ్రహ్మణ్యం వెళ్ళిపోతాడేమోనన్న బెంగ తనకేమీ వుండదు నిశ్చింతగా వుండొచ్చు — ఇదీ ఆమె ఆలోచన.

కాని, అంతవరకు గోవిందమ్మాళ్ వూహించని ఒకకొత్త సంగతి తెలిసింది. సుబ్రహ్మణ్యం—ఆమె కూతురు గాఢంగా ప్రేమించుకున్నారు. ఒకరిని విడిచి ఒకరు వుండలేనంతగా వాళ్ళ ప్రేమ వృద్ధయింది. గోవిందమ్మాళ్ బంగారుకలలు బూడిదయ్యాయి. అతనిని జీవితాంతకాలం తనతో వుంచుకోందామనుకున్న ఆమె అభిప్రాయం తల్లక్రిందు లయింది. కూతురుగురించి కూడా ఆలోచించింది. తన కుమార్తెతో సుబ్రహ్మణ్యానికి పెళ్ళయితే అతను భార్యతోపాటు వేరే సంసారం పెట్టుకుంటాడు. తను వంటరిదైపోతుంది. అది తన ఆశలకి గొడ్డలి పెట్టు.

ఈ విషయాన్ని గ్రహించి ఆమె అభిప్రాయం మార్చుకున్నది. తన కూతుర్ని పెరుమాళ్ళకిచ్చి పెళ్ళిచేయాలనుకున్నది. ఇది, ఒకదెబ్బతో రెండుపక్షులు చచ్చే మంచి ఉపాయంగా ఆమెకి తోచింది. ఈ విధంగా పెరుమాళ్ళు తనకి చాలా సాయం చేయగలడనుకుంది.

పెరుమాళ్ళకి ఆమె కుమార్తె కంటె ఆమె పొలంమీద ఎక్కువ ఆసక్తి. పొలం ఏనాటికయినా తనదిగా చేసుకోవచ్చునే ధైర్యంతో పెళ్ళికి వెంటనే అంగీకరించాడు.

ఇక్కడ—సుబ్రహ్మణ్యం, ఆమె కుమార్తెల ప్రేమని ఆమె సరిగ్గా తూచినట్లులేదు. అందుకే తప్పటడుగు వేసింది. సుబ్రహ్మణ్యం లేత హృదయానికి ఇదొక శరాఘాతం. వెంటనే ఆమె యింటిని విడిచి వెళ్ళిపోయాడు. కూతుర్ని ఎరచూపి సుబ్రహ్మణ్యంతో సుఖించాలనుకున్న గోవిందమ్మాళ్ పథకం తారుమారవడంతో ఆమె చాలా క్రుంగిపోయింది. సుబ్రహ్మణ్యాన్ని ఎలాగైనా తిరిగి రప్పించుకోవాలని — పెళ్ళికి ఒప్పుకున్నట్లుగా కబురంపింది.

పెరుమాళ్ళు ఈ విషయంలో చాలా ఆందోళన చెందాడు. ఆస్తి అంతా చేతికి చిక్కినట్టేచిక్కి అందకుండా పోతుందే! అని అతను బాధపడ్డాడు.

ఒకరోజు—ఈ నాటకాన్ని విషాదాంతం చేస్తూ చివరి తెర దిగిపోయింది!

1949 ఆగష్టు ఆరవ తేదీన సాయంత్రం ఏడుగంటలకి పొలానికి ఇంటికీ మధ్యదారిలో గోవిందమ్మాళ్

(64వ పేజీ చూడండి)



బి. ఎన్. ఆర్, పెద్దాపురం

ఏ రకమైన సేవాకార్యక్రమం తల పెట్టినా మోసం, దగా కక్కుర్తి తప్పడంలేదు ఎందుచేతనంటారు?

ఊరికేవస్తే మావాడూ మరొకడున్నాడనే తత్వం —మనది అంచేత

ఎస్. వి. ఆర్. ఎల్, అరవపల్లి

అన్నిటినీ శుద్ధిచేసే గంగ దేనితో శుద్ధి అవుతున్నది ?

ఆదిపూర్వకాలంలో సోదరీ, ఇప్పుడు గంగ కూడా కలుషితం అవుతోంది— మొన్న అంటుకున్న సంగతి వినలేదా?

ఎ. పి. ఆర్, నెల్లూరు

పట్టభద్రుడైన పదవి పొసగునంచు
కోరి యభ్యసించె కూటివిద్య
నేటి చదువులరయ పోటిమూటలేయని
పల్కవురనగ వినవె పద్మనాభ !
—విన్నావా తల్లీ.

కుమారా, 'చదవని వాడజ్ఞుండగు' అన్నది నీవూ విన్నావా?

కె. కె. ఎమ్, ఉంగుటూరు

ఈ ప్రపంచంలో నిజమైన బీదవా డెవరు ?

సహృదయులైన స్నేహితులే లేనివాడు.

టి. వి. ఆర్, టి. పి. గూడెం

జీవితం కల అయితే శరీరం ఏమిటి?

కలలకి తొలిమెట్టు

సి. హెచ్. ఆర్, డొంకరాయి

స్త్రీకి అధికారము ఎంతవరకు ఉన్నది?

పురుషుడు ఇచ్చినంత వరకే.

యస్. హెచ్. పి, రెంటచింతల

ఒకస్త్రీ మరియొక స్త్రీనిచూసి ఈర్ష్య పడుతుం దెందుచేత ?

స్త్రీ కాబట్టి.

ఎమ్. వి, సీతారాంపేట

స్త్రీ ఎప్పుడూ నిజం చెప్పదంటారు. ఎంతవరకూ నమ్మాలి ?

అక్కడికి పురుషుడెప్పుడూ నిజాన్నే పలికే టట్టు! మహా.

పి. ఎస్. ఆర్, గరగపర్రు

బాధ్యతగల పత్రికలో వ్యక్తుల సరదా కోసం ఒక పూర్తి పేజీని వ్యర్థపరచడం న్యాయమేనా ఓ రామలక్ష్మిగారూ,




అన్యాయమే గురూ, కాని ఏం చేస్తాం కొందరి వ్యక్తుల సరదాలు అందరికీ సరదాగా ఉంటూ ఉంటాయి.

వై. జె, ఊటుకూరు

నాకో కుట్టుమిషను ఉంది. చాలా వరకు స్వంతంగా నేర్చుకున్నాను. ఇంకా నేర్చుకోవాలని ఉంది. కట్టింగులు మొద లైనవి నేర్పే పుస్తకాలున్నాయా ?

ఉన్నాయి. 'ఈజీకట్టింగు' అనీ, ఇంకా అనేక పుస్తకాలు కుట్టుపనిమీద దొరుకుతున్నాయి. ఏ పెద్ద పుస్తకాల కొట్లలోనైనా దొరుకుతాయి లేకుంటే హిగిన్‌బాతమ్స్, మద్రాసు వారికి వ్రాయండి.

వి. వి. జి. ఆర్, అనకాపల్లి

ముందుకష్టపడి బతికేవారు తరువాత సుఖపడతారంటారు. ఎంతవరకు నిజం ?

నిజమే. ఎందుకంటారా— అప్పటికే కష్టపడ్డం అలవాటైపోతుంది కనుక అదీ సుఖంగానే ఉంటుంది !

పి. టి. ఎస్, కొవ్వూరు

పిచ్చిని అతితెలివి అనవచ్చా?

నిక్షేపంగా.

వి. వు. బి, బరంపురం

మీ పిల్లలు మిమ్మల్ని స్టయిలుగా ఇంగ్లీషులో పిలుస్తారా? లేక మమత ఆప్యాయత నిండిన స్వచ్ఛమైన తెలుగులో పిలుస్తారా ?

'మమ్మీ' అంటే ఆప్యాయతలేదనా మీ ఉద్దేశం? ఏ భాషలో పిలిచినా అమ్మ శబ్దంలో ఆత్మీయత లోపించదు.

ఎ. జి. ఆర్, గూడెం

డుయు ఎగ్రి ఎండ్ సె దట్ యంగ్ బోయిస్ ఎడ్యుకేషన్ మస్ట్‌బి కంప్లీటెడ్ బి—ఫోర్ స్టెప్పింగ్ ఇంటుది లౌ థింకింగ్?

సర్టెన్లీ, మై ఫ్రెండ్. బట్ వాట్ ఈజ్ లౌ థింకింగ్ ?

ఎం. ఎమ్, కరీంనగరు

ఎదుటివాడు చెప్పేదేమిటో వినడం మన తెలుగువాని లక్ష్యం కాదేమో!

అంత నిజం మీకెలా తెలిసింది చెప్మా!

ఎమ్. ఎస్. ఆర్, చిట్వేలి

విత్తు ముందా? చెట్టుముందా?

అవును— విత్తుముందా? చెట్టుముందా?!

డి. ఎస్. ఆర్, విశాఖపట్నం

దాంపత్య జీవితానికీ కుటుంబ నియంత్రణకు ఏమిటి సంబంధం ?

బాగుంది మీ ప్రశ్న— వండుకోడానికీ తినడానికీ ఏమిటీ సంబంధం అన్నట్టుంది!

ఎస్. ఆర్, సుల్తానాబాదు

మానవుడు జీవితంలో సాధించలేని దేది?

మానవుడు సాధించలేనివే— ఎక్కువ. సాధించేవాటికంటే.

పి. ఏ. ఎస్. పి, హైదరాబాదు

నిప్పులాంటి నిజం అంటారు. నిప్పు తాకితే ప్రాణాలుపోతాయి. అలాగే నిజాన్ని నమ్మినా ప్రాణాలు పోతాయనా ఆ సూక్తి అర్థం?

కొన్ని సందర్భాలలో నిప్పుకంటే కూడా కాలుస్తుంది కదా నిజం?.... అందుకే నిప్పుతోటి నిజంతోటి కూడా చెలగాటం ఆడడం ప్రమాదమే.

డి. ఎమ్. ఆర్, వాయల్పాడు

ప్రేమించి పెళ్లిచేసుకుంటే సంఘంతో పోరాటం. పెళ్లిచేసుకుని ప్రేమిస్తే జీవితంతో పోరాటం — ఎలా ?

రోజూ పొద్దుటే వచ్చి సంఘం— దెబ్బలాడుతోందా ఏం— ప్రేమించి పెళ్లి చేసుకుంటావా? అని. జీవితాన్ని వ్యక్తిగత అభిరుచికి అనువుగా మలచుకోవడంవల్ల సంఘానికంత బాధపడదు.

# నాలుగవ మజిలీ

సింగరాజు రామచంద్రమూర్తి



'నిలబడి ఉన్నారేం, కూర్చోండి తాతా మాస్టా' 'కూర్చుంటామేమిటోయ్ మంగరాజా, లే వారు కూర్చుంటారు' అన్నాడు డాక్టరు మూర్తి.

'ఫరవాలేదు నాయనా, నిలబడగలను. కాళ్ళపోయినా కూర్చోవాలంటే ఇటు పక్కనే బల్లమీద స్థలం ఉందిగా.'

'అబ్బెబ్బే, మీరటు కూర్చుంటే డాక్టరుగారు ఊరుకుంటారా? రండి సార్' అంటూ గభాలున కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు మంగరాజు.

నాకే హడావుడి నచ్చలేదు. మా అబ్బాయి డాక్టరు మూర్తికి స్నేహితుడే కావచ్చును. అంతమాత్రాన ప్రత్యేకత చూపించకూడదు. అందుకని ఆ మాటే అనేశాను కూడా.

'ఇటువంటి మర్యాదలు నాకు నచ్చవోయ్ మూర్తి! డాక్టరు ఈ స్నేహాలు అన్నీ పట్టించుకోకూడదు. అందరూ సమానులే! మనకి ఈ మొహమాటాలు చావవు కనుకనే మనవాడెవడూ వ్యాపారంలో బాగుపడడు.'

నవ్వేశాడు మూర్తి.

'పోనీ పరిచయాన్ని అవతల పెట్టెయండి. మీ వయస్సుకయినా మర్యాద ఇవ్వద్దూ?'

ఛెళ్ళున కొట్టినట్లయింది నాకు. ఈ మధ్యను ఎక్కడికి వెళ్ళినా ఇదొక బాధయిపోయింది నాకు. 'పెద్దవారు నిలబడలేరు' అంటూ వెధవ జాలి పీరూను. నా మీద ఎవరయినా జాలి పడితే నాకు పరమ అసహ్యం. ఈ లోకంలో నేను పనికిరాను అని వాళ్ళు చెబుతున్నట్లుంటుంది నాకు.

'నేనూ చిన్నప్పుడు బాగా వ్యాయామం చేసినవాడి నేనోయ్, క్రికెట్టు బ్రహ్మాండంగా ఆడేవాడిని. జ్వరం వచ్చి ఇంటర్ యూనివర్సిటీ సెలక్షన్స్‌లోకి పోలేకపోయాను.'

ముసలివాళ్ళకిలా మాట్లాడడం మామూలే అన్నంత తేలిగ్గా నవ్వేశాడు అతను. తరువాత లేచి స్టెతస్కోపుతో నా గుండెల్ని కాసేపు పరీక్షించాడు. రక్తపు పోటు కాసేపు పరీక్షించాడు. అవన్నీ అయినాక తన సీటులో పోయి కూర్చున్నాడు మాట్లాడకుండా.

నాకీ నిశ్శబ్దం చిరాకు కలిగించింది. సినిమాల్లో 'ఒక్కసారి మీరిలా రండి' అంటూ రోగి బంధువుని దూరంగా తీసుకెళ్ళి పెదిమ విరవడం గుర్తుకొస్తోంది.

'అనిక నేను గోపాల్‌తో మాట్లాడుతాను గానీండి బాబాయిగారూ, మీరిక డిస్పెన్సరీకి రాకండి ఇహనుంచి.'

'ఏం నేనొస్తే నీకిబ్బందిగా ఉంటుందా?'

'అమ్మమ్మ, భలే మాటనేశారే! మీ గుండె పరిస్థితి ఏమీ బాగాలేదండి. రక్తంపోటు కూడా ఎక్కువవుతోంది. అందుకని ఇంట్లోనే విశ్రాంతి తీసుకుంటుండండి. ఆలోచనలు తగ్గించుకోండి...ఇదుగో రమణరావుగారూ, రిక్షా ఒకటి పిలిచి బాబాయిగార్ని ఎక్కించండి.'

'నే వెళ్ళను' అన్నాను.

ఖంగారుపడ్డాడు మూర్తి. 'మీరు రెస్ట్ తీసుకోవాలండి.'

'కాసేపు ఇక్కడ కూర్చుంటే నీకే మయినా ఇబ్బందా ?'

'మళ్లీ మీరా మాట అంటే నన్ను...'

'మరిహ మాట్లాడకు. నన్ను కూర్చో నీయ్. ఒంటరిగా ఉంటే బోరు కొడు తుంది.'

మూర్తి ఇబ్బందిగా ముఖం పెడితే జాలేసింది. 'అతనికి నా పట్లగల అభి మానంవలన ఆ రకంగా అంటున్నాడు— అతని మాట వింటే ఏం పోయిందీ' అను కుని లేద్దామనుకుంటుండగానే ఒక కుర్రాడు హడావుడిగా లోపలికి పరుగెత్తు కొచ్చాడు.

అతను మహాలక్ష్మి మనమడు.

'డాక్టరుగారూ, మా తాత మిమ్మల్ని మళ్లీ ఒకసారి రమ్మన్నాడండి. అమ్మమ్మ ఏమిటోలా ఉంది' అన్నాడు రొప్పుతూ.

నన్నెవరో వెన్నుమీద చరిచినట్లయింది. 'ఏమిటి వీళ్ల అమ్మమ్మకి జబ్బు?' అనడి గాను మూర్తిని.

అలా అడగడంలో అతనేమయినా అను కుంటాడేమోనన్న ధ్యాసే లేదు ఆ ప్రశ్న అడిగేప్పుడు నాలో.

'నువ్వు వెళ్లవోయ్, ఇప్పుడే వస్తున్నా నని చెప్పు.' అని ఆ కుర్రాడు వెళ్లి పోయాక 'మహాలక్ష్మమ్మ పదిహేను రోజులుగా మంచంమీద ఉంది. ఈరోజు గడవదు కూడా' అన్నాడు మూర్తి.

మెడికల్ చెస్ట్ సర్దుకుని 'మరి నే వెళ్లివస్తాను బాబాయిగారూ' అంటూ బయటికి వెళ్లిపోయాడు.

నాకు మనస్సంతా అదోలాగయి పోయింది.

మహాలక్ష్మమ్మ అంటే అప్పట్లో వారందరికీ బాగా గుర్తు. మాతరం యువకులు చాలామంది మనసుల్లో దీపం అయి వెలిగింది. నీతి నిజాయితీ మీద పెద్దగా గురి గౌరవం లేని కుటుంబం వాళ్లది. అలాగని మరీ నీఛిన పడ్డారని కాదు.

మా ఇంటి దొడ్డివాకిలి నైపు వాళ్ల ఇల్లుండేది. అప్పటికి మహాలక్ష్మికి పెళ్లి కాలేదు. మనిషి మాత్రం గుర్రంలా ఎదిగి ఉంది. శెలవులకి నేను ఇంటికి రావడం ఆలస్యం. నాకు వినబడేలా పాటలు పాడేది. ఎవరితోనో అంటున్నట్లు నన్నుద్దేశించి మాట్లాడేది. ఇవన్నీ అది వయస్సులోకి వచ్చిన మొదటి రోజులలో సన్నమాట.

రాను రాను మనిషి కొంచెం శృతి మించింది. సైగలు చేసేది. అటుకేసి రమ్మన్నట్టు తను ఫలానాచోట ఉంటా నన్నట్లు గుర్తులు చెప్పేది.

నేను వసుధః చొరవలేని మనిషిని. దానికితోడు మా అమ్మ వాళ్ళకి మహాలక్ష్మి తత్వం తెలిసి ఉండటాన ఒక కన్ను నా మీద వేసి ఉంచేవారు. పైగా "ఫలానీ వారబ్బాయి అబ్బో శ్రీ రాముడు' అని అనిపించుకోవాలన్న తాపత్రయం నాకు ఉండేదనుకుంటాను అప్పట్లో. ఇవన్నీ కలిసి నాలోని ధైర్యాన్ని చంపాయి.

కాకపోతే ఆ అమ్మాయి అలా చొరవ తీసుకుంటూ ఉండడం మాత్రం నాకు చాలా సరదగా ఉండేది. అందుకనే నేనంటే విసుగు పుడుతుందేమోనన్న భయంతో మధ్య మధ్య మహాలక్ష్మి వంకచూసి నవ్వడం వంటివి చేస్తూ మా మధ్యనున్న ఆమూగ స్నేహం చావకుండా చూస్తుండేవాడిని.

నాకన్న సంవత్సరం ముందు మహా లక్ష్మికి పెళ్ళయింది.

నాకూ పెళ్ళయి మా రాజ్యం కాపరానికి రావడంతో నా పట్ల మహాలక్ష్మి శ్రద్ధ సన్నగిలి పోతుందనుకున్నాను కాని అలా కాకపోగా మా ఆవిడ చూస్తుందన్న భయ మయినా లేకుండా నన్ను చూపులతో వేటాడేది. రాజ్యం చూస్తుందేమోనని ఖంగారుగా ఉండేది నాకు.

ఒకసారి శ్రావణమాసం నోములకి పిలిచేందుకు మా ఇంటికి వచ్చింది మహాలక్ష్మి. ఇంటో నేనూ, మా రాజ్యం మాత్రం ఉన్నాము.

'అక్కయ్యగారూ' అంటూ లోపలికి వచ్చి నన్ను చూసి నవ్వింది. అంత వరకూ నాతో మాట్లాడుతున్నదల్లా మా రాజ్యం గభాలున లేచి,

'పంపు దగ్గర బిందె ఉంది. తీసు కొస్తాను - ఇక్కడే ఉండు మహాలక్ష్మి' అంటూ దొడ్లోకి వెళ్లింది.

నన్నుచూసి మళ్లీ నవ్వింది మహాలక్ష్మి. ఆ నవ్వు నా మగతనాన్ని సవాలు చేస్తున్నట్లు అనిపించింది నాకు. గభాలున లేచి మహాలక్ష్మిని రెండు చేతులతోను పొదివి పట్టుకుని గట్టిగా ముద్దుపెట్టు కున్నాను.

అంతలో మా ఆవిడ రావడంతో 'థాంక్స్' అని గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్లిపోయింది మహాలక్ష్మి. అయితే ఆ 'థాంక్స్' నాకో మా ఆవిడకో అర్థం కాలేదు నాకు.

మూర్తి రాకతో నా ఆలోచనలని ఆపి లేచి నిలబడి 'ఎలా ఉందయ్యా ఆవిడకి?' అనడిగాను.

'పోయిందండి'

క్షణకాలం కళ్లు మూసుకున్నాను. నవ్వుతూ, కవ్విస్తూ నేను గుర్తుంచుకున్న మహాలక్ష్మి అగపడింది.

మాట్లాడకుండా బయటకు వచ్చి నేరుగా మహాలక్ష్మి ఇంటికేసి నడిచాను. ఆవిడ మొగుడు షాపు దుకాణం పెట్టి బాగా సంపాయించి పెద్దబజారులో ఇల్లు కట్టాడు.

నే వెళ్ళేసరికి తతంగం జరుగుతూంది. పసుపు కుంకుమ జల్లారు. ఆ పసుపు కుంకుమల మధ్యగా పండిన ముత్తైదు వులా కనబడింది మహాలక్ష్మి మొహం.

'ఊళ్లోని పెద్ద ఘటాలు ఒకొక్కరు రాలిపోతున్నారు' అన్నాడు ఒకాయన. ఆ మాట విన్న ఇద్దరు ముగ్గురు నావంక చూసిన చూపు ఎందుకో నాకు గుండెల్లో గుచ్చుకున్నట్లయింది.

'ఇదుగో పాపం ఈయన ఉన్నాడు. ఇంకెంత కాలంలే? రోజులలో పడ్డాడు' అంటున్నట్లనిపించింది.

మహాలక్ష్మి మొగుడ్ని పరామర్శించుదా

మనుకున్న వాడినల్లా వెనక్కి తిరిగి ఇంటికి బయలుదేరాను

'ఏగా మహాలక్ష్మి పోయిందిటగా' అంది రాజ్యం ఇల్లు చేరగానే

మాట్లాడకుండా రాజ్యంవంక చూశాను

మనిషి వడిలిపోయింది జుట్టు ముగు బుట్టు కూర్చుంటే లేవలేదు ఏభయి సంవత్సరాల క్రితం రాజ్యానికి ఇప్పటికి తేడా ఏమిటి? ఆరవిరిసిన పువ్వులా ఇంటికి వచ్చింది అప్పుడు. .

నవ్వింది రాజ్యం 'ఏమిటి అలా చూస్తున్నారు?'

'మనంమాత్రం ఇంకెన్నాళ్ళు బతుకుతా మంటావు రాజ్యం? ఈ నాలుగవ మజిలీ దాటడంలో ముందు వెనక అంతే ఈ పందెంలో ఎవరు గెలిస్తే వారు అదృష్ట వంతులు'

'నిజంగా మహాలక్ష్మి చావు ఎందరికి వస్తుందంటారు? ఇంత పసుపు, కుంకుమలతో వెళ్ళిపోయింది అంతటి అదృష్టంకోసమే ఎదురుచూస్తున్నాను. ఈరోజే అది అయితే మహానందం'

'అవేంమాట అత్తయ్యా శుభమా అని అయినా మావయ్యగారికి ఊళ్ళోని ఆలోచనలన్నీ కావాలి మనవళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు ఇంకెన్ని జరగాలి ఏగాచేతి ఏగాదుగా' అంది అప్పుడే లోపలికి వచ్చిన సువర్చల.

సువర్చల మా రెండవకోడలు.

'తాతయ్యా, తాతయ్యా ఇందాకనుంచి ఎక్కడికి వెళ్ళావు నాకు చెప్పకుండా' అంటూ మా మోహనుడువచ్చి అమాంతం నా వడిలోకి ఎగిరాడు.

ఎందుకనో ఒళ్ళంతా కుదిపినట్లయింది వాడు ఎగిరిన ఎగురుకు 'అబ్బ, మెల్లిగా నాన్నా' అన్నాను—వాడు ఎక్కడ పడతాడోనని పొదివి పట్టుకుంటూ.

'వెధవ కానా, తాతయ్యమీదికి అలా ఒంటికాలిమీద ఎగురుతావేం?' తాతయ్య పెద్దవారని ఎన్నిసార్లు చెప్పాలి నీకు' అంది సువర్చల కొడుకుని కోప్పడుతూ.

'పెద్దవాడినేలే అమ్మాయ్, కాని చిన్న వాడిదగ్గర మనమూ చిన్నవాడిలా ఉంటేనే వాడికి మనకి మధ్యస్నేహం పెరుగుతుంది'

'వీడి హడావుడికి తట్టుకోవద్దూ మీరు? ఇందాకటే! అత్తయ్యని మీకు ఓపికలేదు

# నాలుగవ మజిలీ

పడుకోండత్తయ్యా అంటే పసివేళా శైలజని ఎత్తుకున్నారు అది కాస్త కూస్త పిల్ల ఏమన్నానా! చంకలో కూర్చుని ఒక్క ఎగురు ఎగిరింది ఈవిడేమో అపళంగా వెనక్కి పడి పోయారు అప్పుడు తేనెలూ, గ్లూకోజులూ నానా ఖంగారయిపోయింది పెద్ద తనమా మంగోహటా?'

నాకు చర్రున కోపం వచ్చేసింది మాట్లాడితే పెద్దతనం, పెద్దతనం అందుకనే 'ఒరేయ్ వెధవాయ్, మేం పెద్దవాళ్ళం మా దగ్గరకు ఎవరూ రాకండి' అన్నాను వీధిలోవున్న మోహనుడ్ని

వాడు తెల్లబోయాడు సువర్చల కూడా మాట్లాడకుండా వెళ్ళిపోయింది లోపలికి

నిద్దరోతున్నవాడినల్లా దాహంవేయడం వలన మెలకువ వచ్చేసింది 'అమ్మాయి సువర్చలా' అని పిలవబోయినవాడినల్లా ఆగిపోయాను.

అబ్బాయి, కోడలు గదిలో మాట్లాడు కోవడం వినబడుతోంది.

'మరీ మీ నాన్నగారికి 'పెద్దవారు మీరు' అంటే కోపం' అంది సువర్చల.

'అవునే, నాకు ముప్ఫయి ఏళ్ళు ఒక్క పిల్లాడు ఉన్నప్పుడు నేనింకా చిన్నవాడినే నన్న భావం ఉండేది. ఇప్పుడు ఇద్దరు




పుట్టాక పెద్దవాడినయిపోయా ననిపిస్తోంది'

'దానికీ, దీనికీ సంబంధం ఏమిటో?'

'పెద్దవాడి నయ్యాయన్న భావం కొంచెం బాధగా గూడా ఉంటోందని.. 'వాలో శక్తి ఉంది' అని పెద్దవాళ్ళు కూడా వారిని వారు నమ్మించుకుందుకు ప్రయత్నిస్తారు అటువంటి సమయంలో పాటికి పదిసార్లు మీరు పెద్దవారు, నంచోలేరు, పడుకోండి అని అనడం కొందరికి వినుగ్గా అనిపిస్తుంది అప్పుడే వాళ్ళని 'చివరి ప్రయాణానికి' తయారు చేస్తున్నట్లు బాధ పడతారు'

'అత్తయ్య మాత్రం పెద్దవారు కారూ?'

'మగాడికి అహంకారం ఉంటుంది. అది చావకూడదు ముసలివాడి ననుకుంటే ఇంకా ఏం కారం ఉంటుంది!'

సువర్చల విసుక్కుంది 'ప్రతిదానికి ఏమిటో మాట్లాడతారు' అంటూ

'చూడు సువర్చలా నీకు నాకూ తలి తండ్రులున్నారు వాళ్ళు నలుగురూ బ్రతికి ఉండటం మన అదృష్టం అంటాను వాళ్ళు చల్లగా ఉన్నన్నాళ్ళు మనం చిన్న పిల్లలమే! అది ఎంత తృప్తి నిస్తుందంటావు! నా కెవ్వడూ ఎవరయినా పోయారని వింటే ఇదే భయం పట్టుకుంటుంది మీ నాన్నగారు, అమ్మ పెద్దవారయిపోయారని, వాళ్ళా ఒక రోజున ఆలోచించలేను సువర్చలా ఆపైన. అంత భయం వేస్తుంది మా ఆఫీసులో ఎక్కువమంది నా వయస్సువాళ్ళే ఏడాదికి ముగ్గురు నలుగురికి తండ్రో, తల్లో పోతున్నారు నా వంతు ఎప్పుడు వస్తుందో నని వణికిపోతుంటాను

అందుకనే నే చెప్పేది వీళ్ళింక ఎన్నాళ్ళో ఉండరు ఉన్నన్నాళ్ళు వీళ్ళ మనస్సు నొప్పించకుండా ప్రవర్తించుకోడం - మన విధి ఇహ పడుకోనియి నన్ను

నాకు దాహం ఎగిరిపోయింది.

నిద్ర లేచేసరికి ఇల్లు కొంచెం హడావిడిగా ఉంది. రాజ్యం మంచంమీద పడుకుని ఉంది

గభాలున దగ్గరకు వెళ్ళి 'రాజ్యం ఏమిటి పడుకున్నావు?' అనడిగాను.

మాట్లాడలేదు

ఆట్టే పిలుద్దామని చేయి వేసేంతలో వేణుగోపాలుడు వచ్చాడు. 'అమ్మకి జ్వరం వచ్చింది నాన్నగారూ, ఇందాక శైలజని వేసుకొని పడిందిట. చెబితే వినదు పెద్దతన మమ్మా అంతతాపత్రయం ఉండకూడదంటే పిల్లల్ని పట్టుకుని వదలదు. వంటింట్లో చాప వేసుకుని పడుకునిఉంటే అనుమానం వచ్చి చూశాను. వళ్ళు కాలిపోతోంది' అన్నాడు.

అలా చూస్తుండిపోయాను.

పరుపుమీద ఉందా, లేదా అన్నట్లుగా అతుక్కుపోయి ఉంది రాజ్యం. పూర్వపు ఆ నునుపు, శక్తి ఏమయిపోయాయి ఈ మనిషిలో. నాచేత ఒక్క పనికూడా చేయ నీయకుండా నా పనులూ, ఇంటి పనులూ

# నాలుగవ మజిలీ

తనే స్వయంగా చేసుకుపోయేది. కష్ట సుఖాల్లో పాలు పంచుకుని నాకు ఆనందాన్ని, తృప్తిని కలిగించడమే తన లక్ష్యమన్నట్టుండేది. మాది ఏభయి సంవత్సరాల స్నేహం. అటువంటి మనిషి ఈనాడు... అయిపోయిందా — నన్ను నామానాన వదిలి వెళ్లిపోతుందా? ఒంటరిగా నా జీవితం...

'నాన్నగారికి కూడా బత్తాయి రసం ఇస్తున్నావా? ఇంతసేపా?' అంటున్నాడు వేణుగోపాల్.

'తీసుకోండి మావయ్యా'

'నాకేం వద్దమ్మా' అన్నాను. సీటిపారల గుండా రాజ్యం ఆగపడుతోంది.

తిరిగి నా గదిలోకి వెళ్లిపోయాను.

'మీ నాన్నగారి కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి చూశారు' అంటోంది సువర్చల మెల్లిగా.

'అవును. ఆయన మా అమ్మని ఏనాడూ కష్టపెట్టలేదు. బలహీనురాలని కంటికి రెప్పలా, పిల్లలా కాపాడారు.'

అది పిల్లల అభిప్రాయం. నిజానికి నిజం కూడా అదే నేను రాజ్యంమీద ఏనాడూ చేయి చేసుకుంచిలేదు ఎప్పుడయినా తిట్టినా అది దాని మంచికోసమే.

మా పెద్దవాడు పుట్టినతరువాత మనిషి మరీ బలహీనంగా ఉందని డాక్టరు దగ్గరకు తీసుకెళ్లి పరీక్ష చేయించి మందులు తెచ్చి రోజూ వాడమన్నాను. రాజ్యానికి మందులమీద నమ్మకం బొత్తిగా లేదు... తీసుకుంటున్నానని చెబుతుండేది. ఒకరోజు అనుమానం కలిగి చూస్తే మందులన్నీ అలాగే ఉన్నాయి. నాకు వళ్లు మండిపోయింది. చచ్చేట్లు చీవాట్లు వేశాను. కోపం తగ్గలేదు. చేయెత్తాను. కాని కొట్ట బుద్ధి కాలేదు కోపం తగ్గలేదు. ఆ మందులన్నీ తీసుకుపోయి రోడ్డుమీద పారేశాను.

మధ్యాహ్నం ఇంటికి వచ్చేసరికి మందులన్నీ ఏరితెచ్చుకుని అలమారులో పెట్టింది పారేయడంలో పగిలిపోయినవి కూడా తెచ్చుకుంది.

జాలేసింది. సాయంత్రం మళ్లీ కొత్తవి తెచ్చాను. ఆనాటినుంచి ఇప్పటిదాకా మందు ఆగలేదు...

కొంచెం కాలంపాటు స్నేహితులుగా ఉండి విడిపోతుంటే ఆ ఎడబాటుకి బాధ పడతారు. కావాలంటే—డబ్బుకు లక్ష్యపెట్టకపోతే—వాళ్లు ఎప్పుడు కావాలంటే అప్పుడు కలుసుకోగలరు. అయినా విచారపడతారు. మెత్తని మనస్సుగలవారయితే ఏడుస్తారు.

అటువంటిది ఏభయి సంవత్సరాల స్నేహం తరువాత ఎడబాటు కలుగుతే — అందులోనూ మళ్లీ జీవితంలో ఎంత ప్రయత్నించినా కలుసుకోలేని ఎడబాటు కలుగుతే...

గుండె బరువెక్కిపోయింది. నొప్పిగా కూడా ఉంది. డాక్టరు మూర్తి 'ఆలోచించవద్దు' అంటాడు కాని ఎలా? కదలద్దంటాడు. అయినా లేచాను. ఎందుకో రాజ్యం నానుంచి దూరమయిపోతుందన్న దిగులు నన్ను బలహీనుడ్ని చేసేస్తోంది. రాజ్యం పడుకున్న మంచం దగ్గరగా వెళ్లి నిలబడ్డాను.

ఏదో లోకంలో ఉండి ఊపిరి పీలుస్తున్నట్లుంది.

'రాజ్యం' మెల్లిగా పిలిచాను.

పలకలేదు.

పడక కుర్చీ లాక్కుని ఆమె మంచం పక్కనే కూర్చున్నాను.

నాకు కొన్ని ప్రిన్సిపుల్స్ ఉండేవి. నా పనులు నేను చేసుకోవడం అందులో ముఖ్యమయినది. చిన్నతనంనుంచి తలంటుకోవాలన్నా నా అంతట నేనే అంటుకునేవాడిని. రాజ్యం కాపరానికి వచ్చినా కూడా అదే అలవాటు కొనసాగించ దలుచుకున్నాను. అయితే నేను ఊహించనిది ఒకటి ఉందన్న విషయం తరువాత తెలిసింది.

ఏదో పత్రికలో పడిన వ్యాసం ఒకదాన్ని తెచ్చి నాకు ఇచ్చింది రాజ్యం ఒక రోజున.

'ఎందుకు?' అని అడిగితే 'చదవండి మిమ్మల్ని గురించే' అంది నవ్వుతూ.

ఆడది తన భర్త తనమీద పూర్తిగా ఆధారపడితే ఎంతగా ఆనందపడుతుందో వివరించే వ్యాసమది.

చదివి 'రేపటినుంచి' అన్నాను నవ్వుతూ.

ఆ రోజు మొదలు నాలో బద్ధకం పెరిగిపోయింది. ప్రతి చిన్న పనికి రాజ్యం కావాలి. అదే మహారాజయోగం ఈనాటిదాకా జరిగింది నాకు. చెబితే సిగ్గుగా ఉంటుందిగాని బంధువు లెవరయినా వాళ్ల

ఇంటికి పిలిస్తే వెళ్ళేందుకు సందేహించే వాడిని. ఆ కొన్నాళ్ళ ఎడబాటు భరించ వలసి ఉంటుందని.

రాజ్యం లేని జీవితం ఊహించుకోలేను. నే నెవరికీ అన్యాయం చేయలేదు. భగవంతుడు కరుణాసముద్రుడంటారు. నా ఈ కోర్కె తీర్చలేడా!

ఎదురుగా గోడకి వేళ్లాడదీసి నిత్యం భగావదీప నైవేద్యాలందుకుంటున్న ఆ విగ్రహాన్ని చూస్తుండిపోయాను అలాకూర్చుంటే గుండెనెప్పి రానురాను ఎక్కువ కాసాగింది. కళ్ళు మూసుకున్నాను కాసేపు ఆ విగ్రహం శిలగా కనబడి అదృశ్యమయింది...

చిటపట లాడుతూ మండిపోతోంది వాటి మధ్యన నా రాజ్యం భౌతికరూపం అదృశ్యమయిపోతోంది. చూస్తూ ఉండి పోవడం తప్ప నే చేయగలిగిందిలేదు.

వెనకనుంచి శ్రీనివాసు నన్ను మెల్లిగా తట్టి 'అయిపోయింది పదండి నాన్నగారూ' అన్నాడు.

యాంత్రికంగా వెనక్కి తిరిగి రాజ్యం లేని లోకంలోకి అడుగు పెట్టాను...... దూరంగా మా ఇల్లు అగపడుతోంది.

మా అమ్మని దహనంచేసి ఇంటికి వచ్చి రాజ్యం వడిలో తల పెట్టుకుని 'ఒంటరి వాళ్లమయిపోయాము రాజ్యం' అని బావురుమన్నాను ఒకనాడు.

కాని ఈనాడు నా రాజ్యం ఏది? ఎవరు నన్ను ఓదార్చేవాళ్ళు?... 'ఒంటరి పక్షి నయాను' అనుకున్నాను. ఆ నిజం నన్ను దహించివేస్తోంది.

అరుగుమీద కూలబడ్డాను. ఈ గడచిన ఇన్ని సంవత్సరాలుగా రాజ్యం నా పక్కన లేకుండా నేను పడుకున్న రోజులు బహు కొద్ది. ఎవరయినా ఏమయినా అనుకుంటారేమోనన్న భయంలేకుండా ప్రత్యేకం మా ఇద్దరికోసం ఒక పడకగదికూడా కట్టించాను. మా ఇంట్లో అదొక పవిత్ర దేవాలయంగా చూసుకునేది రాజ్యం.

ఆ గదిలోకి వెళ్లాను. గదంతా బోసిపోతోంది. 'రాజ్యం' అని పిలిచాను.

ఎవరు పలుకుతారు?

'రాజ్యం' పెద్దగా పిలవాలనుకున్నాను గొంతుపూడిపోయింది. కుళ్లి కుళ్లి ఏడ్చాను.

నా కన్నీటితడికి నాకే మెలకువ వచ్చేసింది. ఊపిరి అందటం లేదు.

కళ్ళు విప్పిచూస్తే నాకు మొదటగా కనబడింది నా కాళ్లదగ్గర పెద్ద బొట్టుతో కూర్చుని ఉన్న రాజ్యం. నా ఆనందం వర్ణనాతీతం. నా రాజ్యం నాకు దూరం కాలేదు. కాకూడదు.

'రాజ్యం' పెద్దగా పిలుద్దామనుకున్నాను కాని పెగిలిరాలేదు.

నా ముఖంలోకి ఆదుర్దాగా చూస్తోంది రాజ్యం. గుడ్లనీరు గుడ్లలోనే కుక్కుకుంటోంది

'స్పృహ వచ్చినట్లుంది పిలవండి' అంటున్నారు ఎవరో. ఎవరో నాకు తెలియడం లేదు. నూతిలోంచి వినబడుతున్నట్లున్నాయి వాళ్ల మాటలు.

ప్రయత్నంమీద కళ్ళు తిప్పాను. శ్రీనివాసు అగపడ్డాడు

వీ డెప్పుడు వచ్చాడు? పక్కనే వాడి భార్య పద్మావతి నిలబడి ఉంది. ఏడుస్తోంది.

నా కాశ్చర్యం వేసింది. తల తిప్పి చూడబోయాను. కాని సాధ్యం కాలేదు.

'నీ కోసం చూస్తున్నారురా నాన్నగారు— వేణూ ఇటురండి' అని శ్రీనివాసు మాటలు కాబోలు మెల్లిగా వినబడ్డాయి.

వేణు, వాడి భార్య సువర్చలా వచ్చి శ్రీనివాసు పక్కన నిలబడ్డారు.

గుండెల్లో నెప్పిగా ఉంది, ఊపిరి ఆడనట్లుగా ఉంది.

'ఏమిటి దంతా?' ప్రయత్నం మీద అడిగాను.

'ఏమిటో మాట్లాడేందుకు ప్రయత్నిస్తున్నార్రా ఆయన చూడటం లేదాయె' అన్నారెవరో.

నా మాటలు బయటికి రావడం లేదన్నమాట.

'ఏమిటి నాన్నగారూ?' అడుగుతున్నాడు శ్రీనివాసు నా చెవిదగ్గర నోరుపెట్టి.

సాధ్యమయినంత కలయ చూశాను, నాకు ఆక్సిజను ఎక్కిస్తున్నారనుకుంటా. రాజ్యం వైపు చూశాను. గొల్లున ఏడుస్తుంది.

అప్పుడర్థమయింది.

డాక్టరు మూర్తి నాడి పరీక్షిస్తున్నాడు. అతని ముఖంలో ఆందోళన ప్రస్ఫుటంగా అగపడుతోంది

మళ్ళీ రాజ్యం వంక చూశాను. 'నన్ను వదిలి పోతారా' అన్నట్లు దీనంగా చూస్తోంది.

నాకు చెప్పాలని, ఉంది 'అవును రాజ్యం ఈ విషయంలో మాత్రం నేను స్వార్థపరుడ్నే! నువ్వులేని ఈలోకం నేను భరించలేను. ఆడదానివి — నీకు ఓర్పు ఎక్కువ. అందుకనే ఈ పందెంలో నే నే గెలుస్తున్నాను' అని.

కాని మాట్లాడేందుకు ప్రయత్నించ లేదు—లాభం లేదని తెలుసును గనక.

నా కంటినిండుగా రాజ్యాన్ని చూస్తుండి పోయాను.

నా మనస్సు ఎక్కడికో తేలిపోతోంది.

రాజ్యం నా కంటికి రాను రాను మసక మసకగా అగపడుతోంది... ●



# వారఫలం

## 19-4-68 శుక్రవారం మొదలు
## 25-4-68 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారాంతంలో చికాకులు యేర్పడతాయి మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**వృషభం** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మిధునం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. అనుకూల వార్తలను వింటారు.

**కర్కాటకం** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల ముమ్ముందు ఉపయోగం ఉంటుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య** వృత్తిలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు సాటివారితో మాటపట్టింపులు రావచ్చును. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:** వ్యాపారం భారీయెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. సాటివారితో మాటపట్టింపులు తగవు. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు:** ఇతరుల నిమిత్తం మీరు చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి గాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**మకరం** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది

**మీనం** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

—మహేష్

సీరియల్





సి. ఆనందారామం

### జ రి గి న క థ

వారిజ ఆవూరికి కొత్తగా వచ్చింది రామచంద్రని ఆకర్షించింది. అ విని ఇంటికి ఆహ్వానించింది. రామచంద్రమీద అభిమానం పెంచుకుంటుంది వారిజ. రామచంద్ర కూడా వారిజని ప్రేమిస్తాడు. ఆమె గతంలో ఒక సినిమాతార అని తెలుసుకున్న తర్వాత అతను గుండెరాయి చేసుకుంటాడు. వారిజ వృత్తిని విరమించుకుని తన కుటుంబానికి సాయ పడుతూవుంటుంది. అయినా ఆమెమీద అందరికీ దురభిమానమే వారిజ చెల్లెలు లత. రామచంద్రానికి లతతో వివాహం ఐ పోతుంది.

## 7

'లతా! అంటూ ఆప్యాయంగా దగ్గరగా తీసుకున్నాడు రామచంద్ర—

వారిజలా తన స్పర్శలో పరవశించి పోతుందనుకున్నాడు—వారిజ కళ్లలో తనను చూడగానే వెలిగే మెరుపుల లాంటివి లత కళ్లలోనూ చూడగలుగుతా ననుకున్నాడు. వారిజలా లతకూడా తనను ఎవరో అపురూప దేవతనులా ప్రగాఢమైన ఆరాధనా భావంతో సమీపిస్తుందనుకున్నాడు—

అతను ఆశించిన దానిలో ఒక్కటి కూడా లతనుండి పొందలేక పోయాడు రామచంద్ర—పైన ఏదో విసుగుదల కూడా లీలగా తోచింది — మొత్తంమీద యవ్వన సహజమైన ఉద్రేకం తప్ప మరేమీ పొందలేక పోయాడు లతనుండి—

హృదయపూర్వకమైన ప్రేమ — ఆ ప్రేమతో కూడిన తపన—అహం పూర్తిగా నశించిన ఆత్మార్పణ—ఒక స్త్రీనుండి పొంద గలిగిన పురుషుడు ఆ మాధుర్యాన్ని అంత తేలిగ్గా మరిచి పోలేడు—వారిజ వ్యక్తిగత జుగుప్సాకర చరిత్ర వారిజనోటనే విని వారిజను చీదరించుకొంటున్నా వారిజ తన మనసుకు కలిగించిన అతి తీయని స్పందనలు అతని హృదయాన్నింకా విడిచిపోలేదు — చైతన్యం పరవళ్లుతొక్కే కవ్వింపులు—లాలిత్యం నిండించుకున్న అనునయాలు—మాధుర్యం చిప్పిలే మందహాసాలు— వీటి పులకరింతలను అతని శరీరం ఇంకా వదిలించుకోలేదు— తిరిగి అలాంటి అపూర్వ అనుభవంకోసం అతనికి తెలియకుండానే అతని హృదయం ప్రతీక్షిస్తోంది—

లత పూర్తిగా నిరుత్సాహాన్నే కలిగించినా సహించాడు రామచంద్ర — ఇంకా కొత్త పెళ్లికూతురు—ప్రేమంటే ఏమిటో తెలియని పసిమనసు కావచ్చు—కాలం గడిచి తనను అర్థం చేసుకుంటే ఆవిడే తనను ప్రేమిస్తుంది—ఆనాడు తన హృదయం ఏ అనుభవంకోసం పరితపించి పోతోందో ఆ అనుభవం మళ్లీ పొందవచ్చు— అని తనను తను ఓదార్చుకున్నాడు రామచంద్ర—తెల్లవారు ఝామునే లేవటం రామచంద్ర కలవాటు—లేచి కొంతసేపు వ్యాయామం చేసి, చెరువులో స్నానంచేసి, అప్పుడు ఇంటి కొచ్చి కాఫీ తాగుతాడు—

రామచంద్ర స్నానంచేసి వచ్చాక కూడా లత లేవలేదు—లత మంచంమీద కూచోని చిందరవందరగా ఉన్న లత ముంగురులు సవరిస్తూ 'లతా! అన్నాడు మృదువుగా— లత బద్ధకంగా వత్తిగిలి—' 'అబ్బా! రాత్రి నిద్ర చాలలేదు. కాసేపాగి లేస్తాను బాబూ !' అంది—

రామచంద్ర నవ్వుకున్నాడు — మత్తుగా అస్తవ్యస్తంగా ఉన్న చీరతో పడుకున్న లత పసిపాపలా అనిపించింది రామచంద్రకు. వంగి నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు—ఒక్కసారి చికాకుగా కదిలి మళ్లీ కళ్లు మూసుకుంది లత—రామచంద్ర తనే స్టౌ వెలిగించి లతకూ తనకూ కాఫీ తయారు చేసాడు—

లతను బుజ్జగింపుగా లేపాడు—

'లే, లతా! కాఫీతాగవూ? పోనీ కాఫీతాగి పడుకో!' చక్కిలిగిలి పెట్టాడు—లత బలవంతాన కళ్ళు తెరిచింది—భుజాలు పట్టుకు లేవదీసాడు—బాత్‌రూంకేసి నడిపించాడు—అప్పటికి లతకు కాస్త

మత్తు వదిలిందిఽ మూఖరం కడుక్కుందిఽ

'దేవీ! ఇదిగో కాఫీ! స్వీకరించండి—' అంటూ చిరునవ్వుతో కాఫీగ్లాసు అందించాడు రామచంద్ర—

రామచంద్ర సున్నిత మనస్కుడైన భావుకుడు—భావుకుడు ఒకరకంగా చాలా అదృష్టవంతుడు— అందమైన ఒక అనుభవాన్ని లౌకికుడు అనుభవించినదానికంటె కొన్నిరెట్లు గాఢంగా అనుభవించగలడు— ఆనంద పారవశ్యాన్ని అతడు భజించినట్లు సామాన్యుడు భజించలేడు—కానీ, ఈ భావుకతలో ఒక బలహీనత కూడా వుంది—ప్రతి విషయాన్ని ముందుగానే తన భావనా దృష్టితో చూడటానికి ప్రయత్నించటం— ఒక విషయం ఇంకా ప్రారంభం కాకుండానే తన ఊహలతో అందంగా చిత్రించేసుకోవటం—

జీవితం అందమైన ఊహకాదు — వెలుగు చీకట్లు — రాగవిరాగాల — శ్రుత్యపశ్రుతుల—భోగ వైరాగ్యాల—విచిత్రమైన సమ్మేళనం—భావుకుని ఊహలా జీవితం ఎందుకుంటుందీ ?

కానీ, ఇలా అనుకుని సమాధాన పడలేడు భావుకుడు—తన ఊహకూ, వాస్తవానికీ మధ్యగల భేదాన్ని తలుచుకుని బాధపడతాడు — కృంగి పోతాడు — విలవిలలాడతాడు—ఈ సంఘర్షణే, ఈ ఒరపిడే, అతనిలోని భావుకతకు ఏదోవిధమైన వ్యక్తీకరణను వాంఛిస్తుంది—కనీసం తన భావనలను వేరువిధంగా వెళ్ళగక్కు కోవటంలోనైనా సంతృప్తిని పొందాలని పరితపిస్తుంది—అందుకే లోకంలో ఇంతమంది కవులు, కళాకారులు, గాయకులు, రచయితలు—శిల్పులు.

తను కాఫీ అందించగానే లత నొచ్చుకుంటుందనుకున్నాడు రామచంద్ర—

'మీరెందుకు చేసారు? నేను స్వయంగా చేసి మీకివ్వాలనుకొంటుంటే?' అని అభిమానంగా కోప్పడుతుందనుకున్నాడు—

'పాపిష్టిదాన్ని—మెలకువ రాలేదు - మీరు చేసారా?' అని బాధతో తనను తను నిందించుకొంటుందనుకున్నాడు—

'ఇంకమీదట ఇలాచేస్తే నామీద వట్టే!' అని ముద్దుగా బెదిరిస్తుందనుకున్నాడు.

'అబ్బ! ఎంత బాగుందండీ! మీ చేత్తో ఇవ్వబట్టి కాబోలు ఈ కాఫీకి ఎక్కడలేని రుచి వచ్చిందిఽ' అని తనను పొగుడుతుందనుకున్నాడు.

లత ఇవేవీ అనలేదు - కాఫీ కొంచెం త్రాగి విరగబడి నవ్వింది.

'ఛీ! ఇదేం కాఫీ! పంచదార పానకం! ఎలా త్రాగుతారు ఇలా?' అంది—

రామచంద్ర ముఖం వడిలి పోయింది—

'ఏదో చేసాను—పోనీ, నేనిచ్చానని ఇవాళకి ఎలాగో తాగెయ్యి—ఏం?' అన్నాడు నవ్వు తెచ్చుకుంటూ—లత తన చేతిలో గ్లాసును టక్కున క్రిందపెట్టింది—

'కావాలంటె మీరు చేసుకున్నది మీరు త్రాగండి బాబూ! ఈ పానకం నేను తాగలేను — నేను మళ్ళీ పెట్టుకుంటానుఽ' అంటూనే వంటింట్లోకెళ్ళిపోయింది—తనగ్లాసులోదీ లత గ్లాసులోదీ కూడా కాఫీ అంతా అవతల పారబోసి పక్కమీద వాలి కళ్ళు మూసుకున్నాడు రామచంద్ర—

లతను ప్రేమించి ప్రేమింపబడాలని రామచంద్ర తన హృదయాన్ని శ్రుతి చేసుకుంటూండగానే అపస్వరాలు వినిపించేస్తున్నాయి— వాటిని సర్దుకోడానికి మథన పడుతున్నాడు—

పది నిముషాలలో లత కాఫీ తాగుతూ రామచంద్ర దగ్గర కొచ్చింది —

'ఇదీ కాఫీ అంటే? ఎంత బాగుందనుకున్నారు?'



'మరి; నాకేదీ?'

'మీరు చేసుకున్నది మీకు బాగుందిగా! తామట్టుకే పెట్టుకున్నాను—'

కాఫీ తాగుతూనే అంది— 'పోనీ సగం తీసుకోండి' అంటే బాగుండునని ఆశ పడ్డాడు రామచంద్ర—లత అలా అని ఉంటే 'నాకొద్దులే నువ్వేతాగు—' అని ఉండేవాడు—కానీ లత మాట్లాడకుండా కాఫీ తాగి ఖాళీగ్లాసు తీసుకుని వెళ్లి పోయింది.

ఒక్క నిట్టూర్పు విడిచి పొలంమీదికి బయలుదేరాడు రామచంద్ర—

* * *

రామచంద్రకు బాగా జబ్బు చేసింది—తను స్వయంగా దగ్గిరుండి సేవలు చేసింది—అతని శారీరక బాధనంతా తన సపర్యలతో, అనునయ వాక్యాలతో మరపిస్తోంది—తన కళ్లలోకి చూస్తూ, తన కబుర్లు వింటూ, తనకు జబ్బురావటం కూడా ఒక అదృష్టమే ననుకొంటున్నాడు రామచంద్ర—

రామచంద్రకు జబ్బు నయమయింది — తనకూ రామచంద్రకూ మధ్య సాన్నిహిత్యం ఎక్కువయింది—తన మనసును మమతనూ అర్థం చేసుకున్న రామచంద్ర తన గత చరిత్రలోని మాలిన్యాన్ని క్షమించి మరిచి పోగలిగాడు—

'వారిజా! నిన్ను ప్రేమిస్తున్నాను—గాఢంగా.. అతిగాఢంగా...కావాలి — నువ్వు కావాలి నాకు—నీతి నియమాలూ—సంఘమూ మంచి చెడ్డలూ ఇవేమీ అక్కర్లేదు — నువ్వుచాలు—రా! నాలో కలిసేసుకుంటాను'

అంటూ తనను దగ్గిరగా లాక్కుని కౌగిలిలో ఉక్కిరిబిక్కిరి చేసేసాడు—అతని ఊపిరి వెచ్చగా తనకు గిలిగింతలు పెడుతోంది —అతని పెదవులు బలంగా తన పెదవులను వత్తుకుంటున్నాయి — తనలో అమృతాన్ని నింపి తననుండి మధువును లాక్కుంటున్నాయి—ఏదో తమకంతో లాలనతో ఆ పెదవులు తన ముఖమంతా తడి మాయి—మెడమీద చక్కిలిగిలి పెట్టాయి—అతని చేతులు తన శరీరంమీద బిగుసు కొంటున్నాయి — నడుమును చుట్టుకొన్న అతని చేతులుపైదికి లేస్తున్నాయి—తన జాకెట్టు హుక్స్ తెగిపోయాయి...తన...

'వారిజా!' అన్న రవి పిలుపుకి ఉలిక్కి

# చీకటి కడుపున...

పడి ఈ లోకంలోకి వచ్చింది వారిజ—

'వారిజా! నీ దగ్గిర ఒక పదిరూపాయ లుంటే ఇయ్యి వారిజా!'

'పదిపైసలులేవు — ఒక్కపక్క అప్పు తీర్చాలి—ఈనెలలో ఇప్పటికప్పుడే నీకు వందపైగా ఇచ్చాను—ఎక్కడ తేను?' కసురు కుంది వారిజ—

రవి చిన్నబుచ్చుకుని 'పోన్లే! అమ్మ మందుకోసం అడిగాను. వెళ్తాను—ఎవరెలా చస్తే నీకేం?' అన్నాడు

'అవును ఎవరెలా చచ్చినా నాకక్క ర్లేదు—నా చావు మాత్రం మీకందరకూ కావాలి—'

అంటూ వారిజ లేచి, మిగిలిన సగం నెలకూ తనకు అయిదు రూపాయలు మాత్రం మిగుల్చుకుని అయిదు రవి చేతులో పెట్టింది.

రూపాయలు కంటపడగానే రవిముఖం వికసించింది—వారిజ నిష్ఠూరాలు గాలి కెగిరిపోయాయి— 'వస్తాను వారిజా!' అంటూ హుషారుగా వెళ్లిపోయాడు—

రవి రాకతో తెగిపోయిన ఆలోచనలన్నీ ఒక్కసారి గుర్తుకొచ్చాయి వారిజకి—శరీరం జలదరించింది.

'ఛీ! ఛీ!' అనుకొంది.

ఏవిటీ ఆలోచనలు? తన మనసు ఇంత క్షుద్రమయిందా? రామచంద్ర సాన్ని హిత్యాన్ని పొందడంకోసం అతనికి తీవ్ర మైన జబ్బుచెయ్యాలని కాంక్షిస్తోందా? వేడిగా కాలిపోతున్న తన శరీరాన్ని, ఎగసి ఎగసి పడుతోన్న రొమ్ముల్ని చూసుకొని అదిరిపడింది వారిజ—తన శరీరం ఇంకా ఇంత కామాన్ని వాంఛిస్తోందా? ఆశలన్నీ అణగిపోయాయనుకోవటం— కేవలం రామ చంద్రధ్యానంతో మాత్రమే సంతృప్తిపడ గలననుకోవటం — ఇదంతా ఆత్మ వంచనేనా? ఎలా జయించాలి దీనాన్ని? తన బ్రతుకు కిక విముక్తి లేదా? చటుక్కున వారిజకు స్ఫురించింది—ఈపిచ్చిపిచ్చి ఆలోచనలు తన మనసును ఆక్రమించుకోవ డానికి ప్రధాన కారణం సోమరితనం—తనకు మొదటనుంచి ఉక్కిరిబిక్కిరిగా పనిచెయ్య టం అలవాటు— సినిమా రంగంలో ఉన్న ప్పుడు సరేసరి—మొన్నటివరకూ బి. ఏ. చదువుతో సరిపోయింది— ఇప్పుడు ఏపనీ లేకపోయేసరికి ఈమనసు ఇష్టం వచ్చినట్లు పరుగులు పెడ్తోంది — లోలోపల నిద్రాణంగా ఉన్న పాశవిక శక్తులన్నీ ఒక్క సారి బలంగా లేస్తున్నాయి—ఈ పాశవిక శక్తులనుండి మానవుడి కసలు విముక్తి లేదు—అవి సంపూర్తిగా నాశన మవటం అంటూ ఉండనే ఉండదు—రక్తమాంసాలలో ఒకభాగంగా శరీరంలో అవి జీర్ణించుకు పోయే ఉంటాయి—మానవుడు చేయగలిగిం దల్లా వీటిని అణచి ఉంచటమే!

ఏమనిషికైనా సోమరితనాన్ని మించిన శత్రువులేదు—సోమరితనం జడత్వానికి దారి తీస్తుంది— ఈ జడత్వం పశుత్వపు వాకిలి—లాభంలేదు— ఇంక తను సోమరిగా ఉండ కూడదు

ఆరోజునుండీ వారిజ అనేక ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టసాగింది—లైబ్రరీలన్నీ తిరిగి మంచి మంచి పుస్తకాలు సంపాదించి చదవటం మొదలు పెట్టింది—ఒక రోజు అలాగే పేపరులో 'కావలెను' ప్రకట నలు చూస్తుండగా రామచంద్ర ఊళ్లోనే క్రొత్తగాపెట్టిన ఆడపిల్లల బళ్లోటీచర్ కావాలని ప్రకటన కనుపించింది — వారిజ హృదయం విపరీతమైన ఆవేశంతో స్పందిం చింది—వెంటనే దరఖాస్తు రాసింది—

ఎందుకు? తననంతగా అసహ్యించు కొంటున్న రామచంద్ర దగ్గిరకు ఎందుకు మళ్లీ? రంపపుకోత తప్ప తను బావుకునేది ఏం ఉంటుంది?

అతని తిరస్కారం తనను ఎంత చిత్రవధచేసినా, ఒకసారి అతనిని చూడాలని తన మన సెంతగా తపించి పోతోంది? తీక్షణమైన అతని కన్నులనీ, నిర్మలమైన అతని చిరునవ్వునీ, ఒక్క సారి దర్శించుకోగలిగే అదృష్టం లభిస్తే మరో ఇంత అవమానాన్ని ఎదుర్కోవలసి వస్తేమాత్రం ఏం?

తనను విపరీతంగా ద్వేషించే మనిషిని తను ఎంతగా ఆరాధిస్తే మాత్రం ఏం లాభం?

రామచంద్రకు తనమీద ద్వేషమేనా? ఇంకేమీలేదా? ఆనాడు తను చివరిసారిగా సెలవు తీసుకున్నప్పుడు గుమ్మందాకా అతణ్ణి నడిపించి తీసుకొచ్చిన అదృశ్యశక్తి ఏమిటి? ఆనాడు అతని కనుకొలకులలో

వారిజ దరఖాస్తు కవరులో పెట్టి అంటించి అడ్రస్ రాసింది—వెంటనే చింపేసింది—మళ్ళీ రాసి మళ్ళీ కవరులో పెట్టి పోస్టాఫీస్‌దాకా వెళ్ళి కవరు పోస్ట్‌బాక్స్‌లో వెయ్యడానికి బదులు చెత్త డబ్బాలో పారేసి వచ్చింది— కొంచెం సేపాగి మళ్ళీ రాసింది—ఈసారి పోస్ట్ డబ్బాలో పడేసి, వేగంగా స్పందించే గుండెలతో సమాధానంకోసం ఎదురు చూడసాగింది

అది ఒక ప్రైమరీస్కూల్. బి. ఎ. పాసయికూడా ఆ స్కూల్లో అంత తక్కువ జీతానికి దరఖాస్తు పెట్టినవ్యక్తి వారిజ ఒక్కర్తే! ఆ కారణంచేత ఇంటర్వ్యూ కూడా లేకుండానే అపాయింట్‌మెంట్ ఆర్డర్ పంపించారు—సంతోషమూ, సంభ్రమమూ, భయమూ, ఆవేగమూ నందడిస్తోన్న హృదయంతో ఆరేళ్ళతరువాత మళ్ళీ ఆ గ్రామానికి బయలుదేరింది వారిజ.

* *

చెరువులో స్నానంచేసి వళ్ళు తుడుచుకుంటూ చటుక్కున ఆగిపోయాడు రామచంద్ర—ఒక్కసారిగా అతని సర్వశరీరం నుండీ చైతన్యం నశించినట్లయింది — ఆ వ్యక్తి! ఎవరు? వారిజ! సందేహం లేదు వారిజే! చాలా మారిపోయింది — మనిషి బాగా చిక్కిపోయింది — కళ్ళలో మునుపటి చైతన్యంలేదు — తెల్లటి చీర కట్టుకుంది—ఒకనాడు తనను భయపెట్టిన నల్లపూసలు లేనిమెడ శంఖంలా మెరుస్తోంది మన్నగా—జగత్తులో దైన్యాన్నంతా తనలోనే ఇముడ్చుకున్నట్లుగా ఉన్న ఆ కళ్ళు తననే చూస్తున్నాయి—

రామచంద్ర కదిలిపోయాడు — కరిగిపోయాడు — కరిగి ఒక ప్రేమ పొంగై వెల్లువలా వారిజవైపు సాగాడు—సంవత్సరాలుగా మనసులో అణిచేసుకున్న మమత లొక్కసారిగా పొంగాయి — నిరంతరమూ హృదయంలో మననమవుతూ యౌవనానికి సార్థక్యాన్నిచ్చే ఆ అనుభూతి—మానవత్వపు చరితార్థతను నిరూపించే ఆ ప్రేమ ఆకారం దాల్చి అతనిముందు నిలిచింది— ఎలుగెత్తి పిలుస్తోంది అతణ్ణి నిశ్శబ్దంగా — నిశ్శబ్దంలో—ఆ పిలుపు అతనిలోనూ ప్రతిధ్వనిస్తోంది — ఇన్నాళ్ళుగా హృదయంలో ఘోషపెడుతోన్న మూగ ఆర్తిలో ఆ ప్రతిధ్వని కలిసిపోతోంది—రెండుచేతులూ జాపి

# చీకటి కడుపున ...

అడుగులు వేస్తున్నాడు—వారిజ తప్ప ఎవరూ కనపడని తన్మయత్వంతో — ప్రేమ తప్ప ఏమీ అక్కర్లేని మైకంతో—

'క్షమించండి—మీకోసం రాలేదు—'

వెల్లువ తీసి పోయింది—

పొంగు చల్లారిపోయింది.

ఉప్పొంగిన మమత వెనక్కు విరిగిపోయి హృదయాన్ని ముక్కలు చేసింది.

సమస్తాన్నీ మరపించిన ప్రేమ, వాస్తవికత ముందు పరాజయంతో, పరాభవంతో దీనంగా ఘోషించింది—ఆవరించిన మైకం కరిగిపోయి శిలాశిలలా కరడుగట్టింది—వణికిపోతూ, దీనంగా చూస్తూ, తనకు తాను సంజాయిషీ ఇచ్చుకొంటున్నట్లుగా 'మీకోసం రాలేదు—' అంటోన్న వారిజను సమీపించగానే చాపిన చేతులు వాలిపోయాయి రామచంద్రకి — కళ్ళు నిప్పులు కురిశాయి

'నాకోసమేవచ్చావు—'

భయంకరమైన ఈ నగ్నసత్యాన్ని భరించలేక నిలువునా వణికింది వారిజ—

'కాదు! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నది నిజమే అయినా...'

'కాదు! నన్ను ప్రేమిస్తున్నది నిజం కాదు - సర్వాబద్ధం - నీకు నేనంటే ద్వేషం—పగ—నా కర్మాన్న నేను సుఖంగా ఉంటే చూడలేవు—పెళ్ళిచేసుకుని ప్రశాంతంగా సంసారం చేసుకొంటున్న నా జీవితంలో నిప్పులు పొయ్యటానికి వచ్చావు—నా మనసులో తిరిగి దేవదానవ సంగ్రామం సంధింపచేసి హాలాహలంతో నా మనసుని నింపివేయాలని వచ్చావు—ప్రేమ! నీకేం తెలుసు ప్రేమగురించి? తెరవిగాద రోజా కొకళ్ళని, జీవితంలో రోజుకి పదిమందిని ప్రేమించగలిగిన పుణ్యాత్మురాలివి? ప్రేమించిన దానివే అయితే, పెళ్ళిచేసుకుని ఇప్పుడిప్పుడే గాయం మాన్చుకొంటున్న నాహృదయంలో చిచ్చుపెట్టడానికి మళ్ళీ తయారవుతావా?'

'మీరు పెళ్ళిచేసుకున్నారా?'

'అంత ఆశ్చర్యపోతున్నావేం? నిన్ను ధ్యానంచేస్తూ, నీకోసం తపిస్తూ జీవితాంతం అలా ఉండిపోతాననుకున్నావా? అలా ఉండాలని కోరుకున్నావా?'

'కాదు! కాదు!...'

'కాదు—వారిజా! వెళ్ళు. వెళ్ళిపో ఇక్కడినుంచి—ఇకముందు నాకు కనబడకు. నాకు నటించడంచేత కాదు. ఇంతకంటె మృదువుగా నీకు చెప్పలేను. మహారుడివైనా నువ్వెవరవైనా ఆలోచించకుండా నిన్ను ప్రేమించాను—ఆ ప్రేమ పాశాలనుండి నన్ను నేను విముక్తుణ్ణి చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను— నాకు కనబడకు— నువ్వు కనిపిస్తే నాకు ఆత్మహత్య చేసుకోవాలన్నంత క్షోభ కలుగుతుంది—'

కళ్ళు విప్పార్చుకుని రెండుక్షణాలు రామచంద్ర ముఖంలోకి సూటిగా చూసింది వారిజ—తల వాల్చుకుని శరీరాన్ని ఈడ్చుకుంటూ కదిలింది.

అక్కడే క్రింద కూలబడిపోయాడు రామచంద్ర—

'వెళ్ళిపోకు—వెళ్ళిపోకు వారిజా! ఒక్కసారి నా గుండెల్లోకి రా! నీకోసం—నీస్పర్శకోసం అణువణువునా తపించిపోతోన్న ఈ శరీరానికి కాస్త శాంతి కూర్చు—' ఆక్రోశించింది అతని మనసు.

వారిజ వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ అతని వంక చూసిన చూపు— ఎన్నెన్ని అర్థాలు దాక్కున్నాయి ఆ దీనమైన చూపులో?

'అన్నీ అబద్ధాలు—నిజంగా నా ఉనికి మీకంత అసహ్యంగా ఉందా?' అని గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తున్నట్లుగా ఉందా చూపు—

'నా మాటలకు అభిమానపడి నిజంగా నువ్వింక నాకు కనపడకపోతే నానేమైపోవాలి వారిజా!'

తనలో తను అడుగుతూ శరీరాన్ని ఈడ్చుకొంటూ అడుగులువేశాడు రామచంద్ర—

* * *

సొమ్మసిల్లి వాలు కుర్చీలో పడుకున్న భర్తను గమనించనైనా గమనించకుండా డిటెక్టివ్ నవల చదువుకొంటూంది లత—ఇది ఒక రకంగా మామూలే! లత డిటెక్టివ్ నవలలు చదవటంలో మునిగి తేలుతూ ఉంటుంది — రామచంద్రకే సమయంలో ఏది కావాలో చూసుకోదు—లత ఈ ప్రవర్తన రామచంద్రకు కొంత అసహనాన్ని కలిగించినా, అది అంతా ఎదగనితనమనే నమ్మాడు— నిజం కూడా అంతే! సినిమాల్లోనూ, కథల్లోనూ నేర్చుకున్నది తప్ప లతకు ప్రేమంటే ఏమిటో తెలియదు—విశ్వాసవసరాల్లు, చీరలు, నగలు, డాబులు

పిలిచి పిలిచిన సున్నితమైన భావం స్పందన లత హృదయం ఎరుగదు — అకారణంగానే లత ప్రేమను మంచివీద సాధించాలనే రామచంద్ర ప్రయత్నాలన్నీ లతకు అతనిమీద గౌరవభావం బదులు మరింత లోకువనే కలిగించాయి.

రామచంద్ర వచ్చేసరికి లత చదువుకొంటూ ఉంటుంది.

మృదువుగా 'లతా!' అంటాడు.

తలెత్తకుండానే 'ఊ!' అంటుంది.

రామచంద్ర నవ్వుకుని తనే టీ పెట్టుకు తాగుతాడు. లత లోలోపల నొచ్చుకోకపోతుందా అని రామచంద్ర ఆశ.

కాని లత భావన వేరు 'ఎవడికోసం పెట్టుకుంటాడటా?' శారీరకంగా అలిసిపోయి మానసికంగా మథనపడుతోన్న రామచంద్ర చికాగ్గా 'లతా! టీ పెట్టు' అన్నాడు.

లత మంచంమీంచి లేవకుండా పడుకొని డిటెక్టివ్ నవల చదువుతోనే 'అబ్బ! మంచి సస్పెన్స్‌లో ఉన్నాను. మీరు పెట్టుకు తాగుదురూ!' అంది.

రామచంద్రకు చికాకెక్కువయింది లేచి లత చేతిలో నవల లాక్కొని గిరాటేసి 'లే! టీ పెట్టు' అన్నాడు కటువుగా.

లత కోపంగా లేచింది.

'ఏమిటా మోటుతనం? చదువుకొంటూంటే పుస్తకం లాగేస్తారేం?'

'ఏం చెయ్యను లాగెయ్యక? తల పగిలిపోతోంది—టీ పెట్టు.'

'ఒక్క పది నిముషాలాగండి—ఈ ఒక్క చాప్టరూ అయిపోయాక పెడతాను.'

మళ్ళీ పుస్తకం తెచ్చుకుంది లత—రామచంద్ర కోపం అవధులు దాటింది.

'తల పగిలిపోతోందని చెప్తుంటే ఏమిటా మొండితనం? తరువాత చదువుకుందువుగాని—లే!'

'అంతగా అర్జంటయితే పెట్టుకోకూడదేం?'

పెంకెగా అంది పుస్తకంలో పేజీలు తిరగేస్తూ—

ఎంత అణచుకున్నా రామచంద్రలో చిరాకు అంతకంతకు ఎక్కువ కాసాగింది.

'అసలే అలిసిపోయివస్తే ఏమిటీ పెంకె సమాధానాలు లతా?' అన్నాడు కోపంగా—

అతనికోపం లతను భయపెట్టలేదు.

'అబ్బో! ఏం పెద్ద ఆఫీసర్ ఉద్యోగం చేసివచ్చారని అలిసిపోయారు?'

అంది వెటకారంగా మూతి తిప్పుతూ.

దిమ్మెరపోయాడు రామచంద్ర.

అతనికి ఎంత కాదనుకున్నా వారిజ గుర్తొచ్చింది, ఆనాడు జ్వరంలో ఉండగా వారిజ పళ్ళరసం తీసుకొచ్చింది—

'అబ్బ! ఇప్పుడేగా తాగాను—వద్దు—' అన్నాడు విసుగ్గా.

'ఇప్పుడేనా! గంటయింది—గంటకో సారి పళ్ళరసం తాగమని డాక్టరు చెప్పలేదూ! తాగండి మరి!'

'గంటయిందా? నీతో కబుర్లు చెపుతోంటే నా కసలు టైం తెలీలేదు—నీకు చూడు, గడియారం మీదే దృష్టి—' నిష్ఠూరంగా అన్నాడు.

కిలకిల నవ్వింది వారిజ — పారిజాతాలు పరుచుకున్నట్లు—వెన్నెలలు పిరుసుకున్నట్లు సౌరభాలు క్రమ్ముకున్నట్లు — మమతల మంచుజల్లులు కురిసినట్లు—

'మీకు నా కబుర్లమీద దృష్టి—నాకు మీమీద దృష్టి — అందుకే మీ ఆరోగ్యం ముఖ్యం నాకు — మీరు రసం తాగలేదని నాకు గుర్తుంది — మీకు తెలుసా నేనింతవరకూ అన్నం తినలేదని?'

సిగ్గుపడిపోయాడు తను—

'ఇంతవరకూ అన్నం తినలేదూ! ఎందుకు కూర్చున్నావు మరి, అన్నమైనా తినకుండా!'



'ఎందుకో తెలిస్తే ఇన్ని తిప్పలెందుకు? తెలియకపోవటంలోనే ఉంది ఈ అంతమంతా' ఈ రసం తాగండి — నే వెళ్ళి భోజనం చేసివస్తాను—'

'నేను తాగేస్తే వెళ్ళిపోతావా?'

మళ్ళీ నవ్వింది వారిజ—

'ఇప్పుడేగా ఎందుకున్నావని అన్నారు—ఇప్పుడే 'వెళ్ళిపోతావా?' అంటున్నారా? సరే! నాకసలు తిండివద్దులెండి — మీ ముందే కూర్చుంటాను.'

'నేను చాలా స్వార్థపరుణ్ణి వారిజా! వెళ్ళు—వెళ్ళి అన్నం తిని రా!'

వారిజ చిరునవ్వుతో చిందరవందరగా ఉన్న జుట్టు నిమురుతూ అంది—

'స్వార్థంలలో చాలా రకాలున్నాయి తెలుసా! కొన్ని కొన్ని స్వార్థాలు ఎదుటి వాళ్ళకు బాధను కలిగిస్తాయి—మరి కొన్ని స్వార్థాలు ఎదుటివాళ్ళకు అంతులేని ఆనందాన్ని కలిగిస్తాయి — మొగవాడిలో ఈ రకమైన స్వార్థం ఆడదానికి ఎంతటి ఆనందం కలిగిస్తుందో మీకెలా తెలుస్తుందీ? ఎన్ని జన్మలు తపస్సు చేసుకుంటే లభిస్తుంది అలాంటి ఆనందం? నా ఎడబాటు సహించలేని మీ ఆవేదన ముందు నా కసలు ఆకలి తెలుస్తుందా?'......

ఆలోచనలోంచి తేరుకుని రామచంద్ర చూసేసరికి లత మళ్ళీ పుస్తకం తీసుకుని చదువుకొంటూంది. వళ్ళుమాలిన కోపం వచ్చింది రామచంద్రకి...

'ఛీ! నీకసలు నామీద ప్రేమలేదు—ప్రేమ ఉంటే, నే వచ్చీరాగానే నాకేం కావాలో చూడవా? నా ముఖం చూసే నేను అలిసిపోయానని అర్థంచేసుకోలేవా?'

లత విసురుగా పుస్తకం మూసి లేచింది.

'ఏమాకుందికదూ నామీద ప్రేమ! నా కష్టసుఖాలు ఒక్కలా కనిపెట్టి చూస్తున్నారు! కొత్తచీరెలు కొనిపెడుతున్నారు—రోజూ పువ్వులు తెస్తున్నారు—సినిమాలకు తీసికెళుతున్నారు!—ఛీ! ఛీ! కాస్త నవల చదువుకోనీటానికి కూడాలేదు!—

పుస్తకం అవతల పారేసి (బహుశః ఆ చాప్టర్ పూర్తయిందేమో!) రుసరుస లాడుతూ వంటింట్లోకి నడిచింది లత.

నిర్ఘాంతపోయాడు రామచంద్ర.

(ఇంకా ఉంది)

భగవంతుడు నిర్గుణుడై పున్నప్పుడు పరమాత్మగా ఉండినా, సగుణుడై వున్నప్పుడు వివిధ నామరూపాలు వహిస్తూ ఉంటాడు. అప్పట్లో అతని ప్రవృత్తి అనేకవిధాలుగా వుంటుంది ఒక్కొక్కప్పుడు కొన్ని సంఘటనలు త్రిమూర్తులకూ తెలియకుండానే జరుగుతూ ఉంటాయి. అవి వారికి ఆశ్చర్యాన్ని కూడా కలిగిస్తూ ఉంటాయి.




ఒకప్పుడు పరమేశ్వరుడు ఉదయాన నిత్యకృత్యాలు తీర్చుకుని స్వచ్ఛమైన విభూతిని నొసట దట్టంగా పూసుకుంటూ ఉన్నాడు. అలాంటి సమయంలో అతడు ధరించిన పులితోలు పెద్ద పులిగా మారిపోయింది. దాన్ని చూడగానే ఆ ప్రక్కనేవున్న నందీశ్వరుడు బెళ్లిపడి పరుగెత్తి పారిపోయాడు. ప్రాణాపాయం కలుగుతుందనే భయం పుట్టినప్పుడు అందరూ ఆలోచన లేకుండా ప్రవర్తించడం పరిపాటి ఆ సమయంలో నందీశ్వరుడికి-తాను భగవంతుడి వాహనమనీ, ఎంత పెద్ద క్రూరమృగమయినా ఏమీ చెయ్యలేదనీ ఆ సమయంలో తోచలేదు. అందువల్లనే పారిపోవలసి వచ్చింది.

ఈ సంఘటనను చూచి పరమేశ్వరుడు ఆశ్చర్యపడ్డాడు.

అయినా క్షణకాలంమాత్రమే ఆయనకు విభ్రాంతి కలిగింది. ఆ వెంటనే యథార్థస్థితి అంతా గ్రహించి చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఇలా ఎందుకు జరిగిందంటే—

శివుడు భస్మధారణం చేస్తూవున్నప్పుడు ఆ భస్మం అతని కంఠమాలగా ఉన్న నాగరాజు కళ్లలో పడింది. కొంచెం ఏమరుపాటులో ఉన్న ఆ పాములరేడు తన కళ్లలో పడినది దుమ్ము అనీ, ఎవరో తన కళ్లలో దుమ్ము కొట్టారనీ కోపించి బుస్సుమని ధ్వనిచేస్తూ మీదికి లేచింది అది మహాకోపంతో ఉన్నదేమో దాని విషాగ్ని జ్వాలలు పైకి ఎగసిపోయాయి ఆ మంటలు తాకడం వల్ల పరమేశ్వరుడి శిరోభూషణంగా ఉన్న చంద్రుడు ద్రవించిపోయాడు. చంద్రుడు అమృతపు ముద్దగదా! అతడు కరిగిపోవడంచేత అమృతం కారి శివుడు ధరించిన పులి చర్మంమీద పడింది అమృతం ఏ ప్రాణి అవయవశేషంమీద పడినా ఆ చచ్చిన ప్రాణి తిరిగి బ్రతుకుతుంది గదా! ఆ కారణంవల్లనే పులితోలు పులిగా మారిపోవడమూ, దానిని చూచి శివుని వాహనమైన నందీశ్వరుడు పరుగెత్తిపోవడమూ జరిగింది.

ఇది భగవంతునికే విభ్రాంతి కలిగించినప్పుడు, అతని కంఠాభరణమైన నాగరాజుకు భస్మమునందలి ధూళిభ్రాంతివలన కోపం కలగడమూ, శార్దూలం తన్ను మింగివేస్తుందనే భ్రాంతివల్ల శివుని వాహనం పారిపోవడం సహజమే!

అవికూడా ఆ వెంటనే తమ భ్రాంతులను గ్రహించాయి. తమ తప్పులను తెలుసుకున్నాయి. పరమేశ్వరుని మందహాసంతో పాటు వాటికిన్నీ ఎంతో సిగ్గు కలిగింది పరమశివుడు తలయెత్తి చూడడంతో అవి తలలు వంచుకున్నాయి. ●



మల్లన్న మంత్రి రాజధానికి కొన్ని సొరంగపు దారులు ఉన్నాయి. ఆ దారుల వివరాలు ఉన్న పత్రాలు కోటలో ఒక గదిలోని పెట్టెలో ఉన్నాయి. ఆ పత్రాలను దొంగిలించడానికి కొంత మంది గూఢచారులను పంపించాడు దక్షిణదేశపు రాజు.

దక్షిణదేశపు గూఢచారులు లంచం యిచ్చి మల్లన్న మంత్రి కోటలో పని చేస్తున్న రంగయ్యను లోబరచుకొన్నారు. రహస్య పత్రాలను దొంగిలించి దక్షిణదేశపు గూఢచారులకు యివ్వడానికి రంగయ్య అంగీకరించాడు.

దక్షిణదేశపు గూఢచారులు రహస్య పత్రాలకోసం ప్రయత్నం చేస్తున్న సంగతి మల్లన్న మంత్రికి తెలిసింది. కోటలోని సేవకుడు కూడా వారితో కలిసినట్లు మల్లన్న మంత్రికి తెలిసింది కాని ఆ సేవకు డెవరైనదీ తెలియ లేదు. రహస్యంగా మల్లన్న మంత్రి ఆ పత్రాలను మరొకచోటికిమార్పించి, ఇదివరకు పత్రాలు ఉన్న పెట్టెలో మరొక పత్రాలను ఉంచాడు.

పత్రాలను మార్చిన సంగతి రంగయ్యకు తెలియదు. ఒకనాడు రంగయ్య మామూలు పెట్టెలో ఉన్న పత్రాలను దొంగిలించాడు. పెట్టెలోని రహస్య పత్రాలు దొంగిలింపబడ్డాయని భటులు రాజుకు, మల్లన్న మంత్రికి తెలియజేశారు. వెంటనే మల్లన్న మంత్రి కోటలో పనిచేస్తున్న సేవకులకు విందు చేశాడు. మల్లన్న మంత్రి యెందుకు విందు చేశాడో ఎవరికీ తెలియలేదు.

రంగయ్యే పత్రాలను దొంగిలించినట్లుగా మల్లన్న మంత్రి విందు అయిన తరువాత తెలిసికొన్నాడు. రంగయ్యను రహస్యంగా వెంబడించి వెళ్ళి దక్షిణ దేశపు గూఢచారులు యెక్కడ ఉన్నది తెలిసికోవలసినదిగా భటులను ఆజ్ఞాపించాడు మల్లన్న మంత్రి.




భటులు రహస్యంగా రంగయ్యను వెంబడించారు. రంగయ్య ఆ రాత్రికి దక్షిణదేశపు గూఢచారులను కల్సుకొన్నాడు. అప్పుడు మల్లన్న మంత్రి భటులు రంగయ్యను, దక్షిణ దేశపు గూఢచారులను కూడా బంధించివేశారు. రాజు వారిని తగినట్లుగా దండించాడు.

రంగయ్యే పత్రాలను దొంగిలించినట్లుగా యెలాగ తెలిసిందని రాజు మల్లన్న మంత్రిని ప్రశ్నించాడు. దానికి మల్లన్న మంత్రి యిలాగ జవాబు యిచ్చాడు.

'ప్రభూ! అసలు పత్రాలను పెట్టెలోనుంచి తీసివేసి, నకలుపత్రాలను అందులో ఉంచాను. ఆ పెట్టె మీదను ఒక సీసాను ఉంచాను. రంగయ్య పెట్టెను తీసే ముందు, సీసాను పట్టుకొని ప్రక్కగా ఉంచాడు. ఆ సీసామీద అతని వేలి ముద్రలు పడ్డాయి. తరువాత నేను చేసిన విందులో సేవకు లందరూ గాజుగ్లాసులతో మంచి నీళ్ళు త్రాగారు. ఆ గ్లాసులమీద సేవకు లందరి వేలి ముద్రలు పడ్డాయి. అప్పుడు వేలి ముద్రలను పోల్చగా సీసామీద ఉన్న ముద్రలు రంగయ్యవే నని తెలిసింది. ఈ సంగతి బయటకువస్తే రంగయ్య దక్షిణదేశపు గూఢచారులను కలుసుకొనకపోవచ్చును. కాబట్టి వేలిముద్రల సంగతిని రహస్యంగా ఉంచాను.'

మల్లన్న మంత్రి యుక్తిని రాజు యెంతగానో మెచ్చుకొన్నాడు. ●



# జయమా అపజయమా



జైలు వార్డరు వచ్చి నవారు నేస్తున్న సీతారాముణ్ణి భుజం తట్టాడు:

'నీ కోసం ఎవరో వచ్చారు పంతులూ. లేలే. అయినా నిన్ను రాతకోతలకని యీ గదికి పంపించాం గాని, నవారు నేయమని ఎవరు చెప్పారయ్యా?'

'రాతకోతల కంటె నేయటమంటేనే నాకిష్టం సింహాద్రిగారూ. అయినా నా కోసం వచ్చేవాళ్ళెవరూ వుండరే.' అని సీతారాముడు లేచి నిలబడ్డాడు.

'ఏమో. నాకేం ఎరిక? ఎవరో ఆడపిల్ల. కిందటి నెల గూడా ఆలస్యంగా వచ్చి తిరిగి పోయిందని సూపరెంటు గుమాస్తాగారు చెబుతున్నాడు. పేదరుపులు అరుపాత్రవు నీకేం తక్కువయ్యా. నిన్ను మగాళ్ళే 'లవు' జేస్తుంటే ఆడాళ్ళు 'లౌ' జెయ్యరంటయ్యా.'

వార్డరు సింహాద్రి జోక్‌తో ఆ గదిలో నవారు నేస్తున్న ఖైదీలందరూ పగలబడి నవ్వ సాగారు.

* * *

కటకటాల ఊచల నిలపడి, సీతారాముడు తన తలమీది జైలు టోపీ తీసి ముఖం తుడుచుకొని, వరుసగా, ఆవేదనా పూరిత దైన్యవదనాలతో ఆత్రుతగా పరికిస్తున్న ఖైదీల బంధువుల్ని పరిశీలించి చూస్తున్నాడు. ఒక చివరగా జానకి కన్పించింది.

'జానకీ! నువ్వా...?'

అక్కడ కావలావున్న వార్డరు-అందర్నీ హెచ్చరిస్తున్నాడు।

'తినుబండారాలూ, వుత్తరాలూ ఏవీ ఆర్డరులేందే ఖైదీలకు యివ్వగూడదు. ఇనప వస్తువులు, బ్లేడ్లూ—ఎవరైనా — పట్టుబడితే — శిక్ష. అరగంట టయిం వుంది.'

వార్డరు కొంచెం దూరం, పోగి పోయిందాకా తాత్సారించి జానకి కటకటాలను సమీపించింది. ఆమె మాటలకోసం పెనుగులాడుతున్నదని, తనను పోల్చుకోనీయని కన్నీళ్ల తెరను చీల్చ చూస్తున్నదని సీతారాముడు గ్రహించాడు. కటకటాలకు తన కణతలను ఆనించి—మళ్లీ పిలిచాడు. 'జానకీ...' ఆమె ఒక చేతితో ఇనుపకడ్డీలను పట్టుకొన్నది.

'నన్ను క్షమిస్తావా...సీతారాం'

'విన్నా? నీ తప్పేముంది? పిచ్చిదానివి.'

'నేను ఓడిపోయాను. నీ కన్నా గొప్ప దానిననుకొని ఒకసారి గర్వపడి మోస పోయాను. నేనే జయించాననుకొని అను కొన్నాను. కాని విజయం నీది. నీ పాదాలను స్పృశించే అర్హత గూడా నాకు లేదు. ఒక్కమాట కోసం వచ్చాను. 'నిన్ను క్షమి స్తున్నాను' అను. చాలు.'

సీతారాముణ్ణి గూడా మాటలు పెగల్చ నీకుండా గుండెలో వున్నదేదో ఆపుతున్నది. జైల్లో నేర్చుకొన్న ఓర్పు, అంతః పరిశీ లన గూడా అతనికి కొంతసేపు తోడ్పడ లేదు. కాని బొట్టూ, మంగళసూత్రమూ లేని జానకి రూపుచూసి విభ్రాంతుడై నాడు; దానితో మాట పెగిలింది.

'జానకీ...'

జానకి అప్రయత్నంగానే పమిటె చెంగును మెడకు చుట్టుకొన్నది. అశ్రు జలాన్ని దాచటానికి అటువైపు తిరగ బోయింది.

'నా కెందుకు ఉత్తరం రాయలేదు— జానకీ'

'ఎందుకు? ఇక్కడ గూడా నీ శాంతిని నాశనం చేయటానికా? నీ పాదధూళిని శిరస్సున ధరించే అధికారాన్ని యిదివరకే కోల్పోయాను. ఇంకా పాపం చెయ్యమం టావా?'

'ఎప్పుడు...? ఏమైంది?'

'ఆరు నెలలయింది. ఆయన తాగుతున్నా డని నాకిదివరకే తెలుసు కాని గుండె జబ్బు సంగతి తెలియదు. ఒకరోజు తెల్ల వారుఝామున మెట్లమీద పడివున్నారు.'

జానకి వెక్కివెక్కి ఏడుస్తున్నది. కట కటాలతో ఇరికించిన కణతల్ని గట్టిగా సీతారాముడు నత్తుకొంటున్నాడు. గంట మోగింది.

వార్డరు సింహాద్రి మళ్ళీ భుజం తట్టాడు.

'ఎవురు పంతులూ. విధువురాలుగా వుంది'

'అవును... జానకి విధవ అయింది.' నవారు గదిలో నవ్వు ముఖాలన్నీ ముడుచు కొన్నవి.

* * *

ఆ వేసవి కాలంలో—వున్న వూళ్లోనే— ఆర్. టి. సీ వాళ్ల బస్సు డిపోలో కాంటీనూ; ఫ్యాన్సీస్టోర్సు తీసుకొన్న సీతా రాముణ్ణి—తెలివిన పడ్డావురా—అని పెద్ద లందరూ మెచ్చుకొన్నారు. తల్లి పోతూ, మేనమామకు—తననూ, ఆస్తినీ అప్పగించి నప్పటి నుంచీ, ఆ మేనమామే సగం ఆస్తిని అస్తవ్యస్తం చేసినప్పటిదాకా, రికామీగా తిరిగినవాడు— ఇన్నాళ్ళిటికి— అమాయికత్వం నుంచి. గుడ్డును చీల్చుకొని బయటబడ్డ కోడిపిల్లలాగా— బయటపడ్డందుకు, భద్రం యింకా అతని స్నేహితులు సంతోషించారు. కాని సీతారాముడు ఎవరితోనూ విశేషించి గుండె విప్పి మాట్లాడే రకంగాదు.

* * *

సీతారాముడు — ఉలిక్కిపడి మళ్ళీ విన్నాడు. ఈ మిట్టమధ్యాహ్నం వేళ తన కోసం వచ్చే వాళ్లెవరూ వుండరు, ఏన రైనా వుంటే బస్సు డ్రైవర్లే వుండాలి. మూడు ముక్కల ఆటకు వాళ్లకు అవ్వాలు కావాలి.

అప్పుడే దుకాణం మూసి, వడగాలిని ఈదుకుంటూ యిల్లుచేరి, నరాల భావి లోంచి నాలుగు కడవల చన్నీళ్ళు మీద కుమ్మరించుకొని వంట ప్రయత్నం మొదలు పెట్టాడు. పెరట్లో కోసుకొచ్చిన అరిటాకును, పడమటింటి పాటిమట్టి గోడవారగా వుంచబోతుండగా, బయట తలుపు మళ్ళీ చప్పుడై పిలుపు విన వచ్చింది. సీతారాముడు తడిగుడ్డలతోనే తలుపులు తెరిచి 'మవ్వా అత్తయ్యా...ఇంత ఎండ లోనా?' అని విస్తుబోతూ నిలబడి పోయాడు.

కామేశ్వరత్త ఆ మాటలు వినిపించు కొన్నదో లేదోగాని, లోపలికి వచ్చింది.

'చెయి కాల్చుకొంటున్నావా నాయనా. పచ్చళ్ల కోసం ఒక్కసారైనా మా యింటి వేపు వస్తావేమో అనుకొంటాను.'

ముక్కాలిపీట ఆమె దగ్గిరగా లాగి ముఖంలోకి చూశాడు. ఆమెకు తెలీదా— తనెందుకు వాళ్లింటివేపు పోనిది? తన రమ్యహర్మ్యాలను కూలదోసింది. జానకిని తన నుండి దూరం చేసింది. తన బంగారు కలలలో ముళ్ళు చిమ్మింది. రాహుకేతువుల వలె తన చంద్ర కిరణాలను మింగివేసింది. ఏమీ ఎరగనట్లు మాట్లాడుతున్నది. సీతా రాముడి ముఖం రంగు మారి పోగింది. ఇంకా తను అమాయికుడు కాదని ఎట్లా యామెకు చెప్పటం? సీతారాముడు తనను తాను నిలదొక్కుకొన్నాడు.

'అలవాటయిపోయింది అత్తయ్యా ... ఏదీ, క్షణం తీరటం లేదు...'

ఈ మాటల్ని గూడా ఆమె వినిపించు కొన్నదో లేదో.

'హైదరాబాదు పోతున్నావుట నిజమేనా సీతయ్యా?'

'నిజమేనత్తా. ఆర్. టి. సీ లో డిపాజిట్టు కట్టాలి. కొట్టు పెద్దది చేస్తేగాని వీల్లేదంటున్నాడు భద్రం. అట్నించి బొంబాయి పోయి కొత్త సామాను తెద్దా మనుకొంటున్నాను. చూస్తున్నావుగా — మన వూరు పెద్ద సెంటరవుతున్నది'

'ఏమీ లేదు — మరి నీకు తీరిక వుంటుందో, వుండదో అట్లా పోయినప్పుడు జానకిని చూసి వస్తావేమోనని.'

సీతారాముడు మళ్ళీ వులిక్కిపడ్డాడు.

'జానకా? హైద్రాబాదులో వుందా?'

'అల్లుడు వుద్యోగం మానుకొన్నాడుగా సీతయ్యా. హైద్రాబాదులో ఏదో వ్యాపా రంలోకి దిగాడుట. ఏది నాయనా దూరా భారం రాకపోకలూ లేవు.'

'అట్లాగేనత్తా.'

'అదేదో చిక్కడపల్లిట. అక్కడ వుంటు న్నారు. దాని కోసం ధర్మవరం చీరకొని అట్టే పెట్టేను. నేరుకనగ వస్తుంటే వాలిక కోసుకొంటుంది. నీకు తెలుసుగా. వచ్చి వస్తే బొక్కసేవాళ్ళు మీరిద్దరూ. కాస్త పోయిచూచి యిది అందించిరా బాబూ నీకు పుణ్యం వుంటుంది.'

నిప్పువలె రయ్యిన వీస్తున్న వడగాలికి సీతారాముడి తడి ధోవతి ఆరిపోతున్నది. ఆమె చేతిలో సంచీ అందుకొంటూండగా, గుండెలో పాతగాయం కలుక్కుమన్నది.

పెళ్లైన తర్వాత జానకి పుట్టింటికి రాలేదు. మొగుడ్ని వుద్యోగంలోంచి వూడ బెరికేశారని ఆ మధ్య వదంతి పాక్కింది. అయినా, ఈ వూరినీ అమ్మనూ, చెల్లినీ— తననూ—తన నీడగా చిన్నప్పటి మంచి తిరి గిన తననూ—చూడాలని ఎప్పుడూ అనిపించ లేదా? జానకిని తనకు కాకుండా చేయాలన్న మేనమామ యిష్టం — ఫలించిందా? తను చదువు కోలేదని, పల్లెటూరి సోమరి పోతని, తనకు వుద్యోగమున్నడే అల్లుడు కావాలనుకొన్న కామేశ్వరత్త యిష్టమే

'యిట్లా ఫలించిందా? లేక జానకి ఎప్పుడూ అనే తన అమాయికత్వమే — అన్నిటికీ మూలమా? రైలుబండిలో కునికి పాట్లు పడుతూ, సీతారాముడు—ఒక సారి తన కల లన్నూ, ఒకసారి లోపలి ఖద్దరు బనీను జేబులోని మూడువేల రూపాయల్నీ తలుచు కుంటూ గతాన్నంతా జ్ఞాపకం చేసుకొం టున్నాడు. ఎట్లా మరిచిపోవటం? జరిగి అయిదేళ్ళయినా — నిన్న లాగా వుంది. చెరిగి పోని నీడలాగా జానకి అతన్ని వెన్నాడు తూనే వున్నది.

* * *

సీతారాముడికి అర్థం కాలేదు. అల్లుడికి 'చిన్నకారు'న్నది. మాటలన్నీ 'టెలిఫోను లోనే' అని కామేశ్వరత్త చెప్పిందే ఈ యిరుకు సందులో మోటారుషెడ్డు మీది గదిలో కాపరం వుంటారా అనుకొంటూనే మెట్లెక్కి పైకి పోయి తలుపుతట్టాడు. ఎవరూ పలకక పోయినా తలుపు తెరుచు కొన్నది. టేబిలుకు ఎదురుగా ఒకచేయి విరిగిన కుర్చీలో కూర్చొని, గదంతా పరికించి చూస్తున్న సీతారాముడికి బయటి గాలి రివ్వున తగిలింది. సగం తెరిచివున్న డ్రాయరులో గాలికి రెపరెప లాడుతున్న కాగితాలు రెండు పైకి ఎగురుతున్నవి. అప్రయత్నంగానే ఆ కాగితాలు చదువుతూ కూర్చున్నాడు.

* *

సీతారాముడికి పరిస్థితులు అర్థమైనవి. అది జానకి చివరి వుత్తరం. ఒకనాడు—చీకూ చింతాలేని—మోహినీ అవతారంవలె జీవించి, తనవంటి పల్లెటూరి మిడిమిడి చదువుల వాణ్ణి చేసుకోనని నిరాకరించి, ఏదో కలలలోకంలోకి కనబడకుండా పోయిన జానకి దస్తూరిని అతడు యిట్టే పోల్చుకున్నాడు. జానకి వెళ్ళింది కలల లోకంలోకి కాదు. నరకలోకానికి. ఒంట రియై, అనాథగా జీవితాధ్యాయాన్ని ముగించబోతున్న ఆనాటి స్వప్నకన్య—దైన్యగాధంతా వుత్తరంలో వున్నది. "అమ్మా నన్నెందుకు కన్నావు? నన్నెం దుకు చదువుకోనిచ్చావు? ఏమోమో స్వప్నాల్లో తిరుగుతున్నదాన్ని నన్నెందుకు మందలించావు కాదు? ఒక్కదినం సుఖ మెరుగను—అత్తవారింటికివచ్చి ఒక్కరోజు కంటినిండా నిద్ర ఎరుగను. నీవిచ్చిన

## జయమ్మా...

సొమ్మూ, వున్నదీ అంతా వూడ్చుకు పోయింది. దెబ్బలతో నా వళ్ళు గడుసు బారింది. ఒకముద్దూ, ముచ్చటా — ఎరగని యీ జీవితం ఎంతభారమైపోయిం దమ్మా. మనయిల్లు అమ్మించి డబ్బు తెమ్మంటున్నారు. లేకపోతే నాకు చావు తప్పదు. ఆయన కోరికకూడా అదే. ఇల్లమ్మించి—నిన్నూ చెల్లినీ — నా వలె అనాథల్ని చేయనా? ఇది నా ఆఖరి వుత్తరం. నే నిదివరకు వ్రాసిందంతా వచ్చి అబద్ధం. నేను పుట్టనే లేదని అనుకో అమ్మా. చెల్లి ఒక్కతే నీ బిడ్డ అనుకో. నన్ను క్షమించు. నాకోసం ఏడవకమ్మా'

* * *

సీతారాముడు లేచి ఇల్లు చూశాడు. అయిపోయిందా? తను ఆలస్యం చేశాడా? లోపల తనను అగ్నితో ఎవరో కాలు స్తున్నట్లున్నది.

ఇంతలోనే మెట్లమీద గాజులచప్పు డైనది ఉత్తరంలోని జానకి, రెండు కిరసనాయిలు సీసాలతో ఎదురుగా ప్రత్యక్ష మైనది.

'ఇల్లు రిపేర్లు చేస్తుంటే యిక్కడికి మారాం. కాఫీపెట్టనా? ఎంత మారి




పోయావు సీతారాం. ఏమిటట్లా నిలబడే వున్నావు? ఏమిటా చూపు—బావా? నేనే... జానకిని. ఇల్లెట్లా కనుక్కొన్నావు? అంతా బాగున్నారా? ఇప్పుడేం చేస్తున్నావు సీతారాం బావా?'

ఆమె నవ్వుతున్నది. బొప్పికొడుతున్న మెడతోనే, బొప్పికొడుతున్న చెవులతోనే, గుండెలో అగ్నితో ఇంకొక్క క్షణంలో చావనున్న జానకి నవ్వుతున్నది. ఆడది! ఇదా అర్థం? ఆమెను చూసి సీతారాముడూ నవ్వాడు. జానకి కాఫీపెడ్తానని మళ్ళీ కిందకు పోయింది. సీతారాముడు — వుత్త రాన్ని మడిచి జేబులో పెట్టుకొన్నాడు. మళ్ళీ తీసి డ్రాయర్లోనే వుంచాడు

తన జేబులోని మూడువేల రూపా యలు. కామేశ్వరత్త యిచ్చిన ధర్మవరం పట్టుచీర, వేరుశనగపప్పు టేబిలుమీద వుంచాడు.

సీతారాముడు — ఆమె రాగానే అన్నాడు:

'నాకు చాలాపనుంది—జానకీ. ఇవిగో—మీ అమ్మ నీకు అందించమని చెప్పింది. మీ ఆయన ఎప్పుడొస్తాడో.'

'ఆయనా...ఆయనా?...క్లబ్బుకు వెళ్ళి ఆలస్యంగా వస్తుంటారు. నాకోసం... నాకోసం...ప్రత్యేకంగా వచ్చావా యింత దూరం బావా? భోజనం చేయకుండా ఎట్లా వెళ్తావు?'

'వీల్లేదు. నాకోసం మనుషులు కాచు కొని వున్నారు. మళ్ళీవస్తాను.'

'కాఫీ...'

సీతారాముడు కాఫీ తాగుతుండగా — ఆమె అన్నది.' నీకు జ్ఞాపకం వుందీ. ఒకసారి నన్ను పేరు మార్చుకోమని చెప్పావు. జానకి — రాముడి భార్యగా సుఖ పడలేదు — నాకు భయంగా వుంది — అన్నావు జ్ఞాపకముందీ?'

'ఏదో ఎగతాళికి అనివుంటాను. ఇప్పుడు నీకేం తక్కువైందని — జానకీ. డబ్బు లెక్కపెట్టుకో మళ్ళీ వస్తాను.'

'ఎప్పుడూ?'

అప్పటికే సీతారాముడు మెట్లు దిగి పోయాడు.

* * *

## జయమహా...

పెళ్లయిన అయిదేళ్లకు పుట్టింటికి తిరిగి వచ్చింది — జానకి. వస్తూనే — 'అమ్మా — ఎందుకు పంపించావు అంత డబ్బు? ఇల్లు తాకట్టు పెట్టేనా? చెల్లి పెళ్లి సంగతేమన్నా ఆలోచించావా?? నేను యిదివరకే—వద్దని మొత్తుకోలేదా?' అని ప్రశ్నవిరాద కురిపించింది.

కామేశ్వరమ్మ విస్తుపోతూ ఎదురు ప్రశ్న వేసింది.

'ఏమి డబ్బా—ఎవరు పంపించారంటావే - జానకీ?'

'అదే—నువ్వు సీతారాం బావచేత పంపిన మూడువేలూ'

'నేనా ? సీతారాముడు వెర్రి బాగుల వాడని తెలీదుటే నీకు? భాగస్తుడి డబ్బు కాజేశాడని మూడేళ్లు జైలువేశారు— విన్లేదుటే?'

జానకి కొయ్యబారిపోయింది. క్షణంలో తేరుకొని ఏడుస్తూ చెప్పింది.

'అమ్మా. సీతారాముడు డబ్బు కాజెయ్య లేదమ్మా. నాకిచ్చాడు. నాకు ప్రాణదానం చేశాడు. వెర్రిబాగులదాన్ని నేనమ్మా.'

* * *

మర్నాడే జానకి హైదరాబాదు వెళ్లిపోయింది. మళ్లీ మూడువెలలకు విధవగా తిరిగివచ్చింది. జానకి వైధవ్యంతో ఏడ్చిందో లేదో ఎవరికీ తెలియదు. వచ్చిన రోజునే—ఆమె—సీతారాం బావ భాగస్తుడు—భద్రానికి కబురు చేసింది.

తర్వాత జైలు వెతుక్కుంటూ రాజమండ్రి పోయింది.

భద్రంగూడా ప్లీడర్లదగ్గరికి వెళ్లి వచ్చి—

'ఇప్పుడేమీ లాభం లేదంటున్నారు' అని చెప్పాడు.

రెండవసారి వెళ్లినప్పుడుగాని—సీతారాముణ్ణి చూడలేకపోయింది.

జైల్లో అతనిమాటలు విని—యింటికి వచ్చి — భద్రానికీ, అమ్మకీ జానకి చెప్పింది.

'నామీద పగతీర్చుకోటానికే—యిదంతా చేశాడు, మహాత్ములకుగూడ యిట్లాంటి పగ వుంటుందా?' ●

శ్రీమతి వారణాశి జానకిదేవి

# వంటయిల్లు - దుర్ఘటనలు

'కమల చాల తెలివైనది. నిన్న రాత్రి చాల పొద్దుపోయేవరకూ మేము కబుర్లు చెప్పుకుంటూనే వున్నాము. హాస్పిటల్‌లో ఏమవుతుందో తెలీదు. ఉదయం కాఫీ తయారు చేస్తున్నప్పుడు చీర కొంగు స్టవ్‌కు తగిలి, క్షణంలో శరీరమంతా కాలి పోయింది — వీలయితే ఒకసారి ఆస్పత్రికి వెడదాం వస్తావా?' అని 'రమ' పంపిన కబురు నాకు చాల ఆశ్చర్యాన్ని, బాధను కల్గించింది. ఆస్పత్రికి వెళ్లేటప్పటికి అన్నీ జరిగిపోయాయి. చాల బాధపడ్డాను.

ఇటువంటి దుర్ఘటనలు మనం తరచూ వింటూనే వుంటాము. ఇట్లా ఒళ్లు అంటుకుని మరణించడం అనే దుర్ఘటనలు చాలా అధికంగా వుంటున్నాయి. ఈ దుస్సంఘటనలు ఈనాడు సర్వసామాన్య విషయాలు అయిపోయాయి. ఇన్ని జరుగుతున్నా మనం వంటయింట్లో ఏరకం ఏర్పాట్లు చేసికోవాలి. మనం సావధానంగా నేర్చుకోవలసిన విషయాలు ఏమిటి? — ఇటువంటి విషయాలు మనం నేర్చుకోవడం లేదు సరి కదా! కనీసం ఆలోచించడం కూడా లేదు. కాని చాలాసార్లు మన అజాగ్రత్త వలన కొద్ది తప్పుకు, కొద్ది పొరపాటుకు ఘోరమైన, భయంకరమైన శిక్ష అనుభవించ వలసినట్టి పరిస్థితి ఏర్పడుతోంది.

అయితే ఈ బట్టలకు నిప్పంటుకోవడాన్కి కారణం ఏమిటి? ముఖ్యంగా మూడు కారణాలు వున్నాయి

(1) పొయ్యి, కుంపటి లేక స్టవ్ మనం నేలమీద వుంచుతాము. చాలాసార్లు మన పరిస్థితి ఎట్లా వుంటుందంటే దీనికి ఒకప్రక్క మనం, రెండవ ప్రక్క కాని, సమీపంలో కాని పోపు సామాన్లు, యితర వంటసామాన్లు వుంచిన అలమార వుంటుంది. వానిని అందుకోవడాన్కి మనం నిల్చోవడంతో, స్వాభావికంగానే పొయ్యి, కుంపటి లేక స్టవ్‌ల అంచుకు మన బట్టతగలడం, కాలటం జరుగుతుంది. అందులో ఈనాడు ఫాషన్ ధర్మమా అని బట్ట పైకి దోపుకోవడం, పమిట అడ్డం దోపడం నామోషీ కావడంతో ఇటువంటి దుర్ఘటనలు మరింత ఎక్కువవుతున్నాయి.

(2) అపుడపుడు 'స్టవ్'కు పిన్ చేసేటప్పుడు అధికంగా నూనె బైటకు వస్తుంది. గప్పుమని ఒక్కసారి పైకి లేస్తుంది. స్టవ్ పంపు కొట్టేటప్పుడు లేదా పిన్ చేసేటప్పుడు మొహం ముందుకు వంచినట్లయితే తరుచూ జుట్టు మాడిపోతుంది. లేదా మొహం కాలిపోతుంది. అందుచేత ఈ స్టవ్‌ల విషయంలో ఎంతో జాగ్రత్త, మెలకువ వుండాలి.

(3) పొయ్యిమీదనుండి ఏదైనా పాత్ర క్రిందికి దించేటప్పుడు కాగితంకాని, గుడ్డ కాని, పెంకులు కాని త్వరగా అందుబాటులో లేకపోతే, చాలమంది స్త్రీలు చేతో గాని, లేదా చీర కొంగుతో గాని దాన్ని పట్టుకొని క్రిందికి దింపుతారు. యిది చాల ప్రమాదకరమైన పని. ఎపుడు బట్టకు నిప్పంటుకుంటుందో తెలీదు.

అందుచేత దీనికోసం కొన్ని విషయాలు ధ్యానంలో వుంచుకోవలసిన అవసరం ఎంతేనా వుంది.

(1) మొట్టమొదటిది ఏమిటంటే పొయ్యికి పైన లేదా మధ్యలో కాని యిటువంటి వస్తువులు ఏవీ వుండకూడదు. మనకి తరుచూ అవసరమయే వస్తువులన్నీ మనం కూర్చున్నవైపే వుండడం వలన, వానిని అందుకోవడాన్కి వీలుంటుంది. అంతేకాని వేరేచోట వుండడంతో వానిని అందుకోవడనికి నిలబడడంతో, అదీ పాదాలు ఎత్తి, నిప్పు అంటుకోవడాన్కి చాలా సావకాశం వుంటుంది. నిప్పు అంటించేటపుడు, స్టవ్ లేక కుంపటి వుంచేటపుడు ఈ విషయం గుర్తుంచుకోవాలి. పొయ్యి, స్టవ్, కుంపటి వంటివి ఎటువంటి ప్రదేశాలలో వుండాలంటే వానికి ముందు,



[illegible] చేయాలి.

(2) 'స్టవ్' కు అదేపనిగా, ఒక్క ఉదుటున 'పంపు' కొట్టకూడదు ఎప్పుడూ. రెండు మూడుసార్లు పంపుకొట్టిన తర్వాత కూడా పని చేయకపోతే దాని మూతతీసి ఒక్కసారి గాలి బయటకు వదలివేయాలి. అపుడు తిరిగి పంపు కొట్టాలి లేదా 'పిన్' వేయాలి.

(3) నిప్పుమీద వున్న ఏ వస్తువునయినా దింపడానికి 'పిరకొంగు' ఉపయోగించి జీవితములో ప్రమాదం ఎపుడూ తెచ్చుకోరాదు. పెంకులు, కాగితం, లేక గుడ్డ ఎపుడూ సమీపంలో వుండాలి.

## వంటయింట్లో...

రెండవ ముఖ్య విషయమేమంటే గాలిలో ఎగిరే ఉలిపిరి కొత్తంవంటి టెర్లిన్, డేకరాన్, నైలెక్సు బట్టలు వంటింట్లో పనిచేసేటపుడు ధరించకూడదు. ఒకవేళ ధరించవలసిన అవుసరంవస్తే చీరనంతను గుండెలనుండి క్రిందిదాక కప్పేటటువంటి వస్త్రం ఒకటి—ఆప్రాన్—ధరించాలి. దీని వలన నిప్పు అంటుకునే ప్రమాదం చాల తక్కువగా వుంటుంది. టెర్లిన్‌వంటి వస్త్రాలు అంటుకున్న మరుక్షణంలో మనం కళ్లుమూసి తెరచేలోగా తాను బూడిదయి శరీరాన్ని భస్మం చేస్తుంది. ఈ ఆప్రాన్ [illegible] చాలవరకూ ప్రమాదరహితంగాకా బట్టలు మురికి కాకుండా, పరిశుభ్రంగా వుంచుతుంది.

ఇంత జాగ్రత్తగా వున్నా ఒకవేళ నిప్పు అంటుకుంటే దానిమీద 'నీరు' ఎన్నడూ పోయరాదు. నీళ్ళు పోయడంతో 'నిప్పయొక్క గాయం' బొబ్బలెక్కి, చాల భయంకరంగా తయారవుతుంది. పరిస్థితి కూడా మందమైపోతుంది. బట్టలు విప్పడం, అట్లాగే నిలబడడం వలనకాని, లేదా పరిగెత్తడం వలనకాని నిప్పు అధికవేగంతో వ్యాపిస్తుంది. అందుచేత వెంటనే రొజాయి లేక కంబళీతో శరీరముచుట్టి నేలమీద పడవేయాలి. ఇటూ, అటూ దొర్లించాలి.

నిప్పు ఆరిన తర్వాత వెంటనే ప్రథమ చికిత్స చేయాలి. వేడిపాలు, టీ, కాఫీ లేకా యిట్లాంటివే మరేవైనా ఉత్తేజం కల్గించే పానీయాలు తాగించడం వలన హృదయావేగము తగ్గుతుంది. ప్రాథమిక సహాయం తర్వాత వెంటనే డాక్టరుని కలవాలి లేకపోతె పరిణామం భయంకరము కావచ్చు గర్భిణీస్త్రీల విషయంలో ముందుగా డాక్టరుకి చూపడం చాల అవుసరం తల్లి, లోపలి శిశువు యిద్దరిని గూర్చి శ్రద్ధతీసికోవాలి కాబట్టి డాక్టరు సలహా, ముఖ్యంగా లేడీ డాక్టరు సలహా చాల అవుసరము.

ఇన్ని విషయాలు దృష్టిలో వుంచుకోవడంవలన వంటయింటలో జరిగే అనేక దుర్ఘటనల సంఖ్య తప్పకుండా తగ్గుతుంది. ●

---

డాక్టర్ కబుర్లు

## బాగా ఊపిరి తీస్తే ఆరోగ్యం

మీరు హాస్పిటల్‌లో ఉన్నపుడు డాక్టర్ మీకు కావలసినన్ని బాధ నివారణ అవుషధాలు ఇవ్వడు, ఎందుకు? అప్పుడప్పుడు యివ్వవచ్చు. కనీ మీకు కావాలన్నప్పుడల్లా యివ్వరు. ఎందుకంటే, ఆ



5.

మందుల ప్రభావానికి లోనై యెక్కువసేపు గాఢ నిద్రలో ఉంటారు. ఆ సమయంలో ఊపిరిని నిదానంగా తీస్తారు. ఇది అంత మంచిది కాదు. ఊపిరితిత్తులు ఎంత ఎక్కువ వ్యాకోచిస్తే అంత త్వరగా అస్వస్థత నించి విముక్తులవుతారు.

ఊపిరితిత్తులు పూర్తి వ్యాకోచాన్ని పొందకపోవడంవల్ల వాటిలోని అనేక చిన్న గాలిగోళాలు పనిచేయకుండా పోతాయి. ఇది చాలా అస్వస్థతలకి, న్యుమోనియాకి కూడా దారితీయవచ్చు. అందుకే ఆపరేషన్ అయిన తర్వాత డాక్టర్ దగ్గమనడం, పూర్తిగా ఊపిరి తీయమనడం జరుగుతుంది.

కావాలని దగ్గడంవల్ల ఊపిరితిత్తులకి వెళ్లే శ్వాసనాళాలలో పేరుకుని ఉన్న ఏ రకమైన అవరోధాలయినా తొలగుతాయి. దగ్గడంవల్ల ఊపిరితిత్తులుకూడా బాగా వ్యాకోచాన్ని పొందుతాయి. అందువల్ల మీ రక్తానికి అవసరమైన ఆక్సిజన్ (ప్రాణవాయువు) పూర్తిగా లభిస్తుంది కనుక అది మంచిదే.

హెచ్. ఎల్. హెర్షన్ సోన్
(కాపీ రయిటు)

---

వంటలు:

## పొటేటో బోండా

పిండికి : రెండు కప్పుల సెనగపిండి చిటికెడు పసుపు, 1 స్పూను జీలకర్ర పొడుం, తగినంత ఉప్పు.

కూరకి : ½ కిలో బంగాళాదుంపలు కొబ్బరి తురుము నాలుగు చెంచాలు, ఒక నిమ్మకాయ రసం, తగినంత ఉప్పు.

బంగాళా దుంపలు కొంచెం ఉప్పువేసి ఉడికించి తొక్కుతీసి పిండిగా కలిపి ఉంచాలి. దాన్లో కొబ్బరి తురుము కొత్తిమిర, పచ్చి మిరపకాయ ముక్కలు నిమ్మకాయ రసం వేసి కలియబెట్టాలి ఇది చిన్నచిన్న ఉండలు చేసిఉంచుకోవాలి. సెనగపిండిలో పసుపు తగినంత ఉప్పు జీలకర్రపొడి వేసి తగినంత నీళ్ళు కొంచెం గరిటె జారుగా కలియ పెట్టుకోవాలి. పై కూర ఉండలు యీ పిండిలో ముంచి డాల్డాలోగాని రేడియో మానెలోగాని దోరగా వేయించి తీసుకోవాలి. వాటికి నల్చుకోడానికి వేరే ఏం అవసరం ఉండదు.

— మంత్రవాది వాసంతి

## పొటేటో రైతా

4. బంగాళా దుంపలు.
1. అళాకు పెరుగు.
2. పచ్చిమిరప కాయలు.
1. చంచా కారపుపొడి.

½ చెంచా గరమ్ మసాలాపొడి, ఉప్పు

బంగాళాదుంపలు ఉడికించి తొక్కుతీసి చిదిపి ఉంచుకోవాలి. పెరుగు నురుగవచ్చేలా చిలికి, పచ్చిమిరపకాయి ముక్కలు, తగినంత ఉప్పు చిదిపిన బంగాళా దుంపలు, అన్నీ వేసి కారంపొడి, గరమ్ మసాలా పొడి వేసికోవాలి. పోపు కావలిస్తే వేసుకోవచ్చు. లేకున్నా బాగానే వుంటుంది.

## సెనగ పప్పు

1 కప్పు సెనగపప్పు రాత్రి నానవేసికోవాలి. పొద్దునే నీరువార్చి పప్పు బద్దనలిగేలా రుబ్బి తీసి ఉంచుకోవాలి. వెడల్పాటి గిన్నెలో కొంచెం నూనెవేసి కాగాక, ఆవాలు, జీలకర్ర కరివేపాకు చిన్న ఇంగువ ముక్క పోపువేసి కలియపెట్టాలి. ఆవాలు పేలాక దానిలో ఈరుబ్బిన పప్పువేసి కలియపెట్టాలి. మూతపెట్టి ఓ పది పదిహేను నిముషాలు ఉడకనియ్యాలి. దింపేముందు కొంచెం కొబ్బరికోరు, కొత్తిమీరివేసి కలిపి దింపుకోవాలి. పప్పు రుబ్బుకువేటప్పుడే తగినంత ఉప్పు వేసుకోవాలి. ●




# హృదయం చిగిర్చింది

కె. రామలక్ష్మి

### జరిగిన కథ

రమ బావగారు ఆమెని కాలేజీ లేడీస్ హాస్టలులో చేర్చి వెళ్ళిపోతాడు. వార్డెను సరళని పిలిచి రమని పరిచయం చేస్తుంది. సరళ చలాకీపిల్ల. రమతో బాగా స్నేహం ఏర్పరచుకుంటుంది. కొత్తగా వచ్చిన లెక్చరరు రామారావు రమపై మోజు చూపిస్తూ వుంటాడు. రమా, సరళా ఇద్దరూ ఆ విషయాన్ని గ్రహిస్తారు. రమతో రామారావును కలిపి కాలేజీ పిల్లలు అల్లరి చేయడం మొదలెడతారు.

## 2

ఆ రోజు క్లాసులకి రానేలేదు రమ. సరళ ఒక్కర్తే అన్నీ రాసుకుని సాయంత్రం ఆదరాబాదరాగా హాస్టలుకేసి నడుస్తూంటే మాష్టారు పిలవడం వినిపించింది.

'ఏం మేష్టారూ, పిలిచారా?' ఆగి అడిగింది.

'రమ ఏది? సాయంత్రం కాంటీనుకి వస్తానందే?'

ఎంతో ఆత్రంగా అడిగాడు రామారావు.

'హాస్టలుకి వెళ్ళిపోయింది మేష్టారూ,'

'సరళా, నాకు రమతో మాట్లాడవలసిన పని ఉంది.'

'ఏమిటో అడగవచ్చా మేష్టారూ,' అంది కుతూహలంగా సరళ.

'అదే ..అదే' అంటూ క్రాఫింగు సవరించాడు రామారావు.

'రండి స్టాఫ్ రూములో కూర్చుని మాట్లాడుదాం. ఇలా ఇక్కడ బాగుండదు' అంది నెమ్మదిగా.

రామారావుకి కూడా కావలసినది అదే. స్టాఫ్ రూముకేసి దారి తీశాడు.

కుర్చీలో కూర్చుంటూ 'చెప్పండి మాష్టారూ' అంది.

'రమ నీకు బాగా తెలుసా?'

'ఓ ఇద్దరంకలిసి చాలాకాలంగా చదువుకుంటున్నాం. మా పల్లెటూరుకూడా వాళ్ళ ఊరికి దగ్గరే' అంది సరళ.

'రమ తల్లీ తండ్రీ అంతా అక్కడే ఉంటారా?'

'అవును. రమకి తండ్రి లేడు. అన్నదమ్ములు లేరు. మేనత్త కొడుకొకతను న్నాడు మగదిక్కు' అంది సరళ.

ఆ సస్పెన్సు భరించలేకపోయాడు రామారావు. .

'అంటే, రమకి అయిన సంబంధమా?' అడిగాడు కుతూహలం చంపుకోలేక.

'ఆఁ అయిన సంబంధమే. రమ బావ సుందరం రమ పిన్నికూతురిని పెళ్ళాడాడు' అంది నెమ్మదిగా సరళ.

తనకు తెలియకుండానే 'అమ్మయ్య' అనుకున్నాడు రామారావు.

'నాకు రమ అమ్మగారిని కలుసుకోవాలని ఉంది. రమతో ఏకాంతంగా మాట్లాడాలికూడా' ఆగాడు.

'హాస్టలుకి రండి విజిటింగు టైముంటుందిగా? ఇలా కాలేజిగేటులో నిలబెట్టి మాట్లాడితే అసలే విద్యార్థులు కోతిమూక కదూ? రమని బ్రతికుండనిస్తారా మేష్టారూ?'

'అది కాదు సరళా, నే నెంతో ప్రయత్నించాను. కాని నా శక్యం కాదు. రమని నేను ప్రేమించాను సరళా, అది నువ్వు గ్రహించే ఉంటావు. దారి కాసి మాట్లాడక నీ స్నేహితురాలితో ఇంకెలా మాట్లాడను? తలెత్తి చూడదు, రెండు ముక్కలు సరసగా మాట్లాడదు. ఒకప్పుడు బదులే చెప్పదు. నన్నేం చేయమంటావు చెప్పు? ఈరోజు ఎలాగేనా నా హృదయంలోని మాట బయటపెట్టాలని పిలిచాను. మాశాపా ఎలాతప్పించుకువెళ్ళిపోయిందో!' బాధగా అన్నాడు రామారావు.

'ఈయనో మజ్నూ కాబోలు!' మనసులోనే అనుకుని నవ్వుకుంది సరళ.

'రమది చాలా సున్నితమైన మనస్తత్వం మాష్టారూ! యిట్టే నొచ్చుకుంటుంది. మీరూ క్లాసు వదలగానే ఆ గోల విన్నారుగా? మనసు పాడుచేసుకుని వెళ్ళిపోయింది' బాధగా అంది సరళ.

'నాదీ తప్పే సరళా, కాని ఏదో ఒకటి తేల్చుకోనిదే ఇక ఇలా సాగించలేను నేను. నాతో మాట్లాడమని చెప్పలేవా?' ప్రాధేయపడుతున్నట్టు అడిగాడు రామారావు.

ఆ క్షణంలో రామారావుమీద ఎంతో జాలి పుట్టుకొచ్చింది సరళకి. రమకి ఎలాగైనా చెప్పాలనుకుంది.

'నువ్వే రమని ఒప్పించకలవు. నన్ను పెళ్ళి చేసుకోమని అడుగు. నా తరపు దూతికవి నువ్వే' నవ్వుతూ అన్నాడు రామారావు.

సరళకేం చెప్పాలో తెలియలేదు.

'నువ్వు కూడా రమని గురించి నాకేం వివరాలు చెప్పవేం?' అడిగాడు.

'రమకి ఇష్టమో కాదో తెలుసుకోకుండా ఆమె గురించి మీకు చెప్పడం ఏం భవ్యం మేష్టారూ?' అడిగింది.

'నిజమే. కాని ఈ దాగుడుమూతలకి నువ్వే స్వస్తి చెప్పించాలి.'

'నే నీ రోజు రమతో మాట్లాడుతాను మేష్టారూ, కాని ఈలోగా మీరు కొంత ప్రశాంతంగా ఉండాలి. రమ మనస్సు నొచ్చుకుంటే మనం ఏం తలపెట్టి ప్రయోజనం ఉండదు' అంది.

'అలాగే రమ నన్ను ఉపేక్ష్మ గుర్తించక పోవడంతో నాలో తహతహ మరీ ఎక్కువ అవుతోంది. నే నామెనిచూడకుండా ఉండలేను. చూసి మాట్లాడకుండా ఉండలేను. దానికి నువ్వే పరిష్కారం ఆలోచించాలి. నువ్వు నా స్టూడెంటువే కావచ్చు కాని ఓ చెల్లిని అర్థించినట్లు అర్థిస్తున్నాను సరళా.' అతని కంఠం వణికింది. ఏదో తెలియని అనుభూతితో అతని మనస్సు పరవళ్ళు తొక్కుతున్నట్టు ఉంది. సరళ లేచినిలబడింది.

'నే వెడతాను మేష్టారూ, రేపే సంగతి మీకు చెప్తానుగా? కాని మీరుమటుకు అందరి దృష్టీ మీమీద పడేలా ప్రవ

ర్తించకండి,' అంది.

'రమని ఏమీ అనుకోవద్దని చెప్పు. హృదయం విప్పి చెప్పనిచ్చే అవకాశంయిస్తే ఈ గొడవే ఉండదు.'

సరళ ఆలోచనలో మునిగి తేలుతూ హాస్టలు గుమ్మంలో అడుగు పెట్టింది. అంతా టిఫిను కూడా ముగించేసినట్టుంది గార్డెన్‌లో గుంపులుగుంపులుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. విజిటర్సు హాలునిండా అమ్మాయిలే. కొందరు నవ్వుతూ గట్టిగా మాట్లాడుతున్నారు వచ్చినవారితో. కొందరు మాట్లాడుతున్నారా? లేదా అన్నంత నెమ్మదిగా కబుర్లు సాగిస్తున్నారు కజిన్స్‌తో.

ఎక్కడా రమ జాడలేదు.

తిన్నగా డైనింగుహాలవైపు నడిచింది సరళ. వాళ్ళు పెట్టేదేదోతిని రూముకి నడిచింది.

సరళా వాళ్ళ రూము రెండో అంతస్తులో ఉంది. రూము కిటికీలోంచి చూస్తే నీలంగా పరుచుకుని సముద్రం కనిపిస్తుంది. ముందున్న గుల్‌మొహర్ చెట్ల గుబురు ఆకులలోంచి ఇసకా, దూరంలో అక్కడక్కడ నీరూ కనిపిస్తూ అందంగా ఉంటుంది. ఏమీ తోచనప్పుడు అలా కిటికీలో కూర్చుంటే చాలు కాలం గడిచిపోతుంది. ఇదివరలో ఆ కిటికీలో కూర్చునే కబుర్లు చెప్పుకునేవారు సరళా రమాను. కాని కాలేజీ తెరిచి రెండు నెలలు తిరక్కముందే రమ మూగవోయినట్టు అయిపోయింది. కబుర్లు చెప్పడం తగ్గించింది. శూన్యంలోకి చూడడం ఎక్కువ అయింది. రమ సంగతి తెలిసిన సరళ ప్రేమలో పడ్డావా? అని అడగలేదు. కాని రమలో ఒక విధమైన ఆందోళన బయలుదేరిందని మటుకు బాగా గ్రహించింది.

దానికి కారణం కొత్తగా ఈ సంవత్సరమే వచ్చిన లిటరేచరు లెక్చరరుగారని గ్రహించింది సరళ. కాని సమయంకోసం వేచి ఉంది.

* * *

రూముతలుపులు దగ్గరగా వేసిఉన్నాయి! తలుపు తోసుకుని లోపలికి వచ్చినా రమ తల తిప్పి చూడలేదు. కిటికీలో కూర్చుని దూరంనుంచి విశాలంగా కన్పిస్తున్న సంద్రాన్ని చూస్తోంది 'రమా' పిలిచింది ఉలిక్కిపడి కిటికీలోంచి గబుక్కున క్రిందికి దిగింది రమ.

'అదేమిటోయ్ అంత ఉలిక్కిపడ్డావు?' వేళాకోళంగా అడిగిన సరళ పెదవిమీద ఇంక మాట పలకలేదు. రమ ముఖం బాగా ఏడ్చినట్టు ఉబ్బిపోయింది. కళ్ళు రెండూ జ్యోతుల్లాగా ఉన్నాయి.

'రమా ఏమైందోయ్' అంటూ దగ్గరకి



వరుగెత్తింది సరళ. సరళ చేతుల్లో యిమిడిపోతూ పసిపిల్లలాగా ఏడ్చింది రమ. వెన్ను రాస్తూ మాట్లాడకుండా ఉండిపోయింది సరళ.

ఓ పదినిముషాలు పోయాక సద్దుకుంది రమ. ముఖం కడుక్కువచ్చి స్నేహితురాలి పక్క వచ్చి కూర్చుంది.

'రమా, ఎందుకంతగా ఏడ్చావు పిచ్చీ, ఇప్పుడేమైపోయిందనీ? నువ్వు అందంగా ఉంటావు. అనురాగం పంచి యివ్వకల దానివిగా కన్పిస్తావు నిన్ను పెళ్ళిచేసుకోవాలని మేష్టారు అనుకోడంలో తప్పేముంది?' నెమ్మదిగా అంది సరళ.

'పెళ్ళా! నాకా! నన్నా?' తను విన్నమాట నమ్మలేనట్టు అడిగింది రమ.

'ఏం చేసుకో కూడదా? మేష్టారికేం లోటనీ? అందంగా ఉంటారు. విజ్ఞానవంతులు, సహృదయులు, పైగా నిన్ను మనసారా ప్రేమించారు. ఇంతకు మించి నీకేం కావాలి రమా?' స్నేహితురాలి భుజంపై చేయివేస్తూ అడిగింది సరళ.

రమ కంఠం తిరిగీ దుఃఖంతో పూడుకు పోయింది.

'సరూ, నా సంగతంతా తెలిసీ నువ్వా నన్ను వేళాకోళం చేస్తున్నావు?' అంది సరళ వడిలో వాలిపోతూ.

'పిచ్చిరమా. రోజులతోపాటు మనం మారాలి. మనస్సులో ఎప్పుడు దుఃఖం గూడు కట్టుకుని, వడిని విప్పకట్టుకు బ్రతకాలని ఉందా ఏం?'

'అలా జరగదు సరళా, జరగదు. నేనెంత నష్ట జాతకురాలినో నీకు తెలుసుకదా? నన్నెందుకిలా చేశాడు భగవంతుడు' పిచ్చిదానిలాగా వెక్కి వెక్కి ఏడ్వ సాగింది రమ.

'ఏడవకు రమా, రోజులెప్పుడూ ఒకలాగే సాగిపోతాయా? జీవితాలు ఎంత విస్ఫారంగా ఉన్నా ఒకొక్కప్పుడు వాటికి విమోచనం కలగవచ్చు. మోడు వారిన చెట్లు తిరిగి చిగర్చడం లేదా? హృదయం మటుకు ఎందుకు చిగర్చ కూడదు? పిచ్చిగాని.

'నీకు తెలియదు సరళా! ఇదంతా జరగనిది. మేష్టారు నా సంగతి తెలిస్తే మనసు మార్చుకుంటారు. అప్పుడా గుండెకోత వేసనలు భరించలేను సరళా, భరించలేను. చచ్చి పోయిందనుకున్న నా హృదయం ఎందు కింకా బ్రతికి ఉంది?'

'మానవ జీవితాలలో మార్పు సహజం అని నీలాంటి మొద్దులకి తెలియ చెప్పడానికి. ఎందుకింత జేలగా అయిపోతావో నా కర్థం కాకుండా ఉంది.'

'ఎందు కర్థంకాదు? నీ కెందు కర్థం అవడంలేదు నా బాధ?' ఎంతో బాధగా అడిగింది సరళని.

'రమా, పిచ్చిరమా మాష్టారు నువ్వు లేకుంటే బ్రతక లేనన్నారు నువ్వు ఆయనతో మాట్లాడి తీరాలి ఎందుకా మనిషినలా క్షోభపెడతావు రమా? ఇద్దరిదీ ఒకేదారి అయినప్పుడు ఎవరి కోసం ఈ విముఖత? నువ్వు మాష్టారితో మాట్లాడుతానని మాట యిచ్చి తీరాలి.'

అంటూ వట్టువేయి అన్నట్లు చేయి చాపింది సరళ. ఆ చేతిలో చేయివేసి నిట్టూర్చింది రమ.

రమ చేతిని ప్రేమగా నొక్కుతూ. 'అది అలా ఉండాలిగాని' అంది సరళ.

ఆప్యాయంగా తన ముంగురులు సవరిస్తున్న సరళకేసి చూస్తూ తనలోతానుగా అంది రమ—'సరూ నిన్ను చూస్తూంటే ఓ పక్క ధైర్యంగా ఉంటుంది. మరో పక్క భయం భయంగా ఉంటూంది. నీ వేగంతో నన్నూ కొండ శిఖరానికి ఎక్కించి కిందికి తోసెయ్యవు కదా అనిపిస్తుంది'

'పైకి ఎక్కడానికి ఊత కావలసిన నీలాంటి దాన్ని చేతనైనంత దాకా పైకి తోయాలిగ!' అంది సరళ.

'నే పుట్టిన కుటుంబం, నే పెరిగిన వాతావరణం నా గత జీవిత ఘట్టాలు తలుచుకుంటూంటే—యిప్పటి ఈపరిస్థితి, యీ ఊహలు భ్రమ ఏమో అనిపిస్తుంది' అంది రమ.

'మీ అమ్మగారిని నేను చూశానుగా! ఆవిడ నీ అంత మూర్ఖంగానే ఉండరని అనిపిస్తుంది నాకు.' భరోసా యిచ్చింది సరళ.

'అమ్మ చూడ్డాని కలా ఉందిగాని ఆమె విజృంభించడానికి సిద్ధంగా ఉన్న అగ్ని పర్వతం లాంటిది. నాన్నగారితో అమ్మపడ్డ ఘర్షణలు తలుపునకు వస్తే ఏ ఆడపిల్లా పెళ్ళి సంగతి తలపెట్టదు.' విషాదంగా నవ్వుతూ అంది రమ.

'నిజంగానా? రా, అలా బీచిలో కూర్చుని చెప్పకుందాం. నీకూ భారం తగ్గుతుంది. నాకూ కనువిప్పు కల్గుతుంది' అంటూ రమని బలవంతాన లేవతీసింది సరళ.

చెదిరిన జుట్టు సవరించుకుని, చెప్పులు తొడిగి గదిదాటి బయటకి వచ్చారు సరళ రమా. తిన్నగా మెట్లుదిగి కాంపౌండు దాటి, రోడ్డుదాటి బీచిలోకి నీటి అంచు దాకా నడిచారు. ఒకరి నొకరు అనుకొని మూగగా నడిచిపోతున్న ఆ స్నేహితురాళ్ళని చూసి మిగిలిన పిల్లలు నవ్వుకొన్నారు. హాస్టల్లో అందరికీ తెలుసు సరళకి రమ అంటే ప్రాణంతో సమానమని.

పాదాలు తడి యిసకలో పెట్టి గోడ్డాన్ని మోకాళ్ళపై ఆన్చి కూర్చుంది సరళ. ఎగిరి విరుచుకు పడుతున్న కెరటాలు విసన కర్రల్లాగా పాకి యింకి పోతున్నాయి.

'చిన్నప్పటినుండీ నాకు అమ్మ దగ్గిర ఎంత చనువో నాన్నగారంటే అంతమోజు, అవకాశం చిక్కినప్పుడల్లా అమ్మ తన కథనంతా చెప్తూండేది. నాకూ కష్టం సుఖం తెలుసుకోగల వయిస్సు రాగనే నాన్నగారితో తానెన్ని విధాల బాధపడిందో చెప్పేది అయినా కూడా ఎందుకో నాన్నగారంటేనే నాకు ఎక్కువ ఆపేక్షగా ఉండేది.' అంది రమ.

'నిజాని కంతే కదా దూరాన ఉన్న హృదయాలే సన్నిహితంగా స్పందించ కలవు.' అంది సరళ వెనక్కి వెళ్ళిపోతున్న కెరటపు నురగలని వింతగా చూస్తూ.

'అమ్మకి ఐదోఏట పెళ్ళి అయిందిట'

'మైగాడ్! నిజంగానా?' ఆశ్చర్యంగా అంది సరళ.

'అవును. నాలుగేళ్ళు నడుస్తున్నప్పుడే నాన్న తరఫు వాళ్ళు చూసుకుందుకు వచ్చారట. అప్పుడు అమ్మకి బట్టలు కట్టుకోవాలన్న జ్ఞానంకూడా ఉండేదికాదుట. 'వాళ్ళంతా వస్తున్నారు దానికో పట్టుగుడ్డ కట్టిపెట్టండి' అని ఇంట్లో పెద్దవాళ్ళు ఆర్డరువేస్తే అమ్మమ్మ గబగబా కూతుర్ని ముస్తాబుచేసిందిట.

'అంతా బొమ్మల పెళ్ళిలాగా జరిగిందన్నమాట'



# కొత్త మరఫీ

## సూపర్ ట్రాన్సిస్టర్

# ముసాఫిర్




ట్రాన్సిస్టర్లలో అందాల పోటీ పెడితే ముసాఫిర్ సులభముగా గెలుస్తుంది. దీని క్యాబినెట్ ఎంతో సన్నముగా యిమిడికగా ఉంటుంది. మీకు నచ్చిన ప్రోగ్రామును ఏ స్టేషనునుండైనా యీ రేడియో మీద పెట్టుకొని వినగలరు. చూసీ చూడడముతోనే ముసాఫిర్ మిమ్మల్ని ఆకర్షిస్తుంది.

**మోడలు టిబి 0820**

**ధర రు. 328.00 మాత్రమే.**

ఎక్సైజ్ డ్యూటీతో సహా మాత్రమే. అమ్మకపు పన్ను మరియు యితర స్థానిక పన్నులు అధనము. ధరలో బ్యాటరీ ధర చేర్చబడలేదు.

NAS 18

**కొత్త మరఫీ సూపర్ ట్రాన్సిస్టర్ యొక్క విశేషాంశములు :**

- 8 ట్రాన్సిస్టర్లు మరియు డయోడ్. 3 బ్యాండ్లు-ఆల్ వేవ్
- ప్రత్యేకమైన డిష్ రిఫ్లెక్టర్
- టెలిస్కోపిక్ అంటినా మరియు బిల్టిన్ ఫెర్రైట్ ఏరియల్
- స్పష్టమైన మరియు శ్రావ్యమైన ధ్వని

**మరఫీ *ముసాఫిర్*ను నేడే మీ దగ్గరలోనున్న మరఫీ డీలరు వద్ద చూడండి**



**murphy మరఫీ** – ఇంటిలో అందరి ఆహ్లాదమునకు!

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనని, దేనికీ అనుకరణ కాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించ లేము.

సంపాదకుడు
ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

## హృదయం చిగిర్చింది

'విటొచ్చి ఇక్కడ బొమ్మలకి బదులు మనిషి పిల్లల్నే పెట్టి ఆడుకున్నారు నాన్న గారిది దర్జా అయిన కుటుంబం. రాచ గౌరవాలు మరిగిన వంశం. అమ్మ వాళ్లదీ కూడా పెద్ద కుటుంబమే అయినా దర్పాలు తక్కువ. డబ్బుకి లోటు లేనిచోట పుట్టి పెరిగింది అమ్మ. పెళ్లినాటికి ఓనమాలు దిద్దేదట.' నవ్వుతూ అంది రమ.

'అటువంటి స్థితి మనం ఊహించను కూడా లేంకదూ?' తడి ఇసుకలో అర్థం లేని పిచ్చిగీతలు గీస్తూ అంది సరళ.

'నిశ్చితార్థం చేసుకున్న రోజున రెండు తులాల జూంకాలు పెట్టారుట అమ్మకి. 'ఏం చదువుతున్నావమ్మా?' అని నాన్నమ్మ అడిగితే సిగ్గేసి పెరట్లోకి పరుగెత్తిందట అమ్మ. అక్కడికిపోయి ఊరుకోకుండా అరిటిచెట్టుని కౌగలించుకుని 'ఓ' అంటూ అరిచిందట. అది ఓనమాలు చదువుతున్నానని చెప్పడం గాబోలు. పెళ్లినాటికి నాన్నగారు పధ్నాలుగేళ్లవారట. మెట్రిక్ పరీక్షకి కటాలని చదువుతూ ఉండేవారు. పెళ్లి అయిన రెండేళ్లకి నాన్నగారు మెట్రిక్ పాసయ్యారుట. పండగలనీ, పబ్బాలనీ ప్రతి నెలా అత్తవారింటికి వచ్చిపోతూనే ఉండేవారు.

'అమ్మని కాపరానికి తీసుకురావడం, నాన్నగారు క్రాపింగు చేయించుకోడం ఒకే సారి జరిగాయి. దాంతోపాటే ఉద్యోగప్రయత్నాలు కూడా మొదలు పెట్టారు'

'ఆస్థిమంతులకి ఉద్యోగం ఏమిటే?' అంది సరళ.

'కూర్చుని తింటే ఏ ఆస్థి తరగదు? నాన్నగారి తండ్రి అలాగే కరిగించి చివరికి కన్నుమూశారు ఉన్న దానికి తోడు ఏదో కొంత రాబడి ఉంటే తప్పించి సంసారం జరిగేలా తోచలేదు కాబోలు ఉద్యోగాన్వేషణ ప్రారంభించారు. పైగా యింటినిండా పోషించవలసిన వాళ్ళు ఎక్కువ.

ఉద్యోగరీత్యా నాన్నగారు కాకినాడలో కాపరం పెట్టినప్పుడే అమ్మ తొలిసారి రైలెక్కింది. అమ్మ అతి గారాబంగా పెరిగిందేమో, వంటా వార్పూ కూడా రాదు. ఇంట్లో ఉండే మా అత్తయ్యే పెత్తనం చేసేదారు. సహజంగా ఉండే చిన్నచిన్న ఇబ్బందులు కూడా తట్టుకోలేక అమ్మ ఎప్పుడూ పుట్టింటికేసే చూస్తూండేది. పెత్తన కుండ పెట్టినట్టు ఎప్పుడూ ఏడుస్తూనే ఉండేది.

'అయితే ఈ విషయంలో నీకు అమ్మ పోలికే వచ్చింది అవునా?' వేళాకోళం చేసింది సరళ.

'ఏడుపు ఎవరూ నేర్పక్కరలేదు. అదే వస్తుంది. అమ్మ ఏడ్చి ఏడ్చి నాన్నగారి మనస్సు విరిచేసిందని నా నమ్మకం. నే పుట్టి పెరిగి సంగతులు అర్థం చేసుకోవడం ప్రారంభించేసరికే పరిస్థితులు చాలా విషమంగా తయారు అయ్యాయి. నాన్నగారు చేసేది గుమాస్తాగిరి అయినా ఇల్లు పట్టకుండా తిరిగేవారు. ఏ అర్థరాత్రో అపరాత్రో యింటికివస్తే అమ్మ ఏడ్పు వింటూ, సాధింపు వింటూ తెల్లవారిపోయేది ఇల్లు చుట్టూ వాతావరణం చాలా గంభీరంగా తయారైంది. ఏదో తీరని ద్రోహం అందరికీ చేస్తున్నట్టు నాన్నగారిని ఆడిపోసేవాళ్ళు. అటు అమ్మ తరఫువాళ్ళు ఇటు ఇంట్లోవాళ్ళు అంతా ఒకటై నాన్నగారిని ప్రాణం విసిగించారు లనిపిస్తుంది నాకు. ఒకరోజు నాకు బాగా జ్ఞాపకం. ఉదయంపూట ఆఫీసుకు వెళ్ళడానికి సిద్ధం అవుతున్నారు నాన్నగారు.

'మళ్లీ ఎప్పుడు రాక?' అంది వ్యంగ్యంగా అమ్మ.

నాన్నగారేం సమాధానం చెప్తారో అని చెవులు రిక్కించుకు వింటున్నాను. ఆయనేం బదులు చెప్పలేదు.

'ఈవాళేనా? రేపా?' అని రెట్టించింది అమ్మ. ఆ క్షణంలో అమ్మమీద ఎక్కడలేని కోపం వచ్చింది నాకు. ఈ అమ్మ ఎందుకు మాట్లాడకుండా ఊరుకోదు' అనిపించింది. అంతే ఆ రోజు మొదలైంది. నాన్నగారు రాత్రిళ్ళు ఇంటికి రావడం తగ్గించడం. రెండురోజులకో మూడురోజులకో ఓసారి వచ్చేవారు ఇంటికి. కావలసినవన్నీ ఆఫీసు బంట్రోతు చూస్తుండేవాడు. వీరాసామికి నాన్నంటే దేవుడు. ఆయన నిప్పులో దూకమంటే దూకుతాడు. వాడు అంతటి నమ్మకస్తుడు. వాడికి నాన్నగారి సంగతులన్నీ బాగా తెలుసు. వాడికీ అమ్మని చూస్తే గౌరవం లేదు గాని

భయం మటుకు ఉండేది. సాయంత్రం పూట ఎప్పుడేనా నన్ను షికారుకి తీసుకువెళ్ళే వాడు. అప్పుడే చూశాను నాన్నగారి మనిషిని. అందంగా ఉంది. నవ్వుతూ మాట్లాడుతుంది ఓర్పుకి పుట్టినిల్లు లాగా తోచిందామె. అమ్మలో కనుపించని ఎన్నో మనోహరమైన గుణాలు ఆమెలో నాకు కనిపించాయి. అప్పుడప్పుడు వీరాసామివెంట అక్కడికివెళ్ళి సరదాగా గ్రామఫోను వినే దాన్ని. పెట్టిన ఫలహారాలు అవీ సుష్టుగా తినేదాన్ని. చక్కగా తల దువ్వి రిబ్బను కుచ్చులుకట్టి ఓ రోజు నన్ను ఇంటికి పంపింది. అంతే ఆ రోజు బాగా తన్నులు తిన్నాను. ఇక వీరాసామితో కూడా ఇవతలికీ అవతలికీ పంపడం మానేసింది అమ్మ. నాన్నగారు మాకు దూరం దూరంగా అయిపోడానికి అమ్మే కారణం అనిపించేది నాకు. నేర్పుగా మనిషితో మాట్లాడి మంచి చేసుకోడం తెలియని అమ్మ చాలా నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించేది. నీకు బోరు కొడుతుందా?' ఆగుతూ అడిగింది రమ.

'నీముఖం బోరేమిటి, చెప్పు చెప్పు' అంటూ తొందరచేసింది సరళ.

'కాలం భారంగా సాగిపోతూనే ఉంది. ఉన్నట్లుండి నాన్నగారు ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. మిలటరీకి వెళ్ళడానికి సిద్ధపడ్డారు. ఆరోజు ఆవార్త విని అమ్మ చేసిన హంగామా తల్చుకుంటే ఈరోజు కూడా అమ్మమీద నాకు జాలికల్గదు. ఏడుపులు పెడబొబ్బలు నెత్తిబాదుకోడాలు ఒకటేమిటి వాటన్నిటి మధ్యనుంచీ నాన్నగారు చిదానందునిలాగా తన పథకం సాగించారు. కాకినాడ దగ్గిరలోనే ఉన్న పల్లెటూరిలో చిన్నయిల్లు బేరంచేసి కుటుంబం తరలించారు. అక్కడంతా నవ్యంగా అమర్చిపెట్టి వెళ్ళిపోయారు. అప్పటినుండీ చావులకీ పుణ్య కార్యాలకీ తప్పించి యింటికి వచ్చేవారు కాదు. అమ్మ చాటున పెరగడం ప్రారంభించాను నేను... ఆఊళ్ళోనే ఉన్న స్కూల్లో చదువుకూడా ప్రారంభించాను ... అమ్మమటుకు మారలేదు. అపరసంధ్య వేళల్లో ఏ వేళకాని వేళల్లో అమ్మ ఏడవడం మటుకు మానిందికాదు...రాపోదాం బాగా చీకటిపడిపోయింది' అని ఆపేసింది రమ.

'అమ్మగారిని చూస్తే కరుణామూర్తి లాగా తోస్తారుకదా! లోపల ఇంత కాఠిన్యం ఉందంటావా?' ఆశ్చర్యంగా అడిగింది సరళ.

'అంతే- ఈ మనుష్యులని పైధోరణిని పట్టి అర్థం చేసుకోవడం మనతరం కాదు. నాకందుకే నువ్వు యిస్తున్న ఉత్సాహం చూస్తుంటే భయంగా ఉంటుంది సరళా' అంటూ స్నేహితురాలిచేయి అందుకుని నిలబడింది రమ.

సీటువెంబడి నడుస్తూ 'సాయంత్రం ఎందుకు ఏడ్చావు?' అడిగింది మాట మారుస్తూ సరళ.

'నా కెందుకో భయంగా ఉంది సరళా, మేష్టారి ధోరణి నన్ను తబ్బిబ్బుచేస్తుంది. ఇదంతా ఏకీడుకి దారితీస్తుందో నని భయంగా ఉంది' స్నేహితురాలిచేయి గట్టిగా పట్టుకుంటూ అంది రమ.

'భయపడి పిరికిదానిలా పారిపోవడం సులభమే కాని నిలబడి జీవితంలో కావలసిన దాన్ని ధైర్యంగా చేపట్టడంలో అందం ఉంది. నువ్వేం తప్పుచేశావని పిరికి పడాలి.'

స్నేహితులు ఆ అలముకుంటున్న చీకట్లలోంచి నడిచివచ్చి రోడ్డెక్కారు. వారి వెనక సముద్రం పిచ్చిగా ఘోష పెడుతోంది. కాలేజీ ఆవరణదాటి తిన్నగా డైనింగుహాలుకి చేరారు. భోజనం అయిందనిపించి రూముకి చేరుకున్నారు.

రమ పుస్తకాలు ముందువేసుకుని బల్ల దగ్గిర కూర్చుంది. రమకేసే చూస్తూ హాయిగా తన మంచంలో పడుకుని నిద్రకొరిగింది సరళ.

దీపం ఆర్పి తనూ పడుకుంది రమ.

* * *

తల్లికి వంట్లో బాగుండలేదని ఉత్తరం రావడంతో హడావిడి పడిపోయింది రమ.

'సరళా ఇప్పుడు క్లాసుమానివెడితే ఈ పరీక్షలు గట్టెక్కుతా యంటావా?' స్నేహితురాలిని సలహా అడిగింది.

'ఫరవాలేదే బయలుదేరి వెళ్ళు. పరీక్షల ముందు కొంచెం ట్యూషను పెట్టుకుందాంలే' అంది సరళ.

'అమ్మకి సాధారణంగా ఒంట్లో బాగుండక పోవడమంటూ ఉండదు. మరిప్పుడేం వచ్చిందో?' తనలో తనుగా అనుకుంది రమ —అల్లివున్న జడకొస విప్పుతూ.

'బాగుంది అమ్మమటుకు మనిషి కాదా ఏం? పైకిచెప్పకుండా తిరుగుతారు కనుక ఒంట్లో ఎప్పుడూ బాగానే ఉందనుకుంటూంటారు. బస్సులోవెళ్ళిపోతే సుఖం కదూ?' అడిగింది సరళ

'బస్సయితే సుఖమే పదిగంటలకి ఎక్కితే ఓ మూడున్నర గంటల్లో వెళ్ళిపోవచ్చు. నువ్వువచ్చి ఎక్కిస్తావా?'

'దానికేం? అయితే రేప్పొద్దున్న బస్సుకి ఎక్కేయి' అంది సరళ.

అనుకున్నట్టే ఉదయమే లేచి బస్సు ప్రయాణానికి సిద్ధం అయింది రమ.



'ఈగది మరెవ్వరికి ఇవ్వకండిసార్ త్వరలో తిరిగొచ్చేస్తా!!'

వార్డెన్ దగ్గరికివెళ్ళి పర్మిషన్ తీసుకుని సరళతోపాటు తొమ్మిదిగంటలవేళ బయలు దేరి బస్సుస్టాండు చేరింది. ఉదయం పూట బస్సులో అంత జనం రద్దీలేదు. ఒకవార సీటు చూసుకుని కూర్చుంది

'వెళ్ళాక ఎన్నాళ్ళుపట్టేదీ వ్రాస్తావు కదూ?' అడిగింది సరళ.

'రాస్తాను. నువ్వు జాగ్రత్తగా నోట్సులు వ్రాస్తావుగా?'

'అమ్మాయిగారికి ఏం శ్రద్ధ చదువు మీద' అని వేళాకోళం చేసింది సరళ.

పదిగంటల బస్సు కదిలేసరికి పదిన్నర దాటిపోయింది. మొదటిగంట ఎలాగా అయిపోవచ్చిందని కాలేజీకి వెళ్ళి విశ్రాంతి గదిలో కూర్చుండిపోయింది సరళ.

రామారావు సాహిత్యం క్లాసు తీస్తున్నాడు. అతని కళ్ళు వేయికళ్ళయి క్లాసు కలయచూశాయి రమ లేదు సరళా లేదు. ఆలస్యంగా వస్తారేమోనని అడపా దడపా గుమ్మంకేసి చూస్తూనే ఉన్నాడు. వాచీ చూసుకుంటూనూ ఉన్నాడు. అతనిమనస్సు వికలమైపోయింది. గంట ఎప్పుడు కొడుతుందా అని చూస్తూ గడిపాడా పిరియడ్.

క్లాసు వదలగానే అమ్మాయిల విశ్రాంతి గదివైపు నడిచాడు. సరళ కానీ కనబడుతుందేమోనని. అత నెదురు చూసినట్లే సరళ గదివదలి బయటికి వస్తూంది. సరళని చూడగానే రామారావు గట్టిగా ఊపిరి తీసుకున్నాడు.

'క్లాసు ఎగ్గొట్టి బాతాఖాని కొడుతున్నావా?' అడిగాడు.

# హృదయం చిగిర్చింది

సరళ మేష్టారి దగ్గరిగా వచ్చింది.

'నిన్న రమతో మాట్లాడాను మేష్టారూ, మీరు కొంచెం ఓపిక పట్టండి అన్ని సవ్యంగా ముగుస్తాయి. రమ అమ్మగారికి ఆరోగ్యం బాగులేదని ఉత్తరం వస్తే చూసి రావడానికి పొద్దుటి బస్సులో వెళ్ళింది' అని చెప్పవలసినవన్నీ చెప్పింది.

'అయితే రేపూ క్లాసుకి రాదా?' ఆత్రంగా అడిగాడు రామారావు

'రాదు మాష్టారూ, బహుశా ఒక వారం అంతా రాకపోవచ్చు' చావు కబురు చల్లగా చెప్పినట్లు చెప్పింది సరళ.

'అలాగా' చాలా నిరుత్సాహంగా అన్నాడు రామారావు.

'ఉత్తరం వ్రాస్తానంది మాష్టారూ, ఏ సంగతీ మీకు చెప్తానులెండి' అంటూ క్లాసు రూంకేసి నడిచింది.

వారసీటు చూసుకుని బస్సులోకూర్చున్న రమ మనస్సులో ఒరాసెళ్ళలా ఊహలు అలుముకున్నాయి వేదనాపూరితమై హృదయం బరువెక్కిపోయింది. నేనేం చెయ్యాలి? అన్న పిచ్చి ప్రశ్న సవాలక్ష పొర్లు తలెత్తింది.

'నే నెందుకిలా అయిపోయాను? నాకీ పాతికేళ్ళలో అరవైఏళ్ళు ఎందుకురావు?' అంటూ బాధపడింది స్నేహంగా హృదయం విప్పి మాట్లాడితే ఏమవుతుందోఅన్న భయం ఒకవైపు, ఈ చీకటి జీవితంలో ఒకామాత్రపు వెల్గులే నోచుకోకూడదా! అన్న ఆలోచన వేరొకవైపు...ఆలోచనలని ఒకపక్కగా సాగనివ్వడంలేదు.

'ఏం మేష్టారి నెందుకు నేను తిరిగి ప్రేమించకూడదని' ఆమె బేల హృదయం ఒక పక్కనుంచి ప్రశ్నిస్తూనే 'ఎలా పెళ్ళి చేసుకుంటావు?' అంటూ రెండో పక్క నుంచి నిలవేస్తూంది. ఆలోచనల అలలలో చెండులా తేలియాడు తుండగానే రమ ఊరులో ఆగింది బస్సు త్వరగా బస్సుదిగి దగ్గరేఉన్న తమ ఇంటికేసి గబగబ నడక సాగించింది రమ. ఇల్లుదగ్గర అవుతున్న కొద్దీ గుండె వేగంగా కొట్టుకోసాగింది.

అరుగుమీద పాపతో ఆడుతూన్న సుందరం బావని చూడడంతో సగంబరువు గుండెమీదనుంచి దించినట్లు అనిపించింది. కొంచెం దూరంలోనే రమనిచూసిన సుందరం పాపనెత్తుకుని ఎదురు వచ్చాడు.

'అమ్మకెలా ఉంది బావా?' ఆత్రంగా అడిగింది రమ

'బాగానేఉంది రమా! ఏదో అలసటమీద గుండె దడ వచ్చిందన్నాడు డాక్టరు' అంటూ రమతోపాటే ఇంట్లో అడుగు పెట్టాడు. సుందరం చేతిలో పాపని తీసుకుని గుండెల కదుముకుంది రమ.

మంచంమీద నీరసంగా పడుకుని ఉన్న తల్లి పక్కలో కూర్చుంటూ 'ఎలా ఉందమ్మా?' అని అడిగింది.

'నువ్వు వచ్చావా తల్లీ; నాకింక బెంగ లేదు' నీరసంగా ఎండిపోయిఉన్న తన చేతిలోకి రమ చేతిని అందుకున్నారావిడ.

'నీకేం ఫరవాలేదమ్మా, సుందరం బావ వచ్చాడు. జానకి ఉంది నీ కెందుకు బెంగ? నేనూ వచ్చేశాను నీకు బాగా ఉండేంత వరకూ తిరిగి వెళ్ళనుగా'

'పోయి కాళ్ళూ చేతులూ కడుక్కో తల్లీ. కొంచం ఎంగిలిపడిరా, మాట్లాడుకోవచ్చు' అంటూ కూతురిని లోపలికి పంపారావిడ.

'చూడు సుందరం, అమ్మాయి చిక్కినట్టు లేదూ? ఆ కళ్ళకింద నల్లగా వలయమేర్పడి అలా అయిపోయిందేం?' అని సుందరాన్ని అడుగుతూన్న తల్లి మాటకి కంట నీరు తిరిగింది రమకి. పాపనెత్తుకుని దాని చిన్న భుజంలో ముఖం దాచుకుంటూ పెరట్లోకి నడిచింది రమ.

(ఇంకా వుంది)



మీకు నామీదున్న ప్రేమ కొద్దీ ఇలా నాకు సాయం చేస్తున్నారు గానీ - నామటుకు నేను మిమ్మల్ని ఈలాంటి పనులు చెయ్యనీయమంటున్నానా?

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్




(క) దొమ్మి:

ఒక పల్లెటూళ్లో రెండు పక్షాలవాళ్ళు కర్రలు పుచ్చుకుని కొట్టుకున్నారు. గాయాలు తగిలిన వ్యక్తులను డాక్టరు దగ్గరకు మోసుకువచ్చారు. వాళ్లందరికీ చేతులమీదకే దెబ్బలు తగిలేయి (అదృష్టవశాత్తు!?) విరిగిన ఎముకలు సరిచేయడంలో డాక్టరుకి ఊపిరి సలుపలేదు ఆరోజంతా. ఆ డాక్టరు నాకు చిన్ననాటి స్నేహితుడు. ఆరోజున తానుపడ్డ కష్టాల్ని వివరించాడు.

'నలుగురికి ఎడమచేతులు విరిగేయి. ఐదుగురికి కుడిచేతులు విరిగేయి. ఇద్దరికి కుడిచేతులు విరగలేదు. ముగ్గురికి ఎడమ చేతులు విరగలేదు. మొత్తం వీళ్లతో నా హాస్పిటలులో మంచాలన్నీ నిండిపోయాయి.'

'అంటే మొత్తం 14 మంది అన్న మాట. నీ హాస్పిటలులో ఇదివరలో ఇన్ని బెడ్స్ లేవు కదా, ఈమధ్యని పెంచావా? నాకు తెలియనేలేదే' అన్నాను నేను.

'అబ్బే! మంచాలు ఏమీ పెరగలేదు. ఇదివరకటి అన్నే' అన్నాడు డాక్టరు.

ఇంతకీ ఆ హాస్పిటలులో మంచాలు (కనీసం) ఎన్ని ఉన్నాయో చెప్పగలరా?

* * *

(చ) పేక ముక్కలతో సిలువ:

ఆను నుంచి తొమ్మిదివరకూ గల డైమను పేకముక్కలు తొమ్మిదీ తీసుకుని ఇక్కడి బొమ్మలో చూపినట్లు సిలువ ఆకారంలో అమర్చాను. దీని ప్రత్యేకత ఏమిటంటే అడ్డవరుసలోని ఐదుముక్కల




చుక్కలూ కూడితే 23 కి సమానం అవుతుంది. అలాగే నిలువు వరుసలోని ఐదు ముక్కలలో ఉన్న చుక్కలూ కూడినా 23 కి సమానం. ఈ తొమ్మిది పేక ముక్కలతోనూ ఇంకా ఎన్ని రకాలుగా ఈవిధమైన సిలువలు తయారు చేయగలరో ప్రయత్నించండి. చుక్కల మొత్తం 23 కి మాత్రమే సమానం కానక్కర



లేదు. రెండు వరుసల మొత్తమూ సమానమైతే చాలు.

* * *

(ట) సైనిక శిక్షణ:

ఒక మాజీ సైనికుడికి సందు దొరికినప్పుడల్లా రెండవ ప్రపంచ యుద్ధంలో




తాను పాల్గొన్నప్పటి విషయాలు ఏకరువు పెట్టడం హాబీ. దానితో ఇతరులను 'బోరు' చెయ్యడం మామూలు అయిపోయింది. ఒకరోజున అతడిల్లా చెప్పుకుపోతున్నాడు.

'విశాలమైన సమతల మైదానంలో ఆరోజున పదివేల మంది సైనికులం బారులుతీరి నిలువబడ్డాం...'

'అయితే వీరిలో ఒక్కడుమాత్రమే నిట్ట నిలువుగా నిలుచున్నాడన్నమాట' అని వెంకప్ప ఆ సైనికుని వాక్ప్రవాహానికి అడ్డువచ్చాడు. మాజీ సైనికుడు ముఖం చిట్లించుకున్నాడు.

'ఏమిటి నువ్వు అంటున్నదీ? పదివేల మందిమి నిలుచున్నామంటూంటే ఒక్కడే నిలుచున్నాడంటావేమిటి?'

'నిలబడ్డారు కానీ, తిన్నగా నిటారుగా నిలువబడలేదు అని అన్నాను' అని వెంకప్ప వివరించాడు.

'తిన్నగా నిలువబడలేని సైనికుడు మా బెటాలియన్‌లో లేడు తెలుసా? సైనిక శిక్షణ అంటే ఏమిటో నీకు తెలిసినట్లు లేదు' అన్నాడు మాజీ సైనికుడు.

వారిద్దరిలో ఎవరిమాట సరియైనదో మీరు చెప్పగలరా?

(జవాబులు 64 వ పేజీలో)

## పెద్దకథ




## 2

నిరుద్యోగి నంచీ అరుగుమీద పెట్టి పక్కనే వున్న కుర్చీమీద కూర్చున్నాడు. 'అన్నయ్యొచ్చాడు' అంటూ చెల్లెలు లోపలికి పరిగెత్తింది. ఆ అరుపు విన్న తల్లి తండ్రి చేటంత మొహాల్చేసుకుని బయట కొచ్చారు. నిరుద్యోగి మొహం చూడగానే వాటంతటవే ముడుచుకు పోయినయ్. 'మంచినీళ్ళ కావాలిట్రా' అంది తల్లి. 'వద్ద'ని తలాడించాడు. కానీ ఏం మాట్లాళ్లేదు. నిరుద్యోగికి మాట్లాట్టానికూడా మొహం చెల్లటల్లేదు.

'ఏవోయ్ ... యీ మాటు కూడా యింటర్వ్యూ తగలేసొచ్చావా?' అన్నాడు ముసలాయన. నిరుద్యోగి కాలి బొటనవ్రేల్తో నేలని రాస్తూ దాహింక చూస్తూ కూర్చున్నాడు. నిరుద్యోగి తండ్రికి కోపం జాస్తి – ఇంటర్వ్యూకి ఖర్చీ కెళ్ళి వచ్చినప్పుడల్లా తండ్రిచేత యిట్టా పడటం నిరుద్యోగి కలవాటే. అందుకనే ఏం మాట్లాడ్డు.

'ఎందుకలా అరుస్తారు? వాడుమాత్రం ఏం చేస్తాడు? చదివేప్పుడన్నీ పరీక్షల్లో ఫస్టుగా పేసవ్వలేదూ? ...అసలీ ఉద్యోగం పరీక్షల్లో సిఫార్సులేని వాళ్ళందర్నీ తప్పించేస్తార్ట. ఆమధ్యోకాయన దీన్ని గురించి రాశాడు. మీరూ చదివారుగా... యింకేం ... వీణ్ణంటే ఎట్లా' అంది తల్లి.

'ఆ...చెప్పావ్లే ... అనల్నేను వీణ్ణి కాలేజీలో చేర్పించకుండా ఓ కొట్లో పెట్టిస్తానంటే విన్నావ్? యీ పాటికా కొట్లోమీ దెంత డబ్బొచ్చేదో! 'కాదు, కాద'ని పై చదువులికి పైసాలన్నీ ఖర్చు పెట్టించావ్ ... యిప్పుడా పెట్టుబడిమీద వడ్డీకూడా రావటల్లేదు' అని నిప్పు తొక్కిన కోతిలా లేచాడు.

'యింకోమాటు యింటర్వ్యూ అప్పేవు తాను.. యిప్పటికే చదువుకు పెట్టినంత ఖర్చు నీ దరఖాస్తులకీ, యింటర్వ్యూలకీ పెట్టాను యిహ ఛస్తే పైసాయివ్వను...' అన్నాడు. యితగాడికి పైసాలంటే డబ్బు అని అర్థం. హైదరాబాదులో వుండేవాడు కొన్నాళ్ళు. అప్పణ్ణించి డబ్బు అని వాడే చోటల్లా పైసా అంటాడు. ఆ మధ్యెప్పుడో ఓ పెళ్ళి కెళ్ళి ఎవరో 'పెళ్ళికొడుకు తండ్రిగా రేడి?' అంటే ఏదో జోకేస్తున్నాననుకుని డబ్బులెక్కెట్టు కుంటున్నాడని చెప్పటానికి 'పైసా లెక్కెట్టు కుంటున్నాడేమో!' అని తన తెలివికి తనే నవ్వు కున్నాట్ట.

'పైసాలేవిటోయ్! మాయింటో పైసాలు కుక్కలుకూడా ముట్టవ్'అంటూ లేచాట్ట పెళ్ళికొడుకు తండ్రి. అయినా యిప్పటికి పైసాలంటూనే వుంటాడు... తండ్రి మళ్ళీ మొదలెట్టాడు.

'అసలా బి.కాం అవ్వంగానే ఎం.కాం వొద్దు; ఎల్లెల్బీ చదివిద్దామంటె నామాటెవరన్నా వింటేనా? చదివే నీకే యిష్టంలేకపోయె...ఏం? ఆ సుబ్బయ్య

కొడుకు కిష్టిగాడు ఠక్కుగా లా పేస్సై ప్రాక్టీసు వెలగబెట్టటల్లా?' అన్నాడు.

'ఆ...అతగాడి ప్రాక్టీసు వెలిగిపోవటం వేంఖర్మ? తగలడిపోతోంది ... అయ్యో రామ! అతగాడి ప్రాక్టీస్సంగతీ, నావంట సంగతీచెప్పుకోవాల్సిందే. తెల్లలాగూవిగాద నల్లకోటేసుకుని బయల్దేరంగానే ప్రాక్టీసున్నట్టు లెక్కేంవిటి?' అంది నిరుద్యోగి తల్లి.

కిష్టిగాడు అన్న వ్యవహారిక నామంగల వ్యక్తి అసలు పేరు, అతగాడు పిలిపించుకోవాలని యిష్టపడేపేరు కృష్ణమూర్తి. కాని అతగాణ్ణి అతగాడి తరం వాళ్ళుతప్ప అతగాడి తండ్రి తరం వాళ్ళంతా కిష్టిగాడనే పిలుస్తారు...అతగాడు ఎల్లెల్బీ దండయాత్రలుకొట్టి దండిగా అనుభవం సంపాదించి, ఓ సుముహూర్తాన ఎల్లెల్బీ పేసయ్యాడు. 'అతగాడి రాశిఫలం ఆ ఏడాది బాగుండి పేసయ్యాడుగాని లాపి పేసవ్వలే' దన్నారందరూ. ఓజ్యోతిష్కుడు 'పేసయితే యీ ఏడాది పేసవ్వాలిగాని, లేకపోతే యితగాడి చదువురేఖ చాలాదీర్ఘంగా వుంద' న్నాడు. ఎలా అయితేనేం కృష్ణమూర్తి 'లా' పేసయ్యాడనిపించాడు అతగాడి తల్లి యీవార్త వూళ్ళోవేగాక, వూరూరా వినిపించింది. అతగాడి తండ్రి—

'ఏం వుంది...రెండేళ్ళల్లో జిల్లాకోర్టు జడ్జి అవుతాడు. తర్వాతో అయిదేళ్ళకి హైకోర్టు జడ్జి, తర్వాతక్కడే చీఫ్ జస్టిస్ అవుతాడు...తర్వాత సుప్రీంకోర్టు జడ్జి అవుతాడు...తర్వాత...' అంటూ చెప్పుకుపోతూండేవా డెవడన్నా గడపలోకొస్తే అతగాడితో. యివన్నీ లోపల్నుంచి వింటున్న కృష్ణమూర్తి బయటకొచ్చి—

'నాన్నా!...సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్ అయితే దేశానికి ప్రెసిడెంటు కూడా అవ్వొచ్చు' అనేవాడు తలకాయపైకెత్తి. దాంతో తండ్రికెక్కళ్ళేని వుత్సాహం వొచ్చేసి పక్కనున్నాయనతో 'చూశారాండీ... విన్నారా' అని ఆ సంతోషంలో 'ఒరేయ్, నాన్నా! యీ వొంద పుచ్చుకుని గవర్నరుపేటెళ్ళి, టెర్లిన్ పాంటు, షర్టుకి గుడ్డ తెచ్చుకో......తొందరగా వెళ్ళు. మళ్ళీ రేపు పార్టీలొస్తే తీరికుండదు' అని పంపించేవాడు. యిహ యితగాడి తల్లి సంగతి చెప్పక్కర్లేదు. యీవిడకి కాస్త వళ్ళు బద్ధకం: యిల్లెప్పుడూ శుభ్రంగా వుంచుకోక పోవటంవే కాకుండా యిల్లు శుభ్రంగా ఎప్పుడూ వుంచదు. ఎవరన్నా వాకిట్లోంచి ముందు హాల్లో కెడితే అక్కడా వాకిట్లో వున్నట్టేవుండేది. అది కప్పిపెట్టుకుంటాని కీవిడ—

'అబ్బ...మావా డీ ప్రాక్టీసు పెట్టాక యీ పార్టీ లొస్తూ పోతూవుండటంతో యిది బాగుచేయించటానికే తీరటల్లేదు. ఎప్పుడూ విరామంలేకుండా పార్టీలు వస్తూపోతూనే వుంట రు' అనేది. ఆవిడ చెప్పిందాంట్లో ఒక్కటీ నిజంకాదన కూడదు. ఒకటి మాత్రం నిజం. రెండో దబద్ధం. పార్టీలొస్తూనే వుండేవాళ్ళు. అదొక్కటీ నిజం. కాని వాళ్ళు లోపలికొచ్చేవాళ్ళు కాదు. ఆ పక్కవీధిలో వున్న ప్లీడరుగారిల్లు కనుక్కోలేక యితగాడి బోర్డుచూసి 'యితడు కూడా ఆ గూటి పక్షే కదా!...ఆ ప్లీడరుగారి గూడెక్కడో చెప్పగల్డ' ని వాళ్ళింటిముందాగి 'ప్లీడరుగారూ' అని కేకేసేవాళ్ళు. అలా కుథ ఘడియకోసంవే ఎదురుచూస్తున్న యితగాడి తల్లి తలుపు గడియతీసి బయటకొచ్చి 'ఎవరుకావాలి?' అనేది.

'ఆవిడ ఆడది. ఆవిడకి తెలియదే మోనని వాళ్ళు 'ప్లీడరుగా రున్నారాండీ' అని అనేవాళ్ళు. ఆ వెనకాల రూంలో వాళ్ళు టేబిలుమీదపెట్టి ఏదో నవల చదువుకుంటున్న కృష్ణమూర్తి లేచి నాలుగు బారాటి తెల్లకాగితాల్ని నిలువుగా మడిచి, కోర్టుకాగితాలు చూసుకుంటున్నట్టు వాటిల్లోకి చూస్తూ—వరండాలో కొచ్చి, వచ్చినవాళ్ళంకచూడకుండా కాగితాల్లోకే చూస్తూ—

'ఏంవిటి? ఏం కావాలి?... ఏంకేసు? సివిలా? క్రిమినలా?' అనేవాడు. ఆ వొచ్చిన వాళ్ళు—

'అయ్యా! కేసుకాదండి, ఫలానా ప్లీడరుగారు...పేరు శాస్త్రిగారు...ఆయన యిల్లెక్కడో చెపుతారా?' అనేవాళ్ళు. కృష్ణమూర్తి తల్లి నిరాశంతా మొహంమీదికే తెచ్చుకుని 'యిందుకా పని పెట్టుకొచ్చి మరీ తలుపు కొట్టారు. బాగానే వుంది వరస' అనేది. కృష్ణమూర్తి మాత్రం కోపాన్ని, నిస్పృహని లోపలే అణచేసుకుని పైకి మాత్రం—

'శాస్త్రి యిల్లా? అ...పక్కబజార్లోనే, వెళ్ళండి' అనేవాడు. 'వెళ్ళండి' అనేటప్పుడు, 'ఏం' అందరూ శాస్త్రిగార్నే పట్టుకోకపోతే వెంకోవలుగురు...పోనీ పలుగురు



# గురుద్యోగ పర్వం

కాకపోతే ఒక్కళ్ళు...నెలకొక్కళ్ళక్కడికి చావరాదూ?' అనే ఏడుపువాళ్ళమ్మకి, ఆ పక్కింట్లో వున్నవాళ్ళకీ వినిపించేది: యితగాడింత తిప్పలు పడుతున్నా వాళ్ళమ్మ మాత్రం అతగాడి కొచ్చే కేసుల్సంగతీ, అతగాడి పార్టీలు సిమాలికిచ్చే ఫ్యాసుల్సంగతీ అన్నీచెప్పేది పైగా వే చెప్పే వన్నీ మావాడి కొచ్చే వాటిల్లో కొన్నే సుమా! యింకెన్నో వస్తయ్' అనేది ఎప్పుడన్నా మొగుడు ఓడజను బత్తాయిల్తెచ్చి టేబులుమీద పెడితే, పక్కావిడ కాకుండా ఏ పక్కబజార్లో ఆవిడో ఆవేళ్టి కొనేస్తే—

'యీ బత్తాయిల కాలం వచ్చిందంటె యింటినిండా బత్తాయిలే.. యీ డజనూ ఎవరో పార్టీ వచ్చి యిచ్చి పోయాడు...నే నవి చచ్చినా ముట్టుకోను. తిని తిని జబ్బు చేస్తోంది' అనేది. యిలా కొడుకు ప్రాక్టీసు గురించిన, తప్పుడు ప్రచారం వూరంతా చేస్తుంది.

'మీ అబ్బాయేం చేస్తున్నాడు?' అని ఎవరన్నా అడిగితే—

'అయ్యో! మీకు తెలీదూ? యీ వూళ్ళో అందరికీ తెల్సు. ఎల్లెల్బీ ఫేసై బోర్డుకట్టి ప్రాక్టీసు పెట్టాడు' అనేది. ఎల్లెల్బీ అన్నచోట నాక్కు దీర్ఘంతీస్తూ చెప్పేది పక్కనున్నవాళ్ళు 'ఆవిడ ఎల్లెల్బీ అన్నప్పుడెంత దీర్ఘం తీస్తుందో అన్నే ళ్ళతగాడా డిగ్రీకోసం చదివాడు' అనేవాళ్ళు.

యింతకూ యీ కృష్ణమూర్తి చేసేపని, యీ మూడేళ్ళనుంచి చేసినపనీ ఏమిటంటె ఆ వూళ్ళో వున్న జిల్లా కోర్టుముందో చెట్టునాటి దాన్ని పెంచాడు అతగాడు మొదటిగా కేసుల్లేకపోయినా కోటేసుకుని కోర్టుకెళ్ళినప్పుడు అంతకు పూర్వమే అక్కడున్న చెట్లన్నీ ఆక్రమించుక్కూర్చున్న ప్లీడర్లు 'అబ్బాయీ... కొత్తవాడివిలా వున్నావ్. కొత్తలో చాలా ఏళ్ళిట్టాగే చెట్లకింద కూర్చోవాలి. యిక్కడ చెట్లు ఖాళీగాలేవు. అందుకని నువ్వో చెట్టు పాతుకో' అన్నారు. కృష్ణమూర్తట్లానే చేశాడు...

యీట్లా మూడేళ్ళు గడిపాక చివరికీళ్ళాకాదని వాళ్ళనాన్న ఆ ఫలానాకి శాస్త్రిగారితో మాట్లాడి 'మావాడింకా కొన్నాళ్ళు జూనియర్గా వుంటాడు మీ కింద' అని చేర్పించాడు. శాస్త్రిగారు నెలకో నలభై రూపాయలిచ్చి చేర్చుకున్నాడు. యిప్పుడప్పుడపుడూ శాస్త్రిగారి వెంట వెడుతూ, ఆయన ఫైళ్ళు పట్టుకెడుతూ కోర్టుబయటే కాకుండా కోర్టులోపల కూడా ఎట్లావుంటుందో తెల్సుకున్నాడు. మొదటిగా కోర్టులోపలి కెళ్ళి వచ్చిన రోజున సంతోషంతో యిల్లంతా తిరిగాడు.

'ఏమిరా? యీ వేళప్పుడు బజార్ల వెంట తిరిగేవాడివి ... యివ్వాళింట్లోనే అఘోరించావేం' అన్నాడు తండ్రి కొంచెం కోపంగా.

'వూరుకోండి...అయిందానికీ కాందానికీ అన్నిటికీ ఎప్పుడూ విసుక్కోవటమే ... కారణం తెలుసుకోకుండా అట్టా విసుక్కుంటూంటారేం?... వాడివ్వాళ కోర్టులోపలికి కెళ్ళొచ్చాట్ట. యింకా బయటకేం వెడతాడు? అయినా అబ్బాయ్! బయటికెళ్ళి నలుగుర్తో యీ సంగతి చెప్పి రారాదూ ? ... నువ్వెందుకులే. దిష్టి తగుల్తుంది. నేనే చెప్తాను' అంటూ ఆవిడ వూరిమీదికి బయల్దేరింది. తల్లటు తరలి వెళ్ళంగానే కృష్ణమూర్తి మొదలెట్టాడు.

'నాన్నా! యివ్వాళ కోర్టు లోపలికెళ్ళి పోయాను' అన్నాడు అతగాడి వుత్సాహానికి పట్టపగ్గాల్లేకుండా వుంది అభిమన్యుడు పద్మవ్యూహంలోకి వెళ్ళినప్పుడు కూడా యింత సంబర పడుండడు.

'అలానా అభిమన్యూ! ... ఆ విశేషాలేమిటి?' అన్నాడు తండ్రి.

ఏముంది?...కోర్టంతా అచ్చు సినిమాల్లో చూపించినట్టుగానే వుంది. యిదిగో యిట్టా వుంటుంది కోర్టు ... నువ్వు



జడ్జీవనుకో.. నేను ... అంటూ చెప్పుకు పోతున్న కొడుక్కడ్డొచ్చి —

'నేను జడ్జీ నేమిటా?.. నువ్వు జడ్జీవి కావాలి' అన్నాడు తండ్రి...'సరే...యిదంతా ఎందుగ్గానీ నేన్నీతో రేపు కోర్టు కొస్తాను నువ్వెట్టా వాదిస్తున్నావో చూసి ఆనందిస్తాను' అన్నాడు తండ్రి.

'లాభంలేదు నాన్నా రేపు శెలవెళ్ళను, రేపు శాస్త్రిగారి ఫైళ్ళు యింకోడు తీసికెడుతున్నాడు' అన్నాడు కృష్ణమూర్తి.

'పోనీ నువ్వెప్పుడెడ్తావ్ మళ్ళీ' అన్నాడు తండ్రి.

'యిప్పుడు చెప్పలేను...ఓ రెణ్నెల్లయ్యాక నేనే చెపుతాలే' అన్నాడు కృష్ణమూర్తి.

ఓ నాలుగు నెలలయ్యాక 'నే నివ్వాళ కోర్టుకెడుతున్నాను వచ్చేవాళ్ళు రావచ్చు' అని యింట్లోవినాన్నుచేశాడు. ముసలాయన కొడుకు వెనకాల కోర్టుకు బయల్దేరాడు...

కృష్ణమూర్తి కోర్టులో కాగితాలు పుచ్చుకుని నిలబడ్డాడు నిలబడి తండ్రి వంక చూశాడు చూసి ఒకచెయ్యి పాంటు జేబులో పెట్టాడు. రెండోచెయ్యి దాంట్లో వున్న కాగితాల్ని పైకెత్తాడు. ఏదో మాట్లాడాడు. కాని అవి ముసలాయనకి వినపళ్ళేదు, అంతేకాదు; అవి కృష్ణమూర్తికే వినపళ్ళేదు. జడ్జీకసలే వినపళ్ళేదు. 'ఏమిటి మీరనేది?' అన్నాడు జడ్జి ... కృష్ణమూర్తి రెండు నిమిషాలు మొహం తుడ్చుకుని కాగితం తీసి చదివాడు. అర్జంటు కేసేదో రావటంతో శాస్త్రిగారు ఢిల్లీ వెళ్ళారు. అందుకని వాయిదా కోరమని అదెట్లా అడగాలో మూడుమాటల్లో రాసి నాలుగుసార్లు చదివించి వెళ్ళాడు శాస్త్రిగారు. యితగాడింత హంగామా చేసి చదివాడు.

జడ్జీగారు నవ్వుకుని 'శాస్త్రిగారు ఊళ్ళో లేరా ఏమిటి?' అని యింకో కేసు తీసుకున్నారు.

కృష్ణమూర్తికి చిన్నప్పుడు ఎప్పుడూ ఏదో రోగం వచ్చేది. 'వీడు బతికి బట్ట కట్టేంతవరకూ నమ్మకం లేద'నే వాళ్ళప్పుడు. ఇప్పుడు 'యితగాడు బల్లకట్టి బతగ్గలిగినప్పుడు సంగతి కదా ?' అంటున్నారు...

...అలాంటి కృష్ణమూర్తిలాగా 'లా' చేసినా బాగుండేదన్నాడు నిరుద్యోగి తండ్రి.

అని యిపి కేకలేసి చివరికి 'పోనీ...ఈ బజారు చివరో గురుద్యోగున్నాడు. అట్నాటు బజార్లోంట బలాదూర్ తిరక్కపోతే అతగాడి చుట్టూ తిరిగి అతగాణ్ణి పట్టుకో రాదూ ... ఆ పనన్నా చెయ్యి' అంటూ బయటకెళ్ళాడు.

నిరుద్యోగి తండ్రి చెప్పిన గురుద్యోగి ఆ బజార్లోనే కొత్తగా యిల్లు కట్టుకొన్నాడు. మొన్నీ మధ్యవే వొచ్చి చేరాడా యింట్లోకి. అతగాడేదో ప్రయివేటు కంపెనీలో మేనేజరుగా వుంటున్నాడు. నెల కో ఎనిమిదొందలొద్దాకా వొస్తాయ్. ఆ పై వొచ్చేవి కలిపితే యింకా అవుతుందని ప్రతీతి. అతగాడి కయిదారుగురు కూతుళ్ళున్నారు. అంతా బాగా వుంటారు. ఖులాసాగా కూడా వుంటారు. నిరుద్యోగి ఆ యింటి చుట్టూ రెండు తడవల్తిరిగాడు. రెండోతడవ ఆ యింటిముందు తిరుగుతూండగా వరండాలో ఓ అమ్మాయి కనిపించింది. ఆ అమ్మాయి బారుగా, అందంగా వుంది. 'ఆహా ... బాపు బొమ్మలా వుంది కదా' అనుకున్నాడు నిరుద్యోగి. ఆ అమ్మాయి నవ్వింది. నిరుద్యోగి ఎదురు నవ్వుదా మనుకున్నాడు కానీ తను నిరుద్యోగినని గుర్తుకొచ్చి మానేశాడు. అలా రెండుమూడు తడవలు తిరిగినా అమ్మాయి కనిపించింది కానీ ఆమ్మాయి తండ్రి కనిపించలేదు...

యిలా తిరుగుతూండగా యితగాడి కో చిరుద్యోగి కనిపించాడు. చిరుద్యోగి నిరుద్యోగికి క్లాసుమేటు. కాలేజీ చదువయ్యాక చిరుద్యోగో చిన్న వుద్యోగం చూసుకున్నాడు. కాస్సేపవీ. యివీ, అప్లయ్ చేసుకున్నవీ చెప్పుకున్న తర్వాత నిరుద్యోగి చిరుద్యోగితో—

'ఈ కొత్తగా కట్టిన డాబాలోకొచ్చిన ఆఫీసర్‌గారు నీకు తెల్సా?' అన్నాడు నిరుద్యోగి. చిరుద్యోగి నవ్వాడు.

'ఎందుకా చిరునవ్వు నవ్వుతావ్ ?' అన్నాడు నిరుద్యోగి.

'చిరునవ్వేం కాదు...పెద్దగావే నవ్వాను. ఈ వుద్యోగంలో చేరిం తర్వాత రోజూ గొంతులోతు ఫైళ్ళల్లో కూర్చోటంవల్ల నవ్వు సరిగా రాటంల్లేదు. గోతులోంచొచ్చి నట్టుంటోంది. నేనింకా నయం మా ఆఫీసులో యింకోడున్నాడు. వాణ్ణాన్పితే మాటి

లోంచి [illegible] వేసు పెళపెళా నవ్వేం దెందుకంటే 'ఆ ఆఫీసరు నాకు తెల్సా?' అని నువ్వడిగితే నాకు పెద్దగా నవ్వొచ్చింది. 'తెల్సా?' అని అడుగుతావేమిటి? నాకాయ న్తెలియక పోతే ఈ సైకిల్నిట్టా నడిపించుకు రావటం ఎందుకు? నేన్రోజూ యీ బజారు మొదట్లోకి రాంగానే సైకిలు దిగి నడిపిస్తాను. అప్పుడాయన్ని చూస్తే సైకిలొదిలేసో లేదా దానికి స్టాండేసో దభాల్న దండం పెట్టొచ్చు; లేదా వాళ్ళబ్బాయి

# గురుద్యోగ పర్వం

కనిపిస్తే 'ఏం, బాబ్బా!... సైకి లెక్కుతావా?' అని సైకిలుమీదో, నెత్తిమీదో ఎక్కించుకోవచ్చు. అందుకని నడిచేవస్తాను. ఇంతకూ చెప్పొంది, చెప్పొచ్చేది ఏమిటంటె ఆయన మా ఆఫీసు మేనేజరు. చాలా మంచివాడు. ఆడపిల్లలున్నారు కదూ? అందుకని యింకా మంచివాడిగా కనిపిస్తాడు ...సరే, ఏమన్నా పనుందా ఆయన్తో' అంటూ నిరుద్యోగొంక చూశాడు.. చిరుద్యోగి ఉద్యోగంలో చేరిన మొదట్లో తన గోడ వేమిటో, తన గొడుగేమిటో తప్ప యింకేమీ పట్టేవి కావు. యిప్పుడాఫీసులో అన్నీ నేర్చుకుని గొడుక్కుతోడు సైకిలు కూడా కొనుక్కున్నాడు. ఈ గురుద్యోగిని మంచి చేసుకుని ఎప్పుడూ అతడి దృష్టిలోనే వుంటాడు. 'సృష్టిలో మీరు తప్ప నాకింకెవ రున్నారు?' అంటా డతగాడ్దగ్గరి కెళ్ళి. గురుద్యోగి బోల్డుసేపు సంతోష పడిపోయి తర్వాత కాస్సేపాయాక పడిపోతాడు. అతగాడి గుండె కాస్త జబ్బుంది. అది గ్రహించిన చిరుద్యోగి ఓ డాక్టరు స్నేహితుడి దగ్గరకో, లేకపోతే ఓ స్నేహితుడి డాక్టరు దగ్గరకో వెళ్ళి 'గుండె — దానికొచ్చు జబ్బులు' అన్న ఒక 'బుక్ లెట్' తీసుకుని కంఠతా పట్టి గురుద్యోగి దగ్గరకొచ్చి అది గడ గడ చెప్పేవాడు. గురుద్యోగి కందుకనే యితగాడంటె అభిమానం జాస్తి.

'అసలు గుండె జబ్బు ప్రేమించేవాళ్ళ కొస్తుందిటండీ...గుండె గాయపట్టం అంటె అదే' అన్నాడొకసారి చిరుద్యోగి గురుద్యోగితో. గురుద్యోగికిలాంటి మాట లంటె సరదా. వయస్సు తరుముకొస్తుంటె దాన్ని వెనక్కి తరిమికొట్టాలని యితగాడి తాపత్రయం. అది సాధ్యపడకపోయేటప్పటికి తనే వెనక్కెళ్ళి ఆనాటి జ్ఞాపకాలు చిరుద్యోగితో చెప్తుకుంటూ వుంటాడు. ...అలాంటి సమయాల్లో తన కూతుళ్ళ పెళ్ళిళ్ళగురించి చెప్తు కనేవాడు. ఇలాంటి విషయాల్లో కూడా గురుద్యోగి అభిమానం సంపాదించాలని చూసేవాడు చిరుద్యోగి.

'నిరుద్యోగీ! నువ్వోసారి గురుద్యోగిని చూడు. నీకు తప్పకుండా వుద్యోగం [illegible] ప్రస్తుతానికి నెలకో రెండొందలొస్తే చాలుగదా. వెయ్యి రూపాయ లెత్తుకునేవాడు ఓ రెండొం ఉద్యోగం చూపించగల్డు' అని సలహా యిచ్చాడు. సలహా తీసుకుని చిరుద్యోగిని సైకి లెక్కించాడు నిరుద్యోగి.

'ఎట్లా వెళ్ళి పలకరించాలా?' అని ఆ రాత్రల్లా ఆలోచించాడు నిరుద్యోగి. నిద్రపోయేముందు చాలాసేపాలోచించాడు. దేనికన్నా చందా వెయ్యమని వెడితే బావుంటుందనుకున్నాడు. నిరుద్యోగి చందా అడిగితే అందరూ అనుమానిస్తారనే అనుమానం వొచ్చినా చివరికదే మంచిదని నిర్ణయించుకున్నాడు. మర్రోజు పొద్దున్నే వెళ్ళి,

'నమస్కారం' అన్నాడు గురుద్యోగెదట నిలబడి. గురుద్యోగి పేపర్లోంచి తలపైకెత్తి ఎదురు నమస్కారంచేసి ఎదురుగా వున్న కుర్చీ చూపించాడు. నిరుద్యోగి కూర్చుంటూ—

'అయ్యా! నేనీ బజారువాణ్ణే. ప్రస్తుతం అన్ని బజార్లూ తిరుగుతున్నాను. అంటె నిరుడు ఎం. కాం పేసయ్యాను. ప్రస్తుతం నిరుద్యోగిని. కాని యిప్పుడొచ్చిం దుద్యోగంకోసంకాదు. దానికి రేపొస్తాను. ప్రస్తుతం యింకోపనిమీదొచ్చాను. రేపొచ్చే శ్రీరామనవమికి మన బజార్లో పందిరి వేయించి కల్యాణం బ్రహ్మాండంగా చేయిస్తాం.. అందుకు మీకు తోచిన చందా యిస్తే సంతోషిస్తాం. యీ మూలున్న మూడిళ్ళల్లో కలెక్టు చేసే బాధ్యత నా కప్పగించారు' అని కూర్చున్నవాడల్లా లేచి,

'యిదిగో సీతారాముల కళ్యాణ శుభలేఖ' అంటూ యిచ్చాడు. గురుద్యోగి చదవటం మొదలెట్టాడు. గురుద్యోగి వెనకాలున్న కిటికీలోంచి మూడు నాలుగు తలకాయలు తొంగిచూస్తున్నయ్. వాళ్ళు గురుద్యోగి పుత్రికా రత్నాలు. అందులో ఒకమ్మాయ్ వూచలా వుండి కిటికీ వూచల మధ్యనుండి దూరిపోయేలా వుంది. నిరుద్యోగి మెల్లగా నవ్వి క్రాపు సవరించుకున్నాడు...గురుద్యోగి చదవటం పూర్తిచేసి కళ్ళు తుడ్చుకున్నాడు. సీతారామ కల్యాణం అని వినంగానే అతగాడికి కూతుళ్ళ పెళ్ళి గుర్తొకొచ్చింది. దాంతో

కారణం చెప్పొచ్చింది: శుభలేఖ చూడగానే ఏడుపొచ్చింది. రెణ్ణెల్లనించీ పెళ్ళాం 'రేపు శ్రీరామనవమి వెళ్ళాక జ్యేష్ఠ మాసంలో లగ్నాలున్నాయ్‌ట...యీ ఏడాది పిద్దరి పెళ్ళిళ్ళూ చెయ్యొద్దా? ఏడాది కిద్దర్ని చేస్తే మన పిల్లల పెళ్ళిళ్ళయ్యేసరికి మూడేళ్ళు పడుతుంది... యిప్పణ్ణించే సంబంధాలు వెతకండి' అంది. 'వెతకటానికి సంబంధా లెవరైనా పారేసుకుంటారేం. దగ్గర సంబంధాలన్నీ ప్రతి వాళ్ళూ కలుపుకుంటూనే వుంటారు. యింకా మనదాకా ఏం వొస్తాయ్?' అనేవాడు. 'మీరు గురుద్యోగులే కానీ లోకజ్ఞానం కొంచెం కూడా లేదు. మీ దగ్గర కెవరన్నా వుద్యోగాలు వెతుక్కోటానికి రారుటండీ! వాళ్ళలో బాగావున్న వో కుర్రాణ్ణి వెతుక్కుంటె సరిపోయె...' అనేది. గురుద్యోగికా సలహా అప్పుడు నచ్చింది; యిప్పుడు గుర్తుకొచ్చింది. వెంటనే నవ్వుతూ—

'ఆఁ నీ పేరేంటన్నావ్? ... ఏకవచనంతో పిలుస్తున్నందుకేమీ అనుకోకు. మనం మనం ఏకం కావల్సినవాళ్ళం... ఒకే బజార్లో వుంటున్నాం' అని పేరు దగ్గర మొదలెట్టి అన్నీ అడిగి మళ్ళీ మొదటికొచ్చి పేరడిగి—

'దుర్గా! కాఫీ పట్రామ్మా' అన్నాడు. దుర్గ అనే అమ్మాయి కాఫీ టేబిలుమీద పెట్టి, టేబిలుమీదున్న పేపర్తీసుకుని అక్కడే చదవటం మొదలెట్టింది.

'యిది మా అమ్మాయ్...దుర్గ' అన్నాడు. నిరుద్యోగి 'అలాగా' అని 'నాకు తెల్సండీ.. నేను ఎం. కాం చదివేటప్పుడు వాల్తేరు కాన్వొకేషను కొచ్చాను కదండీ...అప్పుడు మీరు కూడా వచ్చారు' అన్నాడు నిరుద్యోగి...ఆ అమ్మాయి కాస్సేపు నిలబడి నమస్కారం పెట్టి లోపలి కెళ్ళిపోయింది. ఆ నాటికి చందా మాత్రం తీసుకుని యింటి మొహం పట్టాడు నిరుద్యోగి. కొన్నాళ్ళ తర్వాత మళ్ళీ వెడితే మళ్ళీ కాఫీ ఇచ్చి—'మా బ్రాంచొకటి గుంటూర్లో పెడుతున్నాం. వచ్చేనెల్లో మాకో ఎకౌంటెంటు కావాలి. అప్లయ్ చెయ్యకూడదూ?' అన్నాడు గురుద్యోగి.

'ఎందుకప్లయ్ చెయ్యను సార్.. నా వుద్యోగమే అది' అన్నాడు నిరుద్యోగి. 'నా సర్టిఫికెట్లు తీసుకొచ్చి మీ కిప్పుడే చూపిస్తాను' అన్నాడు నిరుద్యోగి మళ్ళీ.

'సర్టిఫికెట్లెందుగ్గానీ, మీ నాన్నగార్నడిగి నీ జాతకం పట్రా...లేకపోతే నేనే వొస్తాను మీ యింటికి...సరేనా?' అన్నాడు గురుద్యోగి. నిరుద్యోగికి భయం వేసింది. యిన్నాళ్ళూ తనే యితగాణ్ణి పడుతున్నాననుకున్నాడు. యిప్పుడది ఎదురుతిరిగింది. నిరుద్యోగికి గురుద్యోగయ్యే దాకా పెళ్ళి చేసుకోవాలనిలేదు...అందుకని—

'మీ కెందుకుసార్ శ్రమ...నేనే రేపు తీసుకొస్తాను' అని వెళ్ళిపోయాడు.

రెండ్రోజుల్తర్వాత చిరుద్యోగి కనిపించి 'ఏం...ఏం జరిగింది?' అన్నాడు.

'ఏంవుంది? ఆయన వ్యవహారం చూస్తే వుద్యోగం వక్కటే యిచ్చేట్టు లేదు. ముందు కూతుర్నీ, తరవాత వుద్యోగం యిస్తాన్లావుంది. నా కిప్పుడప్పుడే పెళ్ళక్కర్లేదు. యింకా కొన్నేళ్ళు రోడ్ల వెంట తిరిగినా ఫర్వాలేదుగానీ, పెళ్ళి మాత్రం...బాబోయ్, వద్దు' అన్నాడు నిరుద్యోగి. చిరుద్యోగి నిట్టూర్చాడు...

ఓ రోజు గురుద్యోగి రాత్రి ఎనిమిదింటి దాకా 'గోడౌన్'లో ఏదో చెక్ చేసుకుని యింటికొస్తున్నాడు. దార్లో స్నేహితు డొకడు కల్సాడు. స్నేహితుడు కూడా గురుద్యోగే. గురుద్యోగి కాబట్టి స్నేహితుడయ్యాడో, లేకపోతే స్నేహితుడు కాబట్టి గురుద్యోగయ్యాడో తెలియదు. ఆ గురుద్యోగొక బాంకులో ఏజంటుగా వుంటున్నాడు. యింతకాలం ఆ గురుద్యోగిల్లు పైనా, బాంకు కిందా వుండేవి. యిప్పుడా పైన కూడా యింకో ఆఫీసు రావటంతో గురుద్యోగి యింకో యిల్లు తీసుకోమన్నారు. ఆ గురుద్యోగెప్పుడూ రాత్రి ఎనిమిదింటికి చేర్తాడు. యితగాడి కింద మన్న క్లర్కులందరూ అయిదయ్యాక అయిదు నిమిషాలు కూడా వుండరు. ఆ బాంకులోనే 'శేషగిరి' అని ఓ క్లర్కున్నాడు. శేషగిరెప్పుడూ పని సొంతంగా చెయ్యడు. పన్లో ఎంతో కొంత శేషం వుంచుతూనే వుంటాడు. 'ఆ పనే కాదు, ఏ పనైనా సరే – చివరికి నా పనైనా సరే కొంచెం

---

## మహీధరోక్తులు

మహీధర నళినీ మోహన్‌రావు

శాస్త్రపరిచయంపు ఛాయలైనను లేని
ఘనుల కేల శాస్త్ర గ్రంథ రచన?
గుడ్డి యెద్దు చేని కడ్డ
బడ్డట్లయ్య!
హృదయవర్తి ఈ మహీధరోక్తి.



శేషం పురచుతాను. అది నా శేవాటం ఛాడింకా పైగా. ఏజంటుగారంతగా మాట్లాడ్డు. ఏమన్నా మాట్లాడ్తే రేపు 'యూనియన్'తో గొడవ. తీసేస్తాని కంత కన్నా పవర్లు లేవు. ఒకవేళ తీసినా మళ్ళీ వేసుకోవాల్సిందే లేకపోతే 'యూనియన్' వూరుకోదు. కింద క్లర్కులేవన్నా

## గురుద్యోగ పర్వం

గొడవలు లేవదీస్తే పైవాళ్ళొచ్చి కూడా తననే అంటారు. కింద వాళ్ళందరూ రూల్సు ప్రకారం పన్జేస్తారు. ఈ శేషగిరి రూళ్ళ పుస్తకం ఒకటి కొనుక్కుని దాన్నిండా రూల్సన్నీ రాసుకున్నాడు. అందులో మొదటి రూలు 'ఆఫీసు కెన్నింటికి పోవాలి; యింటికెప్పు డెళ్ళిపోవాలి;' అన్నది. ఓ రోజున ఎందుకో పది నిమిషాలు ముందొచ్చాడు. ఆ పది నిమిషాలూ వాకిట్లో పచార్లు చేస్తూనే కూర్చున్నాడు వెళ్ళేటప్పుడూ అంతే; అయిదవంగానే పని అయిందనిపించి లేస్తాడు. ఓ రోజు ఏజంటు ఓ పదిహేనంకెల అంకె యిచ్చి అలాంటిదో యింకో అంకెని 'పైదాంట్లోంచి తీసేసి శేషం ఎంతో చెప్పు శేషగిరీ!' అన్నాడు. అప్పుడు అయిదుకి అయిదు నిమిషాలు టైం వుంది. శేషగిరి యీ అయిదు నిమిషాలూ లెక్క చేస్తూ కూర్చోకుండా చేస్తున్నట్టు కూర్చున్నాడు. అయిదవ్వంగానే లేచి వెళ్ళబోతుంటే — 'శేషగిరీ! శేషం మాటేమిటి?' అన్నాడు ఏజంటు.

'అయిదు' అన్నాడు శేషగిరి.

'ఏమిటి?...అయిదు రూపాయలేనా?' అన్నాడు ఏజంటు ఖంగారుగా.

'అది గాదండీ ... అయిదు రూపాయలు గాదు; టైం అయిదయ్యింది. అది చెయ్యాలంటే యింకో అరగంట పడ్తుంది. ఎక్స్‌ట్రా టైంగా ట్రీట్‌చేసి డబ్బిస్తారా?' అన్నాడు శేషగిరి.

'నాయనా శేషగిరీ!...అప్పుడయినా నువ్వ ఎంతో కొంత శేషం వుంచుతావ్‌గా' ఆ భాగ్యానికి ఎక్స్‌ట్రా టైం ఎందుకులే. యిప్పటికే 'మా బ్రాంచిలో యింత ఎక్కువ వోవర్‌టైం పేమెంట్సుంటున్నవేమిట'ని పైవాళ్ళు రాస్తున్నారు. ఆ లెక్క నేం చేసుకుంటా గానీ నువ్వెళ్ళిరా' అన్నాడు ఏజంటు...ఆ బ్యాంకిలో శేషగిరిలాంటివాళ్ళు బోల్డుమందున్నారు. అసల్టయిములో చెయ్యాల్సినపనిలో శేషం వుంచటం, దాన్ని ఓవర్‌టైంలో చెయ్యటం; లేదా ఏజంటు నెత్తిమీదికి తొయ్యటం; యిదీ పని. యిలా అందరు తమ బరువంతా యితగాణ్ణెత్తిన వెయ్యటంతో ఏజంటు కొంచెం కుంగాడు. పొట్టివాడయ్యాడు.

'యిదేమిటి? మీ ఏజంటింత పొట్టిగా వుంటాడా?' అని ఎవరన్నా అంటే, అతగాడా మాట విని అవతలివాణ్ణి లోపలికి పిల్చి, ఏదో ఎకౌంటు వ్యవహారాలు మాట్లాడి మాటల్లో మాటగా—



'నేను వుద్యోగంలో చేరకముందు అయిదడుగుల ఏడంగుళాలుండేవాణ్ణి. ఈ పదేళ్లలో అయిదంగుళాలు తగ్గాను. ఉద్యోగం అన్న తర్వాత నెత్తిమీద బోల్డు బరువుంటుంది కదండీ. అందుకని కుంగిపోతాం. అది లేనప్పుడు, నేను ఎస్సెల్సీ చదివేటప్పుడు చాలా బారుగా వుండేవాణ్ణి. కావాలంటే ఎస్సెస్సీ రిజిష్టర్చూస్తారా? యిక్కడేవుంది' అంటూ డ్రాయర్లోంచి దాన్ని బయటకి లాగి చూపించేవాడు. అట్టా చూపిస్తానికని ఆ రిజిష్టర్నెప్పుడూ ఆఫీసులో పక్కనే పెట్టుకునేవాడు. రిజిష్టరుచూపించి 'చూశారుగా.. యింకెప్పుడూ అట్లా అనకండి' అని పంపించేవాడు.

పెళ్లాంతో కల్సి బయటకెళ్లాల్సొచ్చినప్పుడు కూడా రిజిష్టర్తీసి జేబులో పెట్టుకుని బయల్దేరేవాడు. అతగాడి పెళ్లాం అతగాడికంటె మూడంగుళాలు పొడుగూ, అరవై పౌన్లు బరువూను. అందుకని పెళ్లాంతో కల్సివెళ్లేటప్పుడు కొందరే కాకుండా అందరూ— 'ఏవిటి?... యింత పొట్టివాడు అంతావిణ్ణి చేసుకున్నాడు?' అనేవాళ్లు. యితగాడికో(పం)వచ్చి అట్టా అన్నవాణ్ణల్లా లాక్కొచ్చి యస్సెల్సీ రిజిష్టర్తీసి—

'నా కెస్సెల్సీలో పెళ్లయింది అప్పటికి నా ఎత్తు అయిదూ ఏడు. మా ఆవిడ అయిదూ నాలుగుండేది. నేనిప్పుడు రెండంగుళాల్తగ్గాను. అంతేగానీ పెళ్లివేళ్టికి మా ఆవిడ నాకంటె చాలా పొట్టి. తెల్సిందా? యిహనించెప్పుడన్నా కనిపిస్తే అట్టా అనకు' అని చూపించి, పంపించేవాడు...

ఈ గురుద్యోగిని గోడౌన్ దగ్గర్నుంచొచ్చే గురుద్యోగి కల్సుకున్నాడు; 'ఏవిటి ఖబుర్లు?' అన్నాడు.

'ఏవున్నయ్? ... బెజవాళ్లో ఎండలు మండిపోతున్నయ్. వడగాలి దడదడ బద్దలు కొడ్తోంది' అని ఆగాడు ఏజంటు

'అయితే మరి కూల్డ్రింక్ షాపులోకి పోదాంవా?' అని యిద్దరూ హిమాలయా కూల్డ్రింక్సులోకి వెళ్లారు.

'నాకేవిటో జీవితం అంటె విరక్తి పుడ్తోందోయ్. వెధవది 'గురుద్యోగులం' అని పేరు. ఎప్పటికప్పుడు బోల్డు బాధలు. ఏదో అంటారే 'యింట్లో ఈగలమోత, బయట పల్లకీమోత' అని అట్టావుంది. అద్సరే ఈ రామధ్య యింట్లో ఈగలెక్కువయినయ్యోయ్. మీ యింట్లో కూడానా?' అన్నాడు కూల్డ్రింకు తాగుతూ ఏజంటు.

'సీతాపతీ! అందరిళ్లల్లోనూ ఈగలమోతే గాని...మా పిల్లలకి సంబంధాల్చూడాలి. ఈ వేసంకాలంలో చెయ్యమని చంపుతోంది మా ఆవిడ ... నీ ఎరికలో ఏవన్నా సంబంధాలుంటె చెప్పు' అన్నాడు గురుద్యోగి.

'సరే నన్నే అడుగు... మా అమ్మాయి తెలివిగలది కాబట్టి, నా కష్టాలు కనిపెట్టి నాలుగు తడవల్నించి యస్సెస్సె తప్పుతోంది కాబట్టి 'యిది యస్సెల్సీ పూర్తి చేస్తే కాని పెళ్లి చెయ్యనం'టూ నెట్టుకొస్తున్నాను. ప్రస్తుతం ఈ ఒక్కదానికీ పెళ్లి చెయ్యలేని నన్నడుగు సంబంధాల్సంగతి. అందుకే హాయిగా ఉద్యోగాలకోసం వూరూరా తిరుగుతున్న ఆ రోజులే యిప్పటికన్న వెయ్యిరెట్లు నయం. యిప్పుడు వూరొదిలెడ్తానికి వీల్లేదు. ఎప్పుడున్నా వూరెల్దాం అంటె శలవు దొరకదు. అది దొరికితే యింకేవో యింట్లో యిబ్బందులు... అసల్నన్నడిగితే ఈ నిరుద్యోగున్నాడే... వాడు అదృష్టవంతుడు. మా బజార్లో ఓ నిరుద్యోగున్నాడే ఎమ్మెస్సీ కాశీలో చదివాడు దాంతో కాశీయాత్రపూర్తయిందికదా. యిప్పుడు ఈ యింటర్వ్యూ, ఆ యింటర్వ్యూ అంటూ దేశం అంతా తిరుగుతున్నాడు... తర్వాత ఖర్మం చా(కా)లి ఓ వుద్యోగం దొరికి, శలవు దొరక్కపోయినా అతగాడికేం లోటు?. అవునంటావా?' అంటూ ఖాళీ గ్లాసు బల్లమీద పెట్టాడు సీతాపతి.. యిద్దరూ లేచి బయటకొచ్చారు. ఏజంటు మళ్లీ మొదలెట్టాడు:

'ఈ చిరుద్యోగి సంగతే చూడు యితగాడికేం లోటు? ఉన్న యిద్దరు పిల్లలు చిన్నపిల్లలు. వాళ్ల బాధింకో పది పదిహేనేళ్లదాకా లేదుకదా. ఈ పదిహేనేళ్లు హాయిగా అనుభవిస్తాడు.. ప్చ్, ఎటు తిరిగి బాధలన్నీ మనకే' అంటూ రుమాల్తీసి మొహం తుడ్చుకుని రెండు రిక్షాలు పిల్చి ఒక దాంటో తనెక్కి, యింకో దాంటో గురుద్యోగి నెక్కించి 'వస్తా..గుడ్ నైట్' అంటూ వెళ్లిపోయాడు.. అప్పుడే అటువేపునుంచి యింటికి తిరిగొస్తున్న నిరుద్యోగి క్రాపు సవరించుకుంటూ, 'ప్చ్.. వాళ్ల అదృష్టవంతులు అనుకున్నాడు గురుద్యోగులిద్దర్నీ చూసుకుంటూ అటువేపునుంచే కూరగాయల్సంచీ మోసుకొస్తూ, 'యింకేవన్నా తేవడం మర్చిపోయానా' అని ఆలోచించుకుంటూవస్తున్న చిరుద్యోగి—

'ఈ బాధలన్నీ చిరుద్యోగులకేగా? ... గురుద్యోగులకేం నిక్షేపంలా రిక్షా లెక్కిపోతారు' అని తల గోక్కున్నాడు. గోక్కుంటె బట్టతల గీరుకుపోయి నెప్పిపుట్టింది.

(ఇంకావుంది)






దీన్నే వేట చిరుత అంటారు. ఇది 'పిల్లి'జాతులకి, మిగతావాటి లాగా చెందదు అనుకోవచ్చు. దీని గోళ్లు అవసరం లేనప్పుడు లోపలికి ముడుచుకొని పోవు. పైగా దీన్ని నమ్మకంగా పెంచుకోవచ్చు కూడా. మిగతా 'అడవి పిల్లుల'తో ఇది సాధ్యం కాదు.

దీని శరీరం మీద చుక్కలు, చిరుతలా సన్నలుకాక, ముద్దలలా ఉంటాయి. తల చిన్నదిగా గుండ్రంగా ఉంటుంది. కాళ్లు సన్నగా పొడవుగా ఉంటాయి. కంటి నుంచి, నోటి ప్రాంతానికి S మాదిరి గీత కూడా దీనికి ప్రత్యేకం. ఆసియా, ఆఫ్రికా చాలా ప్రాంతాల్లో ఇది ఉంది. అయితే ఇండియాలో ఈ మధ్య, అపరిమితమైన వేటవల్ల నశించి పోయినట్లుంది.

వీటి ప్రత్యేకత ఒకటి ఉంది. పెంపుడు, వినోద జంతువులుగా ఇవి ఎంతో ఉపయోగకరమైనవి. సుమారు, ఆరునెలలపాటు మనతో కొద్దికొద్దిగా సంచరిస్తే, అలవాటు పడిపోతాయి. ఎంతోకాలం నుంచి, ఇలాటి పెంపకం జరుగుతోంది. కొన్ని పురాతన చిత్రాల వల్ల ఇది మనకి తెలుస్తోంది.

వేటకు, కళ్లకు గంతలు కట్టి తీసికొపోతారు. లేడి, దుప్పి కణుజు లాటివి కనబడగానే, గంతలు విప్పి వదులుతారు. చిన్న చిన్న దూరాలు ఎంతో వేగంగా పరిగెత్తడం వల్ల జంతువును పట్టి చంపివేస్తాయి. బహుమానంగా వీటికి ఆ జంతువు రక్తం తీసి తాగనిస్తారు!

—జమ్మి కోనేటిరావు

# ...బృహత్కథామంజరి

(11వ పేజీ తరువాయి)

దించాడు. అతడు ఒక యక్షిణిని వశపరచుకొన్నందున సంపాదించిన మహదైశ్వర్యాన్ని శ్రీదత్తునికి ఇచ్చి, మృగాంకవతికిని, అతనికిని కడువైభవంగా వివాహం జరిపించాడు. శ్రీదత్తుని అతని మిత్రులు కొంత కాలానికి కలుసుకున్నారు. తన పితృవ్యుని బుద్ధిబలంతో అతడు శూరసేన మహారాజ కుమార్తెను కూడా వివాహమాడి హస్త్యశ్వ సంపదను సంపాదించాడు.

కాలం గడిచింది. ఒకమారు శ్రీదత్తుడు ఎక్కడికో వెళ్ళుతూండగా అతనిని దారిలో దొంగల ముఠా అడ్డగించింది. అతడు మహా పరాక్రమంతో వారితో పోరి దొంగల నాయకుని హతమార్చాడు. కాని, దొంగలయిన శబరులు అతనిని బలవంతంగా పట్టి తమ పల్లెకు నడిపించుకొనిపోయారు. అది తను గాంధర్వవిధితో వివాహమాడిన శబరసుందరి గ్రామమే. అతనిని శబరులు చండికాలయానికి లాక్కుపోయారు. అక్కడ నర రక్తంతో తడిసి కరుడుగట్టిన బలి వేదిక వున్నది. అక్కడ అతనికి శ్రీదండుని తనయ, తన భార్య అయిన సుందరి, ఆమెకు కలిగిన తన కుమారుడు వీరసేనుడనేవాడు కనిపించారు. అతని మామగారు శ్రీదండుడు కీర్తిశేషుడయ్యాడు. సుందరి అతనికి అతని దివ్య ఖడ్గం, తన తండ్రినుంచి భద్రపరచినది, అప్పగించింది. శబరులు అతడు తమనాయకుని కుమార్తె భర్త అని తెలిసి, అతని అడుగులకు మడుగులొత్తారు.

తర్వాత, శ్రీదత్తుడు శబర రాజ్యం స్వీకరించాడు. మృగాంకవతి తండ్రి బింబక మహారాజ రాజ్యం అతనికి సంక్రమించింది. ఆ రెండు రాజ్యాల సైన్యంతో అతడు విక్రమశక్తి రాజ్యంమీదికి దండెత్తి, తన తండ్రిని వధించిన కోపం మిక్కుటం కాగా, అతనిని యుద్ధంలో పీచమడంచి, ముగ్గురు ప్రియురాండ్రతో సకల సుఖాలు అనుభవిస్తూ మూడు రాజ్యాలు పాలించాడు.

దేవా, శ్రీదత్తుడు ఈ విధంగా దుఃఖసముద్రం ఈది, సుఖశిఖరం పొందాడు.

**(ఇంకా ఉంది)**

చిత్రసమీక్ష :

# ముద్దుపాప

తల్లికి బిడ్డకి మధ్యనున్న అనురాగం ఎంత మహత్తరమైనదో, దేవుడికి— ఆ దేవుణ్ణి మనసారా ధ్యానించే మనిషికి మధ్య ఎంత సన్నిహిత సంబంధం వుంటుందో



'ముద్దుపాప'లో పద్మిని.

నిరూపించే కుటుంబ గాధాచిత్రం శ్రీరాజ్ ప్రొడక్షన్స్‌వారి 'ముద్దుపాప'.

లక్ష్మిని ప్రేమించి పెళ్లి చేసుకుంటాడు చంద్రం. అత్తమామలతో పాటు లక్ష్మికి కూడా పిల్లలంటే ఎంతో ఇష్టం. చాలాకాలానికి లక్ష్మి గర్భవతి అవుతుంది. ఆమెకి ఒక ముద్దయినపాప పుడుతుంది. ఆ పాపంటె ఆమెకి ప్రాణం. పాప సంరక్షణలో లక్ష్మికి గుండె జబ్బు ప్రవేశిస్తుంది. చంద్రం ఒక పెళ్లికి వెళ్తూ భార్యకి నచ్చచెప్పి బాబునుమాత్రం తనతో తీసుకువెళ్తాడు. పెళ్లిలో ఆపిల్లవాడు తప్పిపోతాడు. చంద్రం తిరిగివచ్చి భార్యకి ఎన్నో సాకులు చెబుతాడు. మొదట్లో నమ్మినా, తర్వాత్తర్వాత ఆమె అనుమానిస్తుంది. మానసిక వ్యాధితో మంచం పడుతుంది. బర్మానుంచి పిల్లలకోసం ఇండియా వచ్చిన ఒక జమీందారు దంపతులకి ఈ బాబు దొరుకుతాడు. ఆ విషయం పత్రికద్వారా తెలుసుకుని వాళ్ల దగ్గరికివెళ్లి పాపని చూస్తారు. జమీందారు భార్యకి పాపపై వున్న ప్రేమని చూసి భరించలేక లక్ష్మి తన బిడ్డని త్యాగం చేసినా, తన భార్య గర్భవతి అని తెలుసుకున్న జమీందారు తిరిగి పాపని లక్ష్మికి అప్పగించి కథని సుఖాంతం చేస్తాడు!

కథలో ఆదినుంచి చివరివరకు శ్రీ వేంకటేశ్వర మహత్యాన్ని చక్కగా ప్రచారం చేయడం జరిగింది. ఇంటర్‌వల్ దగ్గరనుంచి కథ వేగంగాను పట్టుగాను నడుస్తుంది. క్లయిమాక్సు చాలా బాగున్నది. కొన్నిచోట్ల సహజాసహజాల ప్రసక్తి వచ్చినా, కథావస్తువు జనాన్ని బాగా ఆకర్షిస్తుంది. నేరుగా నిర్మించే కొన్ని చిత్రాలకంటే కూడా ఉత్తమంగా వున్న 'ముద్దుపాప' సకుటుంబంగా చూసి ఆనందించ తగ్గ చిత్రం!

బేబీ రాణి, పద్మిని, జానకి, శివాజీగణేశన్, నగేష్, సూర్యకళ మొదలైనవారు ముఖ్య పాత్రల్ని ధరించిన ఈ చిత్రానికి దర్శకుడు కె. యస్. గోపాలకృష్ణ. సంగీతం మహాదేవన్, పామర్తి అందించారు. మాటలు పాటలు అనిసెట్టి రాశారు. నిర్మాతలు అభినందనీయులు.

—సికరాజు ●

నాటకసమీక్ష :

# నిర్మలానందం

లావణ్య ఫైన్ ఆర్ట్స్, మద్రాసువారు తమ ద్వితీయవార్షికోత్సవ సందర్భంగా యిటీవల స్థానిక రాజా అన్నామలై మన్‌రమ్‌లో మద్రాసు మేయర్ శ్రీ హబిబుల్లాబేగ్ అధ్యక్షతన 'నిర్మలానందం' అనే సాంఘిక నాటకాన్ని ప్రదర్శించారు.

ఈ నాటకంలో శ్రీయుతులు ఎ. పళనికుమార్, ఎ.ఎల్. సుందరరాజులు, ఎస్. నాగరాజు, హెచ్. ఎస్. సంజీవి, పి. జి. దేవరాజులు, పి. రామప్రభు, కె. ఎస్. జయరాం, కె. తులసీధరన్, ఆర్. చంద్రశేఖరరాజు, ఎ. కృష్ణమూర్తి, జి. కృష్ణమూర్తి, టి. జి. సుబ్రహ్మణ్యం, ఎ. మెహబూబ్, కె. ఎస్. సంతానం, పి. శ్యామసుందరరావు, ఎస్. పి. శ్రీరాములు, ఎ. సురేష్‌కుమార్, పి. ఎస్. జానకిరాం, పి. ఎస్. దీనదయాళు, కుమారి రమాదేవి, కుమారి పద్మ నటించారు. నటీనటులందరూ తమ తమ పాత్రల అవధులమేరకి నటించి నాటకాన్ని రక్తి కట్టించారు.

శ్రీ కె. ఆర్. ప్రేమ్‌కుమార్ దర్శకత్వంలో ప్రదర్శించబడిన ఈ నాటకానికి శంకరన్ అండ్ పార్టీ సంగీతాన్ని అందించారు. శ్రీ బసవేశ్వర్, కుమారి రాజం లు పాటలని వీనులవిందుగా పాడారు. శ్రీ పి. సురేష్‌కుమార్ గిటార్ వాయిద్యం ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకున్నది.

ఈ నాటకానికి కథ మాటలు శ్రీ 'శ్రీహరి', పాటలు శ్రీ శ్రీహరి, శ్రీ రాజశ్రీలు రాశారు. వీరు ఇంకా కృషిచేసి చక్కని నాటకాల్ని మద్రాసు తెలుగు ప్రేక్షకులకు అందిస్తారని ఆశించవచ్చు.

ఎం. ఆర్.

# దర్శకుడు శ్రీ నమ్మాళ్వార్ మరణం

'మాలపిల్ల'నుంచి 'రక్తసిందూరం'వరకూ పలు చిత్రదర్శకత్వంలో వివిధ రకాలబాధ్యతల్నినిర్వహించిన శ్రీ నందూరి నమ్మాళ్వార్ తమ భార్య అయిదుగురు కుమార్తెలు, ఇద్దరు కుమారులని వదలి మార్చి 21 తేదీ రాత్రి గొంతుకి సంబంధించిన కాన్సర్ వ్యాధితో మద్రాసులో మరణించారు.



నమ్మాళ్వార్.

ప. గో. జిల్లా తణుకులో 1918 జన్మించిన శ్రీ నమ్మాళ్వార్ 1936లో మద్రాసు వచ్చి కీ. శే. గూడవల్లి రామబ్రహ్మంగారి వద్ద సహాయ దర్శకునిగా చేరారు. అనేక చిత్రాలలో సహాయ దర్శకునిగా అనుభవం సంపాదించిన అనంతరం 'శ్రీరామాంజనేయ యుద్ధం', 'విష్ణుమాయ' చిత్రాలకి స్వయంగా దర్శకత్వం వహించారు.

ఇటీవలి 'భామా విజయం', 'రక్తసిందూరం' చిత్రాలకి సహకార దర్శకునిగా పని చేశారు శ్రీ నమ్మాళ్వార్. ●

# సినిమా

ఉదయశ్రీ పిక్చర్స్ నిర్మించిన 'అమాయకుడు' షూటింగు సారథిలో ఈ షెడ్యూలుతో పూర్తయింది. శ్రీమతి జమున, కృష్ణ, జి. వరలక్ష్మి, గుమ్మడి ముఖ్య పాత్రలను పోషించారు. రేలంగి, కళ్యాణి, ముక్కామల సహాయ భూమికల్ని ధరించారు. శ్రీ అడ్డాల నారాయణ దర్శకత్వంలో తయారైన ఈ సాంఘిక చిత్రంలో శ్రీ శంకర్ సంగీతాన్ని వినిపించారు. శ్రీ ఎం. కె. రాజు ఛాయాగ్రహణం నెరపారు.

## 'అతిథి సత్కారం అనిర్వచనీయం'

బాలా ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'బంగారు సంకెళ్ళు' చిత్రం యొక్క షూటింగు ఏలూరులో పదిరోజులపాటు జరిగింది. ఎడ్లపందేపోటీ బ్రహ్మాండంగా జరిగినట్లు, అక్కడివారు యీ యూనిట్‌కు పెండ్లి భోజనాల్ని యేర్పాటు చేసినట్లు, అతిథి సత్కారం అనిర్వచనీయమయిన ఆనందాన్ని అందించినట్లు ప్రముఖ నటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు వ్యక్తపర్చారు. 'బంగారు సంకెళ్ళు' చిత్రంలో హరనాథ్, జమున, గుమ్మడి, వరలక్ష్మి, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రమాప్రభ ముఖ్య పాత్రల్ని ధరిస్తున్నారు. శ్రీ జి. రామినీడు యీ చిత్రాన్ని తన పేరుకు భంగం రాకుండా బాక్సాఫీస్ సూత్రాల్ని జతపరుస్తూ, విజయవంతమయ్యేవిధంగా నిర్మిస్తున్నారు. ఈ చిత్రాన్ని శ్రీ సత్యనారాయణ, విక్రం సి. హెచ్. నిర్మిస్తున్నారు. మే మాసంలో పూర్ణా ద్వారా యీ చిత్రం విడుదలవుతుందని నిర్మాతలు వ్యక్తపర్చారు. శ్రీ వెంకన్నబాబు నిర్వహణలో చిత్రం, షెడ్యూలు ప్రకారం షూటింగు జరుపుకుంటూ వుంది.

## 'చిలకా గోరింకల్లా ఉన్నాం'

ఇటీవల వివాహిత అయిన శ్రీమతి దేవికను 'తారాశశాంకం' సెట్స్‌లో కలిసినప్పుడు 'ఏమిటమ్మా, పెండ్లి అయి మూడుమాసాలు కావస్తుంది గదా, మీ సాంసారిక జీవితం ఎలావుంది' అని ప్రశ్నించాను.



'ప్రేమకథ'లో కె. ఆర్. విజయ.

'మేమిద్దరం అన్యోన్యంగా ప్రేమించుకుని పెళ్లి చేసుకున్నామండీ. మేమిద్దరం చిలకా–గోరింకల్లా వున్నాం' అన్నది దేవిక. మరి మీ ఆహ్వానం మాకంద లేదని అడిగాను. ఆమె నవ్వుతూ 'అది కావాలని చేసింది కాదండీ. మేము మార్చిలో పరిణయమాడదల్చాము, కానీ ఆ తేదికి ఆల్ ఆఫ్ ఎ సడన్ ఫిక్స్ అయింది. అందుకే గుట్టు చప్పుడు లేకుండా ఆ ఏడుకొండల స్వామి సన్నిధిలో పెళ్లి చేసుకున్నాం' అన్నది.

* * *

ఏప్రిల్ ఒకటవ తేదీ మధ్యాహ్నం 3 గంటల ప్రాంతం వాహిని స్టూడియో జన సందోహంతో నిండిపోయింది. ఏమిటబ్బా అని తీరా చూస్తే విశాల్ కంబైన్స్ షూటింగు ప్రారంభం. పద్మశ్రీ రామారావు, భారతి, రమణారెడ్డి, సూర్యకాంతం, రావి కొండలరావు, బాలకృష్ణలకు సంబంధించిన సన్నివేశాన్ని యువదర్శకుడు శ్రీ బి. వి. శ్రీనివాస్ చిత్రీకరించారు. హాస్యరసానికి ప్రాధాన్యత ఇవ్వబడిన యీ చిత్రానికి శ్రీ జి. కృష్ణమూర్తి సంభాషణలు వ్రాశారు. విజయ కృష్ణమూర్తి, శ్రీ నారాయణరెడ్డిల సంగీత, సాహిత్యాలు రసస్పందన కల్గిస్తాయి. ఈ చిత్రానికి 'నిప్పే పెళ్లాడ్తా' అని పేరు పెట్టారు. ప్రతిరోజు ఉదయం 7 గంటల నుండి మధ్యాహ్నం ఒంటి గంట వరకు పద్మశ్రీ

## ఏప్రిల్ ఫూల్స్ అయిన తారలు

### గీతాంజలి

అది ఏప్రిల్ 1వ తారీకు. అదృష్టవశాత్తు ఆరోజు గీతాంజలికి షూటింగు లేదు. ఇంట్లోనే పిచ్చాపాటీ మాట్లాడుతూ వుండింది. షుమారు 12 గంటల ప్రాంతం ఫోను రింగ్ అయింది. గీత అందుకుంది. 'హల్లో! నేను, నీ స్నేహితుడ్ని చూడు, యీ రోజు మధ్యాహ్నం ఒంటిగంటకు నానాటకం రేడియోలో ప్రసారమవుతుంది. తప్పక వింటావుగా' అన్నది అవతలిగొంతు. ఓ. ఎస్. తప్పకుండా అని గీత ఫోను పెట్టేసింది. భోజనాలు అయిన తర్వాత రేడియోను త్రిప్పింది, త్రిప్పింది మూడ గంటల వరకు. కానీ, ప్రోగ్రాము రాలేదు. ఒకవేళ నా రేడియో రిపేరా అని సందేహపడుతున్న తరుణంలో మరలా రింగ్ అయింది ఫోను. గీత తీసుకుంది. ఏమిటీ, మీరేనా, మరి ప్రోగ్రాం అన్నారు ఏదీ రాందే అన్నది. అవతలిగొంతు విరగబడి నవ్వుతూ "అయ్యో అయ్యో ఏప్రిల్‌ఫూల్ అయ్యావ్" అని వేళాకోళం చేసింది.

### శోభన్ బాబు

వాణిశ్రీ కాలు జారి క్రింద పడింది: అన్నాడు శంభూ యూనిట్‌లో ఒకరు శోభన్‌తో. అంతే అదిరి పడ్డాడు శోభన్. మేకప్‌తోనే ప్రయాణమయ్యాడు కారులో వాణిశ్రీ యింటికి. ఆమె మేకప్‌తో కారులో కూర్చునేందుకు సిద్ధమవుతూంది. 'ఏమిటీ వాణీ, నీవు కాలు జారి పడ పడ్డావు' అని అనబోయాడు. 'ఆ, వచ్చారు బోల్తా. ఈరోజు ఏప్రిల్ ఫస్టు కదండీ. ఎవరయినా మిమ్మల్ని ఫూల్‌ని చేసివుంటారు' అన్నది వాణిశ్రీ.

### మీనాకుమారి

ఏమమ్మా, మీనా, అని బయటినుండి పెద్దకేక విన్పడింది. మీనా ఆదుర్దాగా బయటికి వచ్చి ఏమిటి అని అడిగింది. నీకు జెమినీలో వ్యాంప్‌రోల్ ఫిక్స్ చేశారు అన్నది. మీనా ఆనందానికి అంతులేదు. వెంటనే ఫోను చేసింది కావలసినవాళ్ళకంతా. పాపం, అమాయకురాలు అంతలోనే అంత ఆనందమా! జెమినీకి ఫోను చేసేసింది. కాని, రిసీవర్‌ను ఎవ్వరూ ఎత్తలేదు. అంతలో ఫోనురింగ్ అయింది. విషయం ఏమిటో తెలుసా? 'నేను, వీరాజుని. యిందాకా నేనే పంపించా జెమినీ కబురు. 'ఏప్రిల్‌ఫూల్' అన్నది గొంతు.

# సినిమా

రామారావు, భారతిలకు సంబంధించిన ముఖ్య సన్నివేశాలు వాహిని స్టుడియోలో చిత్రీకరణ జరుగుతూ వుంది. ఈ చిత్రాన్ని శ్రీనివాస్ తన తండ్రి ఆశీర్వాద బలంతో, విశ్వనాథం సహకారంతో సర్వాంగ సుందరంగా వుండేట్లు నిర్మిస్తున్నారు.

*   *

ఏప్రిల్ 3వ తేదిన శ్రీదేవీ కంబైన్సు 'చుట్టరికాలు' చిత్రం ప్రారంభించబడింది. వీనస్ స్టుడియోలో ఉదయం 9 గంటలకు పద్మశ్రీ రామారావు కెమరా మీటను నొక్కారు. మొదటి షాట్ రేలంగిపై తియ్యబడింది. ప్రారంభ పూజకు శ్రీయుతులు విశ్వేశ్వరరావు, జగన్నాథరావు, పుండరీకాక్షయ్య, ఎస్. భావనారాయణ, డి. ఎల్. నారాయణ, గుమ్మడి, చలపతిరావు, ఎం. ఎస్. రెడ్డి, బి. ఎ. సుబ్బారావు, జగ్గయ్య, శోభన్‌బాబు, ఛాయా దేవి, జయంతి విచ్చేసి దర్శక, నిర్మాతలయిన శ్రీ పేకేటిని, తోట సుబ్బారావును ఆశీర్వదించారు. జ్యోతిపిక్చర్స్ అధినేత శ్రీ నారాయణరావు క్లాప్ కొట్టారు. నెల్లూరు శ్రీమంతుడయిన శ్రీ రేబాల లక్ష్మినర్సారెడ్డి అధ్యక్షతను ఈ ప్రారంభోత్సవం గణనీయంగా జరిగింది. ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, శోభన్‌బాబు, జయంతి, కుమారి లక్ష్మి, హేమలత, రమాప్రభ, అల్లు రామలింగయ్య, బాలకృష్ణ, విజయశ్రీ, చిరంజీవులు ప్రభ, ఆదినారాయణ ధరిస్తున్నారు. చిత్ర కథను శ్రీ తా. రా. సుబ్బారావు వ్రాసారు. సంభాషణలను పద్మరాజు, పాటలను దాశరథి, కొసరాజు, నారాయణరెడ్డి, శ్రీశ్రీలు రచించారు.

ఛాయా గ్రహణాన్ని శ్రీ వెంకటరత్నం; కూర్పును గోపాలరావు, నృత్యాన్ని జయరాం; అర్టును వాలి, దుస్తులను నారాయణమూర్తి నిర్వహిస్తున్న యీ చిత్రాన్ని పేకేటి దర్శకత్వంలో తోట సుబ్బారావు మూడు మాసాల్లో పూర్తి చేయాలని నిర్ణయించుకున్నారు. శ్రీ ఘంటసాల సంగీత సారధ్యంలో పి. బి. శ్రీనివాస్, సుశీల పాడిన యుగళగీతాన్ని శ్రీ దాశరథి యీ క్రిందివిధంగా వ్రాసారు.

'చల్లనిగోదారి తల్లి,
మనపాలిటి పాలవెల్లి'

ఈ పాటను పుణ్యగోదావరి నదీతీరములో శోభన్, లక్ష్మిలు ఆనందతరంగాల్లో తేలియాడుతూ పాడుతారు.

*   *   *

వాణిశ్రీ, గీతాంజలి అక్కచెల్లెళ్ళు. వీరిద్దర్ని కన్నతండ్రి గుమ్మడి. దొమ్మరి వంశానికి చెందిన యీ కన్యలను శోభన్‌బాబు ఆరితేరిన నృత్య కళాకోవిదుల్ని చేస్తాడు. అంతటితో వూరుకోక వీరిద్దరి చేత దేశంలోని ప్రముఖ నాట్యకత్తెలను ఓడింపచేస్తాడు. చిన్నదాన్ని ప్రేమిస్తాడు; కానీ పెద్దది యితడ్ని వరిస్తుంది. వీరిద్దరిలో యెవర్ని వివాహమాడాలో తెలియక తికమక పడ్తాడు శోభన్‌బాబు. ఎవర్ని పెండ్లి చేసుకుంటాడో, అసలు ఏమయిపోతాడో అవే అంశం మీకు వదిలేస్తున్నాం. శంభూ ఫిలింస్ నిర్మిస్తున్న 'పంతాలు—పట్టింపులు' చిత్రం చూసిన తర్వాత మీకే తెలుస్తుంది, శోభన్‌బాబు సమస్యకు పరిష్కారం. శ్రీ కె. బి. తిలక్



'తిక్క శంకరయ్య'లో రామారావు, కృష్ణకుమారి.

దర్శకత్వంలో గుమ్మడి, శోభన్, రమణారెడ్డి, ప్రసాద్, వాణిశ్రీ, గీతాంజలి, లీలాగాంధి ప్రధాన పాత్రలను పోషించారు. పెండ్యాల పసందయిన సంగీతాన్ని నిర్వించారు. లక్ష్మణగోరే కెమెరా. శ్రీ దగ్గుబాటి లక్ష్మినారాయణచౌదరి నిర్మిస్తున్న యీ సాంఘిక చిత్రాన్ని పూర్తి విడుదల చేస్తారు.

*

మాతా ఫిలింస్ నిర్మించే 'చిన్నారి మనసులు'కు మన సావిత్రిగణేష్ దర్శకులని మాత్రమే మీకు తెలుసు. కానీ, యీ చిత్రంలో యీ‌ామె ఒక ముఖ్యపాత్రను కూడ ధరిస్తుంది. డాక్టరు భూమికలో సావిత్రి శీవిని, దర్పాన్ని చూస్తుంటే యీ నటి ఏ పాత్రలోనయినా తానై పోతుందా అనిపించింది.

'చిన్నారి మనసులు'లో జగ్గయ్యకు యిద్దరు భార్యలు. మొదటి పెళ్ళానికి పుడ్తుంది రోజారమణి. రెండో ఆవిడకి జనిస్తుంది శాంతి. మొదటావిడ మరణించినా, ఆమె బిడ్డపై రెండవ భార్యకు కోపం, అసూయ, ద్వేషం తగ్గలేదు. కానీ ఆమె రాతిగుండెలో హఠాత్తుగా

## సినిమా డైరీ

- శ్రీదేవి కంబైన్స్ పద్మశ్రీ రామారావు, భారతిలతో "సమయం" అనే సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తారు.
- శ్రీ ఎస్. భావనారాయణ "చక్రవర్తి విక్రమార్క" చిత్రాన్ని పద్మశ్రీ ఎన్. టి. ఆర్.తో తీస్తున్నారు.
- వాహిని పిక్చర్స్ "బంగారు పంజరం" చిత్రంయొక్క అవుట్‌డోర్ షూటింగు శ్రీశైలంలో జరుగుతుంది.
- శ్రీ విఠలాచార్య కుమార్తె వివాహం ఏప్రిల్ 18న జరుగుతుంది.
- చక్రవర్తిచిత్ర "సుడిగుండాలు" ఇంటర్నేషనల్ ఫిలిం ఎంట్రీగా ఢిల్లీకి ప్రదర్శన కొరకు పంపబడింది.
- శ్రీ ఆదుర్తి చాలకాలం తర్వాత ప్రేమాచిత్ర నిర్మిస్తున్న తమిళ చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తున్నారు. ఈ చిత్రంలో పద్మశ్రీ శివాజీ, పద్మిని ప్రధానపాత్రధారులు.

# మీకు తెలుసా?

పద్మశ్రీ నాగేశ్వరరావు 'సీతారామ జననం'లో స్వంత గొంతుతో పద్యాలను బ్రహ్మాండంగా పాడారు.

పేవ్‌మెంట్ మీద నిలబడి మద్రాసు లోని హైకోర్టును చూస్తున్నప్పుడు నటి రమాప్రభను ఒక నాటక కంపెనీ వాళ్ళు తమ ట్రూపులో చేర్చుకున్నారు.

పద్మశ్రీ అక్కినేని తన సహధర్మచారిణితో సభల్లోనూ, సన్మానాల్లోనూ పాల్గొనడం సరదా. అంటే అర్ధాంగి అనే పదానికి సంపూర్ణ న్యాయాన్ని చేకూరుస్తున్నారన్నమాట.

శ్రీ టి. ఎల్. కాంతారావు సినీ నటుడిగా వుండక పోయినట్లయితే, కరణీకం చేస్తూ వుండేవారు.

హాస్యనటుడు బాలకృష్ణకు చార్లీ చాప్లిన్‌లాగా నటించాలనే సంతం, పట్టుదల సదవ యేటనే పుట్టాయట.

అనవసరమయిన అపనిందకు పాలయిన శ్రీమతి అంజలీదేవికి హైకోర్టులో న్యాయం చేకూరింది. నిర్దోషిగా నిర్ణయింపబడింది.

నిర్మాత రామానాయుడుకు సరదాగా జోక్సు విసరడమంటే బ్రహ్మానందంగా భావిస్తారు.

నిర్మాత శ్రీ పి. ఎ. పి. సుబ్బారావు సర్వవేళలా చిరునవ్వుతోనే సాక్షాత్కరిస్తారు.

నటుడు పద్మనాభం చేతి మీదుగా ప్రతిరోజూ యెవరయినా ఒకరు యేదేని సహాయం పొందక మానరు.

హాస్యనటుడు రాజబాబు తన భార్య అజ్ఞలేనిదే యే పనీ చెయ్యడు.

నటి మీనాకుమారికి కుక్కపిల్లలతో ఆడుకోవడం, ట్రాన్సిస్టర్ పెట్టుకోవడమంటే సరదా.

వూహించరాని మార్పు వచ్చింది. ఈ హఠాత్పరిణామానికి కారణం ఏమిటో తెలుసా? ఒకనాడు కాంతిని పాము కరుస్తుంది. ఆ భయంకరదృశ్యాన్ని కొండంత దూరంనుండి చూసిన రోజా రమణి ఆ విషాన్ని మింగేస్తుంది. అంటే ఆమె ప్రాణానికి తన ప్రాణం అడ్డు వేసిందన్నమాట. ఈ కరుణాత్మకమయిన కార్యాన్ని చూచిన సవతితల్లికి ఆ పసిపాపపై యెనలేని జాలి, అభిమానం ఏర్పడ్డాయి. ఆ పాపను కాపాడేందుకు సర్వవిధాలా ప్రయత్నిస్తుంది. ఇలాంటి హృదయాన్ని కరిగించివేసే, సన్నివేశాలు మిక్కుటంగావుండే మాతా ఫిలింస్ 'చిన్నారి మనసులు' మే మాసంలో మీ మనస్సుల్లో స్థానాన్ని ఏర్పరచుకునేందుకు ప్రయత్నిస్తుంది. మహిళలందరూ కలిసి చేపట్టిన ఊహ కార్యం సత్ఫలితాన్ని యివ్వగలదని ఆశిస్తారు. శ్రీమతి సావిత్రి దర్శకత్వంలో జగ్గయ్య, రంగారావు, పద్మనాభం, రేలంగి, రమణారెడ్డి, జమున, జానకి, సూర్యకాంతం, రమాప్రభ, బాలకృష్ణ, గుంటూరు వెంకటేష్, రోజారమణి, కాంతి ముఖ్యభూమిక ధరించారు. శ్రీమతి లీల సంగీత దర్శకత్వం ప్రథమంగా నిర్వహించి, మధురాతి మధురమయిన బాణీలను విన్పించారు. శ్రీయుతులు సింగ్, శేఖరుల ఛాయాగ్రహణం, నందనరావు యొక్క సహకార దర్శకత్వం చిత్రాన్ని చక్కగా తీర్చిదిద్దాయి.

* * *

పద్మశ్రీ, రామారావు భాగ్యనగరంలో నిర్మించిన 70 ఎం. ఎం. ఏర్‌కండిషడ్ థియేటరు మే మాసంలో ప్రారంభించబడుతుంది. భారతీయ కళా సంస్కృతుల్ని



'దేవకన్య'లో కాంచన, రాజనాల.

అత్యద్భుతంగా తాను నిర్మించిన థియేటర్లో చెక్కించారు శ్రీ రామారావు.

*  *  *

నిర్మాత రామానాయుడు ఒకేసారి రెండు తెలుగు చిత్రాలను నిర్మించడానికి నిశ్చయించారు. ఒక చిత్రంలో పద్మశ్రీ రామారావును నాయకుడిగా ఒప్పించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. మరి యొక చిత్రంలో కృష్ణ నాయకుడిగా వుండగలడు. శ్రీ ఎన్. టి. ఆర్. చిత్రానికి ప్రముఖ దర్శకులు కామేశ్వరరావు నిర్దేశకులుగా వుండొచ్చు. కృష్ణ నటించే చిత్రానికి జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకుడు. ఒకదానికి సముద్రాల (జూనియర్), మరి యొకదానికి ఆరుద్ర రచన సాగిస్తున్నారు. మొదటిది జానపదమయితే, రెండవది సస్పెన్స్ థ్రిల్లర్. రెండింటి షూటింగు మే రెండవ వారంలో ప్రారంభించదల్చినట్లు నాయుడు వెల్లడించారు. ఈ రెండూగాక తమిళ 'పాపకోసం' కూడ మే లోనే ప్రారంభమౌతుంది. శ్రీ మాధవన్ దర్శకుడిగా, విశ్వనాథం సంగీత సారథిగా వుండగల తమిళ చిత్రంలో పద్మశ్రీ శివాజీ, రవిచందర్, పద్మిని, జయశంకర్, నాగేష్



'మంచి కుటుంబం'లో
విజయనిర్మల, కృష్ణ.

ప్రధాన పాత్రలను పోషించగలరని వ్యక్తపర్చారు.

*  *  *

హాస్య నటనలో కొత్త రికార్డును నిర్పరచిన పద్మనాభం 'శ్రీరామ కథ' చిత్ర దర్శకత్వంలో డైరెక్షన్‌లో కొత్తదనాన్ని సృష్టిస్తారేమో ననిపించింది యిటీవల వారి టేకింగ్‌ను చూసినప్పుడు. అవతార పురుషుడయిన శ్రీరామచంద్రుని కథను వెండితెరపై మనం చూచివున్నాం. కానీ నారదుడికి, శ్రీరామకథకు గల సంబంధాన్ని సమంజసంగా చిత్రింపచేయడమే ఈచిత్రంలోని ముఖ్యాంశం. ఈ చిత్రంలోని మరో విశేష మేమిటంటే — వెండితెరపై ప్రముఖులుగా వుండే నటీనటు లందరూ రామాయణ పాత్రలను ధరించడమే. 'శ్రీరామ కథ' లో హరనాథ్, జయలలిత, పద్మనాభం, శారద, రామకృష్ణ, గీతాంజలి, గుమ్మడి, అంజలీదేవి, రేలంగి, సూర్యకాంతం, రాంమోహన్, నాగయ్య, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, ముక్కామల, ధూళిపాళ, మాలతి, హేమలత, నిర్మల, లక్ష్మీకాంతమ్మ, విజయలలిత, రమాప్రభ, బాలకృష్ణ లాంటి ముఖ్య నటులు యేదో ఒక పాత్రలో కన్పడి ప్రేక్షకులకు కన్నులపండువ చేస్తారు. శ్రీ కోదండపాణి చెఱకుగడలాంటి మనిషి. అందుకే ఆయన విన్పించే సంగీతం తియ్యగా వుంటుంది ఈ చిత్రానికి వీటూరి సంభాషణలను వ్రాసారు.

—శ్రీనివాస్.

లవ్‌కుమార్: బొమ్మల కథ: సత్యమూర్తి

14

కొంచెంసేపయ్యాకా టెలిఫోన్ మ్రోగుతుంది—

...నేనండి. కుమార్‌ని. ఇందాకా మీరువస్తున్నారని హడావిడిగా హోటల్లో మెట్లుదిగివస్తుంటే జారి పడ్డాను. వెంటనే హాస్పటల్‌కెళ్ళాల్సి వచ్చింది. అందువలన మీరు వచ్చినప్పుడు నేను ఇక్కడ లేనండి.

అరెరె పాపం...సరే నువ్వక్కడే వుండు నేను మళ్ళీవచ్చి తీసుకెళ్తా

అబ్బే ఎందుకండి మళ్ళీ మళ్ళీ శ్రమ. నేనే వెతుక్కు వస్తా లెండి.

కొంతసేపట్లో కుమార్ ప్రవేశిస్తాడు—

నమస్కారమండి.

ఎవరు నువ్వు?

నేను, నారాయణరావుగారబ్బాయి కుమార్‌నండి

అరెరె నువ్వటోయ్!

గబుక్కున తానమాలు కట్టలేకపోయాననుకో ఎంత మారిపోయావ్....మొన్నమధ్యనే మీనాన్న దగ్గర్నుంచి ఉత్తరమొచ్చింది. కూచోకూచో ఆ ఉత్తరం పట్టుకొస్తా...

అని ఇంకో గదిలోకెళ్ళి—

ఆ ఉత్తరం ఎక్కడపెట్టాను ఎక్కడపెట్టాను

ఇంతలోకి ఇందిర నాన్నగారి కోసం కాఫీ తీసుకుని హాల్లోకి ప్రవేశం—

ఆ...మీరా? ఎందుకొచ్చారు

నీకోసమే

"♡"

?!!!

# పుస్తకాలు

## బుద్ధుని జాతక కథలు

రచన: శ్రీ శివశంకరస్వామి. పాకెట్ సైజు. 206 పుటలు. వెల రెండు రూపాయలు. ప్రకాశకులు యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్.

బౌద్ధమత ప్రవర్తకుడు తథాగతుని పూర్వ జన్మలను గురించిన జాతక కథలు ఎన్నో ఉన్నాయి. అవన్నీ ప్రాకృతభేదమైన పాళీభాషలో ఉన్నాయి. వాటిలో కొన్ని కథలు వేర్వేరు నామాలతో గద్య రూపంగానూ, పద్య రూపంగానూ కూడా తెలుగులోకి కొన్ని దశాబ్దాల కిందటి నుంచీ వస్తున్నాయి. వాటిలో చాలావరకూ మూలానికుండే భాషాంతరానువాదాల మీదే ఆధారపడి ఉన్నందున, మూలాభిప్రాయాన్ని చక్కగా తెలుపుతున్నాయో లేదో అనే సందేహానికి అవకాశం వుంది. ఈ గ్రంథం మాత్రం పాళీభాషను అనుసరించే కూర్చబడడం దీని వైశిష్ట్యాన్ని తెలుపుతుంది.

రచయిత శ్రీ శివశంకరస్వామిగారు బహు భాషావేత్తలు. అనేక శాస్త్రాలను పుణికి పుచ్చుకున్న ప్రతిభావంతులు. మిక్కిలి రసవంతంగా అనేక రచనలు సాగించిన విద్వత్కవివతంసులు. పాళీ భాషలో పాండిత్యం గడించిన ఏ కొద్దిమందిలోనో స్వామీజీ ఒకరు. జాతక కథలను చెప్పే ఇతర గ్రంథాల కంటె ఈ గ్రంథం ఉత్తమంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. శ్రీ స్వామివారు జాతక కథల్లో ముఖ్యమైన వాటిని ఏర్చి, కూర్చి దీన్ని తయారు చేశారు.

వచన రచనలు వ్యావహారిక భాషలో ఉంటేనే రసవంతంగా ఉంటాయనీ, అందరికీ సుబోధమవతాయనీ యిప్పట్లో చాలామంది అనుకోవచ్చు. గ్రంథ ప్రాశస్త్యం రచయిత శక్తిసామర్థ్యాలపై ఆధారపడి వుంటుంది గాని భాష మీద కాదు. గ్రాంధిక వ్యావహార భాషల్లో సవ్యసాచులైన శ్రీ శివశంకరులు ఏ రీతిని వ్రాసినా హృదయంగమంగానే వుంటుంది. ఈ గ్రంథం చక్కని సరళ గ్రాంధిక భాషలో నూతన శైలిలో రచించబడింది. అక్షరాస్యులందరూ సులభంగా అర్థం చేసుకుంటూ అత్యుత్సాహంతో పఠించగలరు. ఇట్టి రచనను కూర్చిన శ్రీ శివశంకరస్వాములకున్నూ, ప్రకటించిన శేషాచలం కంపెనీ వారికిన్నీ అభినందనలు. జాతక కథలపై ఆసక్తి వున్న అందరూ దీన్ని చదవడం మేలు.

—ఆంగీరస ●

ఆటలు

# ఆటగాళ్ళ ఎన్నికలో రాజకీయాలు



1968 డేవిస్ కప్ టెన్నిస్ మొదటి పోటీ ఏప్రిల్ 26 న షిల్లాంగ్ లో ఇండియా సిలోన్ తో ఆడుతుంది. ఆర్ కృష్ణన్ అందుబాటులో లేనందువల్ల భారతజట్టులో ప్రేమ్ జిత్ లాల్, జయదీప్ ముఖర్జీ, శ్యామ్ మినోత్రాతో పాటు జూనియర్ అయిన ఆనంద్ అమృత్ రాజ్, గౌరవ్ మిశ్రాలు ఉండవచ్చు. జూనియర్లని బృందంలో చేర్చుకోవడం మంచిదే. ఎందుకంటే వారికి ప్రోత్సాహాన్నిచ్చినట్లు ఉండటమే కాకుండా భవిష్యత్తులో మంచి బృందాన్ని తయారుచేయడానికికూడా వీలవుతుంది.

ప్రేమ్ జిత్ లాల్ మంచి ఆటకాడు అన్ని ఇండియన్ టోర్నమెంట్స్ లో ఆడాడు. అతను అన్ని పోటీల్లో గెలుస్తాడనే నానమ్మకం. ముఖర్జీ చాలా టోర్నమెంట్లలో ఆడకపోయినా సిలోన్ జట్టులో అంత గట్టి ఆటకాళ్ళు లేరు కాబట్టి గెలిచే అవకాశం ఉంది.

ఇక పత్రికలని బట్టి చూస్తే మినోత్రా మూడో సభ్యుడు అనిపిస్తుంది. ఎలాంటి పరిస్థితులనైనా తట్టుకోడానికి డేవిస్ కప్ బృందంలో నలుగురు సభ్యులుండాలని నేను ఎప్పుడూ అంటూనే ఉన్నాను. ఆంధ్రప్రదేశ్ అగ్రశ్రేణి ఆటగాడు ఎస్. పి. మిశ్రా, మద్రాసు ఆటగాడు రాబి వెంకటేశన్ ఎన్నో సందర్భాలలో ఇండియన్ జట్లలో ఉన్నారు. వారిని దీనిలో చేర్చుకోలేదు. ఇటీవల మద్రాసులో మినోత్రాని చూశానుకానీ ఎస్. పి., రాబిలకంటే ఏవిధంగానూ అధికుడుకాడు. మంచి స్ట్రోక్స్ కొడతాడు కానీ అవిమాత్రమే ఆట గెలవడానికి చాలవు.

ఎస్. పి. మిశ్రా నేషనల్ ఛాంపియన్ అయిన లాల్ పై మార్చి 31 న బొంబాయిలో జరిగిన వెస్టరన్ ఇండియా ఛాంపియన్ షిప్ లో ఘనవిజయాన్ని సాధించాడు. లాల్ తో కలిసి డబుల్స్ లో ప్రత్యర్థులని ఓడించాడు. మిశ్రా చక్కని ఆల్ రౌండ్ (స్ట్రోక్స్) కొట్టగల మంచి ఆటగాడు. మినోత్రాకంటే ఆటలో చురుకుగా ఉంటాడు. అంత తీవ్రమైన ఆటకాడు కాదనే వాదం ఉన్నా వెంకటేశన్ కూడా మంచి ఆటకాడే. ఆల్ ఇండియా లాన్ టెన్నిస్ అసోసియేషన్ వర్గాలలో తీవ్ర దుష్ప్రచారానికి గురి అయినాడు మిశ్రా (1966 లో డేవిస్ కప్ కోసం ఇరాన్ వెళ్ళినప్పటి నుంచీ). కిందటేడు విదేశాలకి వెళ్ళడానికి అతనికి అనుమతి యివ్వలేదు. రాజకీయాల కారణంగానే అతన్ని విస్మరించడం జరిగింది. ఆ. ఇ. లా. టె. అ. లోని రాజకీయాలు నాకు తెలుసు. ఆంధ్రప్రదేశ్ పై ఆ. ఇ. లా. టె. అసోసియేషన్ కి సదభిప్రాయం లేకపోవడం, అసోసియేషన్ పెద్దలని వ్యతిరేకించడమే దీనికి కారణం. నేషనల్ ఛాంపియన్ ని ఓడించిన ఆటగాడిని విస్మరించడం మంచిదికాదు. వెంకటేశన్ ని వదిలేయడంకూడా సమంజసంకాదు.

* ● *

జార్జిటవున్ లో ఏప్రిల్ 8 వ తేదీన ప్రపంచ క్రికెట్ ఆటగాళ్ళు అయిన వెస్టిండీస్ పై విజయాన్ని సాధించి ఇంగ్లండ్ రబ్బర్ గెలుచుకున్నది. నాలుగో టెస్టులో అద్భుతంగా బాట్ చేసిన కవుడ్రే 3 వ తేదీన ఇంగ్లండ్ పరాజయం పాలుకాకుండా కాపాడాడు.

—కె. ఎస్. నరసింహన్

**జవాబులు:**

(క) ఆహాస్పిటలులో 7 మంచా లున్నాయి. గాయపడ్డవారు ఏడుగురే.

ఎడమచెయ్యి మాత్రమే విరిగినవారు ఇద్దరు, కుడిచెయ్యిమాత్రమే విరిగినవారు ముగ్గురు, రెండుచేతులూ విరిగినవారు ఇద్దరు.

*　　*　　*

(చ) మొత్తం 18 వేరువేరు రకాలుగా సిలువలు తయారుచేయవచ్చును. అడ్డవరుసలలో ఉండే ఐదు పేకముక్కలనూ ఇక్కడ వ్రాస్తాను. (మిగిలిన నిలువువరుస ముక్కలు తెలుసుకోవడం ఎంతసేపు?)

(1) 5 6 1 7 4
(2) 3 5 1 6 8
(3) 3 4 1 7 8
(4) 2 5 1 7 8
(5) 2 5 3 6 8
(6) 1 5 3 7 8
(7) 2 4 3 7 8
(8) 1 4 5 7 8
(9) 2 3 5 7 8
(10) 2 4 5 6 8
(11) 3 4 5 6 7
(12) 1 4 7 6 8
(13) 2 3 7 6 8
(14) 2 4 7 5 8
(15) 3 4 9 5 6
(16) 2 4 9 5 7
(17) 1 4 9 6 7
(18) 2 3 9 6 7

*　　*　　*

(ఛ) వెంకప్ప చెప్పినదే నిజం.

క్షేత్రగణిత సూత్రాలప్రకారం గోళాకారపు వస్తువును సమతలం మీద ఉంచితే—ఆగోళం ఒకే ఒక్క బిందువు దగ్గర మాత్రమే సమతలానికి తగులుతుంది. భూమి ఒకగోళం అనుకుంటే దానిమీద ఒకసమతల మైదానం ఉంటే ఎల్లా ఉంటుందో ఇక్కడి బొమ్మలో చూపబడింది. గోళము సమతలానికి ఆనుకున్న బిందువు దగ్గర నిలుచున్న సైనికుడు (బొమ్మలో 3వ సైనికుడు) తప్ప మిగిలినవారెవ్వరూ నిట్టనిలువుగా నిలుచోలేదనే చెప్పాలి. ఇంకా సరిగ్గా తెలియలేదా? అసలు నిటారుగా నిలుచోవడం అంటే ఏమిటి? భూకేంద్రంనుంచి ఆ నిలుచున్నవ్యక్తిపాదం దగ్గరకు ఒక సరళరేఖగీసి ఇంకా పొడిగిస్తే వచ్చేదే నిట్టనిలువురేఖ. బొమ్మలో చిన్న చిన్న గీతలతో చూపినవి, ఆయా బిందువుల

## మెదడుకి మేత

(47–వ పేజీ తరువాయి)




దగ్గర నిట్టనిలువు రేఖలు. ఆరేఖ ఆవ్యక్తి తలమధ్యగా వెడుతూఉంటే అతడు నిట్టనిలువుగా నిలుచున్నట్లు లెక్క. బొమ్మలో 3వ సైనికునికి తప్ప మిగిలిన వారెవ్వరికీ ఈ నిర్వచనం సరిపోవడంలేదు. ఇక్కడి బొమ్మలో భూమి చిన్నదిగానూ సమతల మైదానం పెద్దదిగానూ ఉన్నట్లు బోధనా సౌలభ్యంకోసం చూపించాను గాని, సమతలం ఎంత చిన్నది అయినా ఈ వాదం సరియైనదే.

అయితే ఈ వాదంలో ఒక చిన్న లొసుగు ఉంది. అదేమిటంటే భూమి అచ్చంగా గోళాకృతిలో ఉన్నదనుకోవడమే. నిజానికి భూమి ధృవాలదగ్గర తప్పడగా ఉంది. కనుక, పైన వివరించిన తర్కం పూర్తిగా నిజంకాదు. ●

## ఆవేశాలూ...

(14వ పేజీ తరువాయి)

శవం దొరికింది. ఆమె గొంతుక నరకబడివుంది.

ఆమె పెరుమాళ్ళకి అన్నం పట్టుకు వెళ్ళినప్పుడు పొలంలో సుబ్రహ్మణ్యాన్ని చాలమంది చూశారు. అతను తను చేసిన పనికి కూలి ఇమ్మని గోవిందమ్మాళ్‌ని గట్టిగా అడగడం కూడా చాలమంది విన్నారు.

పోలీసులు సుబ్రహ్మణ్యాన్ని అరెస్టుచేసి ఖైదులో పెట్టారు. 1949 ఆగస్టు పదకొండవ తేదీన మేజిస్ట్రేటు ఎదుట నిలబెట్టారు. గోవిందమ్మాళ్ పెరుమాళ్ళకి అన్నం పట్టుకువెళ్ళి, ఇచ్చి వస్తున్నదారిలో ఆమెని చంపినట్లు అతను ఒప్పుకున్నాడు. స్వయంగా అపరాధాన్ని ఒప్పుకోవడం చాలా బలమైన సాక్ష్యంగా తయారైంది. అంతే కాకుండా — సుబ్రహ్మణ్యం దగ్గర గోవిందమ్మాళ్ మెడలో ధరించే రాళ్ళపతకం, హత్యాయుధంగా వుపయోగించిన కొడవలి లభించాయి. ఇవి సాక్ష్యాన్ని ఆధారయుతంగా రుజువు చేశాయి.

సుబ్రహ్మణ్యం తనకు తానుగానే హత్యాపరాధాన్ని ఒప్పుకున్న కారణంగా క్రింది కోర్టు అతనిని నేరస్థుడుగా నిరయించి మరణశిక్షని విధించింది.

సుబ్రహ్మణ్యం మద్రాసు హైకోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. జస్టిస్ గోవింద మీనన్ తీర్పు ఇచ్చారు.

'నిందితుడు స్వయంగా ఇచ్చిన వాంగ్మూలాన్ని కాదనడానికి వీలులేదు. అటువంటి సమయంలో 'బెనిఫిట్ ఆఫ్ డవుట్'ని బాగా ఆలోచించవలసి వుంటుంది. అందుచేత అతని దరఖాస్తును త్రోసివుచ్చడానికి వీలులేదు.'

సుబ్రహ్మణ్యం 'బెనిఫిట్ ఆఫ్ డవుట్' వల్లనే నిందితుడయ్యాడుగాని, అతను నేరస్థుడుగా కోర్టులో రుజువుకాలేదు. అందుచేత అతనుగాని, పెరుమాళ్ళుగాని ఇద్దరిలో ఎవరైనా గోవిందమ్మాళ్‌ని హత్యచేయడానికి అవకాశంవుంది. ఇద్దరూ చెరోవుద్దేశ్యంతో ఆమెకుమార్తెని పెళ్ళాడాలని అనుకున్నారు గనక గోవిందమ్మాళ్ ఆటంకంగా కనిపించి వుండవచ్చు. అందుచేతనే హత్య జరిగింది.

ఈ ఇద్దరి నిటులలో ఎవరు గోవిందమ్మాళ్‌ని హత్యచేసి వుంటారు? అవేది తెలుసుకోవడం కష్టమే! ●

**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

ఆబాలగోపాలాన్ని ఆనందాబ్ధిలో
ముంచెత్తుతున్న ఉత్తమచిత్రం
ఆజేమ్ ఆర్ట్సు

# తల్లి ప్రేమ

నిర్మాత: ఆజేమ్ దర్శకత్వం: శ్రీకాంత్



Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# తప్పక చూడండి!

జీవంలేని శిల్పాలకు
ప్రాణదానం చేయవచ్చు,
వర్షించని మేఘాలనుంచి సైతం
కుంభపోతలు కురిపించవచ్చు.
అంతేగాని, స్త్రీ మనసు
మార్చటం అసంభవం!




డి.వి.యస్. ప్రొడక్షన్స్

# తిక్కశంకరయ్య

దర్శకత్వం: డి.యోగానంద్   నిర్మాత డి.వి.యస్.రాజు

ఆంధ్ర-సీడెడ్: విజయ • నైజాం: ఉషా • మైసూరు సదరన్ మూవీస్

VIJAYA

STUDIO Ketha